1993-2013 నడుస్తున్న చరిత్ర



సంపుటి : 2
సంచిక : 4
రు. 20/-లు
తెనాలి

తెలుగుజాతి పత్రిక

# అమ్మనుడి

నుడి నాడు నెనరు

జూన్ 2016

మెలట్టూర్ భాగవతం
నేటి తమిళనాట
ఏళ్లతరబడిగా సాగుతున్న
తెలుగు నాటక ప్రదర్శన




బయటి తెలుగు
కతల మాలిక

ఓ సంచారి
అంతరంగం

ఈ
నెల నుండి
మొదలు...



ఆం.ప్ర.లో తెలుగును తలకెత్తుకొంటున్న ఎన్టీఆర్ ట్రస్టు



శ్రీ మండలి బుద్ధప్రసాద్ దంపతులను సత్కరిస్తున్న శ్రీ నారా లోకేష్, మంత్రి పల్లె రఘునాథరెడ్డి



సభలో మాట్లాడుతున్న మంత్రి పల్లె రఘునాథరెడ్డి



సత్కారం తర్వాత మాట్లాడుతున్న శ్రీ మండలి బుద్ధప్రసాద్



# శ్రీ మండలి బుద్ధప్రసాద్ షష్టిపూర్తి సందర్భంగా విజయవాడలో జరిగిన తెలుగు భాషాసాంస్కృతిక సమ్మేళనం

తెలుగు సాంస్కృతిక ప్రతీకగా నిలిచిన మండలి బుద్ధప్రసాద్ గారి షష్టిపూర్తి సందర్భంగా విజయవాడలో తెలుగు భాషాసాంస్కృతిక సమ్మేళనం జరిగింది. స్థానిక సాహితీ సాంస్కృతిక సంస్థలతో కలిసి ఎన్టీఆర్ ట్రస్టు వారు ఈ కార్యక్రమాన్ని పెద్ద ఎత్తున నిర్వహించారు. ముగింపు సభ షష్టిపూర్తి ఉత్సవంగా జరిగిన సందర్భంలో ముఖ్యమంత్రి గారి అబ్బాయి, తెలుగుదేశం పార్టీ యువజన నేత లోకేష్, తక్కిన పెద్దలు గొల్లపూడి మారుతీరావు, తుర్లపాటి కుటుంబరావు, సుద్దాల అశోక్‌తేజ, రాష్ట్ర భాషా సాంస్కృతిక శాఖామంత్రి పల్లె రఘునాథరెడ్డి తదితరులతో కలిసి సన్మాన కార్యక్రమాన్ని నిర్వహించారు. తెలుగుభాషా సంస్కృతుల సముద్ధరణకు ఎన్టీఆర్ ట్రస్టు, తెలుగుదేశం పార్టీ కంకణం కట్టుకున్నాయని ఉద్ఘాటించారు. (వ్యాసం 6వ పుటలో..)



ప్రముఖ విద్యావేత్త, తెలుగు భాషోద్యమ సమాఖ్య గౌరవాధ్యక్షులు

## చుక్కా రామయ్య

దళిత, బడుగు వర్గాలను ఉద్ధరించడం కోసమే ఇంగ్లీషు మీడియంను ప్రాథమిక విద్య నుండి ప్రోత్సహిస్తున్నామనే సరికొత్త వాదన ఈ మధ్య వినిపిస్తోంది. ఇది తప్పు. దళితులు, కష్టజీవుల్లో విద్యాగంధం గుబాళించాలన్నా, వారిని చైతన్యవంతుల్ని చేయాలన్నా మాతృభాషలో విద్యాబోధనకు మించిన మార్గం లేదు. ప్రాథమిక స్థాయి నుండి ఆంగ్లంలో విద్యాభ్యాసం చేసినవాడు సాధిస్తున్న ఫలితాల కంటే మాతృభాషలో విద్యాభ్యాసం చేసి అవసరాన్ని బట్టి పరాయిభాషను వినియోగించుకున్నవారే అద్భుతమైన ఫలితాలను సాధిస్తున్నారు. మన రాష్ట్రం నుండి ఐఐటికి ఎంపికవుతున్నవారిలో ఎక్కువమంది పదవ తరగతి వరకు జిల్లా పరిషత్ హైస్కూల్‌లో తెలుగు మీడియంలో చదివి వచ్చినవారే. ఇక్కడ సబ్జెక్టును అర్థం చేసుకోవడం ముఖ్యం. సబ్జెక్టు అర్థమైతేనే ప్రశ్నించేతత్వం వస్తుంది. అప్పుడే ఆ చదువుకు అర్థం, పరమార్థం. చదువు గుమస్తా ఉద్యోగాల కోసం కాదు, కాల్‌సెంటర్ల కోసం కాదు, చదువు ఉత్పత్తి కోసం, పరిశోధన కోసం. గతంలో అదనపు సమాచారాన్ని తెలుసుకోవడానికి ఆంగ్లం అవసరం వుండేది. ఇప్పుడు సమాచారానికి లోపం లేదు. దానిని అర్థం చేసుకునే స్థాయి పెరగాలి. అందుకు మాతృభాష ఎంతగానో దోహదపడుతుంది. అలా కాకుండా మూర్ఖంగా ఆంగ్లం కోసం పట్టుబడితే శరీరానికి అరగని ఆహారం విషతుల్యంగా మారితే ఎంత నష్టమో ఇది కూడా అంతే అవుతుంది. కనుక ప్రాథమిక విద్య మాతృభాషలో అదీ ఇంటి భాషలో జరిగితే జ్ఞాన సాధనకు రాచబాటలు వేసినట్టవుతుంది. దళిత, బడుగు వర్గాల ఉద్ధరణే నిజంగా ప్రభుత్వ ధ్యేయమైతే ఒకటో తరగతి నుండి పదవ తరగతి వరకు తెలుగు మీడియం లోనే బోధనను కొనసాగించాలి.

ఒకప్పుడు వెలుగులను విరజిమ్మిన చోళనాడులో తంజావూరుకు 22 కి.మీ.దవ్వున వున్న పల్లెటూరు మెలట్టూరులోని అగ్రహారంలో వేసవి పున్నమినాడు జరిగే తెలుగు భాగవత పొడమ–నూనె దివ్వెల వెలుగులలో నడుస్తుంది, ఆ భాగవత మేళ గురువు గారు అయిన శ్రీ ఆర్.మహాలింగం గారితో మాటా మంతీ... పేజీ 33...




## లోపలి పుటలలో....




ఫొటోలు : **తమ్మా శ్రీనివాసరెడ్డి**

కైసేత–ముఖచిత్రం : **కలిమిశ్రీ**

రేఖాచిత్రాలు : **చిదంబరం** పకపకలు : **సరసి, శేఖర్**

తెలుగుజాతి పత్రిక

# అమ్మనుడి

మాసపత్రిక

• నుడి • నాడు • నెనరు

సంపాదకుడు **డా॥ సామల రమేష్‌బాబు**

శాలివాహన శకం 1938 : దుర్ముఖినామ సంవత్సర వైశాఖ ***(కొంగాపి)** బహుళ ఏకాదశి బుధవారం మొదలు జ్యేష్ఠ ***(ఒల్లాపి)** బహుళ ఏకాదశి గురువారం వరకు

*** కొంగాపి * ఒల్లాపి** : తెలుగు నెలలు

## చందా వివరాలు

| | | వ్యక్తులకు | సంస్థలకు | విదేశీయులకు |
|---|---|---|---|---|
| **శాశ్వత చందా** | : | **రూ.5000** | **రూ.7500** | -- |
| **5 సం॥** | : | **రూ.1000** | **రూ.1500** | **150 డాలర్లు** |
| **3 సం॥** | : | **రూ. 700** | **రూ.1000** | **75 డాలర్లు** |
| **1 సం॥** | : | **రూ. 240** | **రూ. 400** | **25 డాలర్లు** |

ఎం.ఓ. లేదా తెనాలిలో చెల్లునట్లు బ్యాంకు డి.డి.ని **'అమ్మనుడి'** పేర పంపాలి. చెక్కు పంపేట్లయితే దయచేసి అదనంగా రు.30 లు చేర్చి పంపండి.

ఆన్‌లైన్ ద్వారా చందాను పంపేవారు NEFT / RTGS ద్వారా **'అమ్మనుడి'**-యాక్సిస్ బ్యాంకు, తెనాలి శాఖకు పంపాలి.

**AMMA NUDI - AXIS BANK, TENALI**

అక్కౌంట్ నెం. **915020010550189**

**IFSC Code : UTIB0000556**

ఆన్‌లైన్‌లో చందాను పంపినవారు, ఆ వెంటనే దయతో - చిరునామా, ఫోన్ నెం. తదితర వివరాలను జాబుద్వారాగాని, ఫోన్ మెసేజి ద్వారాగాని తెలుపగలరు.

చందాలు పంపడం, దానికి సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలకు చిరునామా

**డా॥ సామల లక్ష్మణబాబు,** ప్రచురణకర్త, 'అమ్మనుడి'
8-386, జీవక భవనం, అంగలకుదురు పోస్టు, **తెనాలి**
గుంటూరు జిల్లా - 522 211. ఫోన్ : 9440448244
ఇ-మెయిల్ : ammanudi@gmail.com

**చందాదారులు కోరినట్లయితే ఆన్‌లైన్‌లో కూడా పత్రికను పంప గలము. ఇందుకోసం మీ ఇ-మెయిల్ ఐడిని తప్పక తెలుపగలరు.**

## చందాదారులకు సూచనలు

1. చందా కాలం ముగింపు తేదీ - పత్రిక కవరుమీద మీ చిరునామా పై భాగంలోనే ఉంటుంది. గమనించండి.
2. చందా పూర్తయ్యేందుకు ఒక నెల ముందే దయచేసి మీ చందాను పంపించండి.
3. మీ ఇంటి నెంబరుతో పూర్తి చిరునామాను, పిన్‌కోడ్ నెంబరుతో సహా తెలియపరచాలి. మీ ఫోన్ నెంబరును, వుంటే మీ మెయిల్ ఐడి ని తెలపాలి.
4. మీ చిరునామా మారినట్లయితే దయచేసి వెంటనే తెలియజేయండి.

# రచయితలకు సూచనలు

1. విభిన్న అంశాలపై వ్యాసాలను పంపవచ్చు. ముద్రణలో 1 నుండి 3 పుటలకు మించకుండా ఉండాలి. అన్నిరంగాలలో తెలుగువారి శ్రేయస్సుకు సంబంధించిన రచనలను పంపండి. విమర్శలు విషయం పైనే ఉండాలి గాని వ్యక్తులపై గురిపెట్టి చేయరాదు. అప్రజాస్వామిక రచనలను తీసుకోలేము. సరళమైన తెలుగులో వ్రాయాలి. 2. రచనలను యూనికోడ్‌లో గాని, అను ఫాంట్స్ లో గాని టైప్ చేసి లేదా ఎ4 సైజు కాగితంపై వ్రాసి, స్కాన్ చేసి ammanudi@gmail.com కు పంపాలి. లేదా కొరియర్ / రిజిష్టర్డ్ / సాధారణ పోస్టులో పంపవచ్చు. 3. రచనతోపాటు రచన స్వంతమేనని, ఇతర పత్రికలకు గాని, ఇంటర్నెట్ పత్రికలకు గాని పంపలేదని, పరిశీలనలో లేదని, ఇంతవరకు ఎక్కడా ప్రచురణ కాలేదని హామీపత్రాన్ని స్పష్టంగా వ్రాసి పంపాలి. పోస్టల్ చిరునామా, ఫోన్ నెం., ఇ-మెయిల్ కూడా ఇవ్వాలి. ఈ వివరాలు లేని రచనల్ని తీసుకోలేము. 4. మాకు పంపే రచన నకలును మీ వద్ద ఉంచుకోండి. ప్రచురణకు ఎంపిక చేయని రచనలను తిప్పి పంపడం వీలుకాదు.

# కథారచయితలకు, కవులకు విన్నపం

1. మాట్లాడుకొనే తెలుగులో వ్రాసిన కథల్ని **'నడుస్తున్న చరిత్ర'** ప్రచురించిన సంగతి చదువరులకు, రచయితలకు తెలిసిందే. ఈ సంప్రదాయాన్ని **'అమ్మనుడి'** పత్రిక కొనసాగిస్తున్నది. పాత్రల సంభాషణలు తప్పనిసరిగా మీ ప్రాంతంలో మాట్లాడుకొనే తెలుగు తీరులో ఉండాలి. కథాచిత్రణ కూడా మీ తెలుగు తీరులోనే ఉంటే మంచిది. కఠినమైన సమాసాలను ఉపయోగించవద్దు. తేలికైన తెలుగు మాటలు కుదరకపోతే జనం వాడుకలోని ఇతర ప్రాంతాల తెలుగు మాటల్ని వ్రాయవచ్చు. తప్పనిసరి అయితే తప్ప ఏ ఇతర భాషల మాటలను ఉపయోగించవద్దు. ఈ సూచనలే కవితలకూ వర్తిస్తాయి.

2. **'అమ్మనుడి'**లో ప్రచురణకు తీసుకొనే కథలు, కవితలు తెలుగువారి సామాజిక, భాషాసంస్కృతుల వికాసానికి తోడ్పడేవిగా ఉండాలి.

3. ప్రతినెలా ఒకటి లేక రెండు కథలను మాత్రమే ప్రచురించగలం. ముద్రణలో 2 లేక 3 పుటలకు మించకుండా ఉండేవాటినే తొలి ఎంపికకు తీసుకుంటాము. కవితలు 20 నుంచి 30 వరుస (లైను)లకు మించకూడదు. ప్రతినెలా 4 లేక 5 కవితలకు మించి పత్రికలో చోటుండదు.

రచనలు, ఉత్తరాలు పంపుటకు చిరునామా

**డాక్టర్ సామల రమేష్‌బాబు,**
సంపాదకుడు, **అమ్మనుడి,**
జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి,
మాచవరం, విజయవాడ-520004.
e-mail : ammanudi@gmail.com
దూరవాణి: కార్యాలయం : *0866-2439466*
సంపాదకుడు : *9848016136*

# తెలుగుజాతి (ట్రస్టు) విన్నపం

'నడుస్తున్న చరిత్ర' ప్రోత్సాహంతో ఆంధ్రప్రదేశ్‌లోనే కాక, పొరుగు రాష్ట్రాల్లోనూ నివసిస్తున్న తెలుగువారి శ్రేయస్సుకు, తెలుగు భాషోద్యమ నిర్మాణానికి కృషి జరిగింది. దక్షిణ భారతదేశమంతటా చిక్కగా అల్లుకొని, మొత్తం దేశంలోనేకాక, అనేక ఇతర దేశాల్లో కూడా భాషా సాంస్కృతిక మూలాలను విస్తరించుకొనివున్న తెలుగుజాతిలో చైతన్యాన్ని పెంపొందించి, వారిలో సంఘీభావాన్ని, భావసమైక్యతను బలపరచవలసిన అక్కరను గుర్తించిన కొందరు కార్యకర్తలు అందుకోసం పనిచేస్తున్నారు. అయితే, అనివార్య కారణాల వల్ల నడుస్తున్న చరిత్ర పత్రికను 2013 నవంబరు నుంచి నిలిపి వేయవలసి వచ్చింది. మళ్ళీ పత్రికను ప్రచురించడంతోపాటు తెలుగు నుడి, చరిత్ర, జాతి ముందడుగుకు అవసరమైన పుస్తకాల ప్రచురణను, ప్రచార కార్యక్రమాలను చేపట్టాలని తలపెట్టాము. ఇందుకోసం 'తెలుగుజాతి' పేరిట ఒక ట్రస్టును నమోదు చేయించాము. (92/2014). తెలుగు 'అమ్మనుడి"గా కలిగినవారు ఎక్కడ నివసిస్తున్నా, వారి శ్రేయస్సు కోసం ఈ సంస్థ పనిచేస్తుంది.

2015 మార్చి నుంచి **అమ్మనుడి** పత్రికను ప్రచురిస్తున్నాము. పుస్తకాల ప్రచురణ కార్యక్రమంలో భాగంగా తొలుత స.వెం.రమేశ్ వ్యాసాల సంకలనం **'ఎల్లలు లేని తెలుగు'**ను విడుదల చేశాము. త్వరలోనే మరికొన్ని ప్రత్యేకమైన పుస్తకాలను వెలువరించ బోతున్నాము. ఈ ట్రస్టును బలమైన పునాదులపై, తగినన్ని వనరులతో బలపరచటానికి మీ అందరి చేయూత కావాలి. ట్రస్టు నిర్మాణంలో తోడ్పడాలని విన్నవిస్తున్నాము.



**ట్రస్టుకు విరాళాలనిచ్చి తోడ్పడ గోరుతున్నాము.**

| | |
|---|---|
| రాజ పోషకులురు. 1,00,000/-లు | పోషకులు రు. 25,000/-లు |
| విశిష్ట పోషకులు రు. 50,000/-లు | ప్రోత్సాహకులు రు. 10,000/-లు |

దాత ఫొటోను, క్లుప్తంగా పరిచయాన్ని **'అమ్మనుడి'** పత్రికలో ప్రచురిస్తాము.పత్రికను, ట్రస్టు ప్రచురించే పుస్తకాలను ఉచితంగా పంపిస్తాము.

సొమ్మును చెక్ / డ్రాఫ్టుగా / ఆన్‌లైన్‌లో 'TELUGUJAATHI' పేర పంపాలి. యాక్సిస్ బ్యాంక్, సికిందరాబాదు.

అక్కౌంట్ నెం. 914020020387880 I.F.C.Code : UTIB0000068

**డా॥ సామల రమేష్‌బాబు,** మేనేజింగ్ ట్రస్టీ, 9848016136 ట్రస్టీలు : **పారుపల్లి కోదండరామయ్య** 9505298565, **డా॥వెన్నిసెట్టి సింగారావు** 9393015584, **స.వెం.రమేశ్** 8500548142, **సామల లక్ష్మణబాబు** 9440448244



అమ్మనుడిపై నెనరు లేనివాడు
కన్నతల్లినీ, పుట్టిన నేలనీ ప్రేమించలేడు..

# ఆశలు రేకెత్తించిన తెలుగు భాషాసాంస్కృతిక సమ్మేళనం


'బుద్ధయానం' వ్యాసాల సంకలనాన్ని ఆవిష్కరిస్తున్న పెద్దలు

తెలుగు సాంస్కృతిక ప్రతీకగా ఖ్యాతిగాంచిన ఆంధ్రప్రదేశ్ శాసనసభ ఉపసభాపతి శ్రీ మండలి బుద్ధప్రసాద్ షష్టిపూర్తి సందర్భంగా ఆయన సొంత వూరు అవనిగడ్డలో మే 26న, హైదరాబాదులో 27న, విజయవాడలో 31న సభలు, సాంస్కృతిక కార్యక్రమాలు పెద్ద ఎత్తున జరిగాయి. అన్నిటిలోకీ ప్రత్యేకత కలిగింది– విజయవాడలో ఎన్టీఆర్ ట్రస్టు పూనుకొని స్థానిక సాహితీ, సాంస్కృతిక సంస్థలతో కలిసి ఉదయం నుండి పగలంతా నడిపిన 'తెలుగు భాషాసాంస్కృతిక సమ్మేళనం'. తెలుగుకోసం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఏంచెయ్యాలో తెలుసుకొని దానికొక అజెండాను నిర్ణయించుకోవడం కోసం ఈ సమ్మేళనాన్ని బుద్ధప్రసాద్ గారి షష్టిపూర్తి సందర్భంగా ఏర్పాటు చేశామని నిర్వాహకులు ప్రకటించారు. సుమారు 700 మంది రెండు తెలుగు రాష్ట్రాల నుండి, ఇతర రాష్ట్రాల నుండి పాల్గొన్నారు. జర్మనీ నుండి బుద్ధప్రసాద్ గారి అభిమాని, మేయర్ శ్రీ గుజ్జుల రవీంద్ర కూడా పాల్గొన్నారు. తెలుగు భాష, సాహిత్యం, కళలు మున్నగు రంగాలకు చెందిన ప్రముఖులు పాల్గొన్నారు. ఉదయం 10.30 గంటలకు ప్రారంభ సభతో మొదలై మూడు సమావేశాలుగా– మధ్యలో విరామం లేకుండా ఈ కార్యక్రమం జరిగింది.

సాయంత్రం 6 గంటల తరువాత మొదలైన షష్టిపూర్తి సభ కార్యక్రమంలో ప్రత్యేకంగా తెలుగుదేశం పార్టీ యువనాయకుడు, ముఖ్యమంత్రి నారా చంద్ర బాబునాయుడు గారి కుమారుడు లోకేష్ గారు పాల్గొన్నారు. ఎన్టీఆర్ ట్రస్టు ప్రతినిధులు పెద్ది రామారావు, విష్ణువర్ధన్ గార్లు ఉదయం నుండి వ్రాసుకొన్న నోట్సు ఆధారంగా సారాంశాన్ని సభలో ప్రకటించారు. దాన్ని ప్రస్తావిస్తూ లోకేష్‌గారి ప్రసంగం సాగింది. ప్రభుత్వ భాషా విధానాన్ని ప్రకటించడం, ప్రాధికార సంస్థను స్థాపించడం, 1వ తరగతి నుండి ఇంటర్మీడియట్ వరకు తెలుగును ఒక సబ్జెక్టుగా తప్పనిసరి చెయ్యడం మున్నగు అంశాలపై ఆయన వెంటనే తగు విధంగా కృషి చేస్తానని సభకు మాట ఇచ్చారు. ఇంటర్మీడియట్‌లో సంస్కృతం వల్ల బాధితులైన వారిలో తానూ ఒకడినని ఆయన ఈ సందర్భంలో అన్నారు. తన తండ్రి ఈసారి చాలా 'మారిన మనిషి' అయ్యారని, తెలుగు భాషా సంస్కృతులను పరిరక్షించాలనే పట్టుదలతో ఉన్నారని లోకేష్ అన్నారు. ఆయన ప్రసంగాన్ని విన్న సభికుల్లో ప్రభుత్వం ఈసారి తప్పక కొన్ని చర్యల్ని గైకొంటుందన్న ఆశ కలిగింది.

అంతకుముందు ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖామాత్యులు పల్లె రఘునాథరెడ్డి గారు ఉపన్యసిస్తూ బుద్ధప్రసాద్ గారి నిబద్ధతను, భాషా సాహిత్యాల పట్ల ఆయనకున్న అనురాగాన్ని ఎంతగానో కొనియాడారు. సాహిత్య అకాడమీ మున్నగు అకాడమీల స్థాపనకు నిర్ణయం గైకొనడం జరిగిందనీ, వాటికి తగిన వారిని నియమించేందుకు కూడా పరిశీలన జరుగుతున్నదని ప్రకటించారు.

'బుద్ధయానం' పేరుతో శ్రీ బుద్ధప్రసాద్ గారి గురించి అనేకమంది ప్రముఖులు వ్రాసిన వ్యాసాల సంకలనాన్ని హైదరాబాదు సభలో ఆవిష్కరించిన దానినే ఈ వేదిక మీద కూడా ఆవిష్కరించారు.

ప్రముఖ రచయిత, నటులు గొల్లపూడి మారుతీరావు గారు అధ్యక్షత వహించి మాట్లాడటం, ప్రముఖ కవి సుద్దాల అశోక్‌తేజ గారు అశువుగా గేయాల నాలపించడం– ఈ సభకు వన్నె తెచ్చాయి. బుద్ధప్రసాద్ గారు తమ స్పందనలో తెలుగు భాషాసంస్కృతులకు ప్రభుత్వాన్నుండి పూర్తి న్యాయం జరిపించాలన్నదే తమ లక్ష్యమని, ప్రజలు కూడా భాషా సంస్కృతుల పరిరక్షణకు శ్రద్ధ వహించాలని అన్నారు.

మొత్తం మీద మండలి బుద్ధప్రసాద్ గారి షష్టిపూర్తి సభ విభిన్నంగా సాగింది. ఆంధ్రప్రదేశ్‌లో తెలుగును ఉద్ధరించడానికి, ప్రభుత్వ దృష్టికి కీలక అంశాలను తెచ్చేందుకు ఈ కార్యక్రమాన్ని– ముఖ్యంగా విజయవాడలో ఈ భాషా సాంస్కృతిక సమ్మేళనం ఏర్పాటుకు ఎన్టీఆర్ ట్రస్టు వారు పూనుకోవడం ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని కలగించిందని సభలో పాల్గొన్న కొందరు అన్నారు.

కీలక వ్యక్తి బుద్ధప్రసాద్ గారితో సహా, భాషోద్యమకారులు, కళాకారులు అందరూ మున్ముందు తెలుగుకు ఆంధ్రప్రదేశ్‌లో మంచిరోజులు రానున్నాయన్న ఆశాభావంతో ఉన్నారన్న అభిప్రాయం అక్కడ నెలకొంది. ❊

సంపుటి : 2 సంచిక : 4
అమ్మనుడి
జూన్ 2016

సంపాదకీయం

# కనిపించని కుట్రలు....?!

నందమూరి తారక రామారావుగారి పుట్టినరోజు, తెలుగుదేశం మహానాడు సందర్భంగా మే 26న ఆంధ్రజ్యోతిలో నేను వ్రాసిన వ్యాసం అచ్చయింది. దాన్ని ఈ వెనుకపుటలో ఇస్తున్నాం. దానిలో సూటిగా లేవనెత్తిన అంశాలు తేటతెల్లంగా వున్నాయి.

2003లో చంద్రబాబునాయుడు గారే ఇచ్చిన జి.ఒ.ను ఆయనా వారి పార్టీ ప్రభుత్వమూ మరచిపోయారు. భాషాసాంస్కృతిక మంత్రిత్వశాఖ గాని, విద్యకు సంబంధించిన శాఖలు గాని దాన్ని పట్టించుకోవడం లేదు. పైగా దానిలో చేసిన పనినే –ఒకటి నుండి పది వరకు తెలుగును ఒక సబ్జెక్టుగ తప్పనిసరి చేసిన దాన్నే– మళ్ళీ మళ్ళీ వాగ్దానంగా ప్రకటిస్తూ వుంటారు. ఇదేమిటని తెలుగు భాషోద్యమ సమాఖ్య తప్ప ఎవ్వరూ ప్రశ్నించరు! తెదేపా ఎన్నికల ప్రణాళికలో తెలుగును ఒక సబ్జెక్టుగా తప్పనిసరి చేస్తామని వాగ్దానం చేశారే తప్ప జి.ఒ. ఒకటున్నదన్న సంగతి వారికి జ్ఞాపకం లేదు. ప్రతిపక్షనాయకుడిగా (2012 ఫిబ్రవరి,21) ముఖ్యమంత్రిగా (2015 ఆగస్టు, 29) చంద్రబాబునాయుడుగారు ఇలా వాగ్దానం చేస్తూనేవున్నారు. ఇంటర్మీడియట్ వరకు తెలుగును ఒక సబ్జెక్టుగా తప్పనిసరి చేస్తామన్నారు కూడా. ఆగస్టు 29న మళ్ళీ లోకేష్‌గారు మే 31న విజయవాడ సభలో ఇంటర్మీడియట్‌లో సంస్కృతానికి తాను కూడా బలైపోయానని చెపుతూ తెలుగును తప్పనిసరి చెయ్యడానికి ప్రయత్నిస్తానన్నారు.

ఇంకొక ప్రమాదకరమైన సంగతి. ఇప్పుడు జరుగుతున్న పరిణామాల్లో దాక్కొని వుంది. అటు ప్రభుత్వ నేతలు గానీ, ఇటు ఎన్టీఆర్ ట్రస్టు గానీ తెలుగు మాధ్యమంలో విద్యాబోధన సంగతిని ప్రస్తావించడమే లేదు. నిన్న జరిగిన సమ్మేళనంలో ఇచ్చిన అంశాల జాబితాలో ఈ సంగతే లేదు. 2003లోనే బుద్ధప్రసాద్ గారు ప్రయివేటుబిల్లును అసెంబ్లీలో ప్రతిపాదించారు. ప్రాథమిక విద్యను మాతృభాషా మాధ్యమంలో తప్పనిసరి చేయాలన్నది ఆ ప్రతిపాదన. అది చాలా కష్టసాధ్యం గనుక మీ బిల్లును ఉపసంహరించుకొంటే మేమొక జి.ఒ. తెస్తాం అంటూ అప్పుడు మంత్రి మండవ వెంకటేశ్వరరావు గారి వాగ్దానం మేరకు వచ్చిందే జి.ఒ.నెం.86/2003. నాటి నుంచి నేటి వరకు ఎన్ని ప్రభుత్వాలు మారినా అది సరిగా అమలు కానే లేదు. పైగా నాటికీ నేటికీ తెలుగును ఒక అంశంగా బోధించడాన్ని కూడా పలచబర్చి, దానిని నమరణశయ్యపైకి చేర్చేందుకు ప్రైవేటు పాఠశాలల వారూ ప్రభుత్వమూ (ఇందులో వున్నదీ కార్పొరేట్ శక్తులేనని అందరికీ తెలిసిందే) కలిసి కొనసాగిస్తున్న కుట్ర ఫలితమే ఇదంతా. ఇది బహిరంగ రహస్యం.

ఇక తెలుగు మంత్రిత్వశాఖ సంగతి. మంత్రిత్వశాఖ అంటూ ఉన్నప్పుడు దానికి విధి విధానాలను నిర్దేశించే భాషా విధానం అంటూ లేకపోతే ఆ శాఖకొక మంత్రీ, కార్యదర్శులు ఉన్నా వాళ్లెలా పరిపాలిస్తారు? అందుకనే పాలనలో, విద్యాబోధనలో తెలుగు నానాటికీ తీసికట్టు అవుతున్నా ఎవరికీ పట్టదు. ఇన్నాళ్ళకు నిన్నజరిగిన తెలుగు భాషా సాంస్కృతిక సమ్మేళనంలో కూడా భాషావిధానం ఒక డిమాండుగా ముందుకు వచ్చింది. తె.భా.స 2003 నుండీ ఈ అంశంపై పట్టుబడుతూనే వుంది.

ప్రపంచ సభలను గురిపెట్టి సమాఖ్య చేసిన ఉద్యమంలో తొలి డిమాండు– తెలుగుకు ప్రత్యేక మంత్రిత్వశాఖను, దానికి అనుబంధంగా ఒక తెలుగు అభివృద్ధి ప్రాధికార సంస్థ (తెలుగు డెవలప్‌మెంట్ అథారిటీ)ని సమగ్రంగా ఏర్పరచాలి అని. ఈ డిమాండును సగానికి కోసి, ప్రాధికార సంస్థ సంగతిని ప్రస్తావించకుండా, మంత్రిత్వశాఖను ఏర్పడి రెండేళ్ళు గడిచినా బడ్జెట్టులో కేటాయింపులేమీ ఇవ్వకుండా మిన్నకున్నారు. ఆ శాఖ గత రెండేళ్ళుగా ఏం చేసిందో ప్రజలకు తెలుపమనండి చూద్దాం. కొన్నాళ్ళిలాగే గడిస్తే పనిలేదు గనుక ఆ శాఖనే ఎత్తేసినా ఎత్తేయవచ్చు.

దిష్టిబొమ్మలాంటి అధికార భాషాసంఘాన్ని పునరుద్ధరించడం గురించి కొందరు మాట్లాడుతున్నారు. నిన్నటి సమ్మేళనంలో పేర్కొన్న అంశాల్లో ఇది ఒకటి. ముగింపు సభలో మాట్లాడుతూ అధికార భాషా సంఘాన్ని పునరుద్ధరిస్తామని, తెలుగుశాఖ మంత్రి గారో మరొకరో ప్రకటించారు కూడా. దిక్కుమాలిన ఈ అధికార భాషాసంఘం దేనికి? మంత్రిత్వశాఖను పెట్టి, ఒక భాషా విధానాన్ని రూపొందించిన తర్వాత అధికార భాషాసంఘ మనబడే నిరుపయోగ తాత్కాలిక సంఘ ప్రయోజనమే వుండదు. ప్రాధికార సంస్థను ఏర్పరచుకొన్న తర్వాత ఇక ఎలాంటి తాత్కాలిక సలహా సంఘాల ఏర్పాట్ల అవసరమే వుండదు.

ఇక అన్నిటికంటే ముఖ్యమైన అంశం. తెలుగు మాధ్యమం. ఒక మాధ్యమంగా కనీసం ప్రాథమిక విద్యలో తప్పనిసరి చెయ్యకపోతే తెలుగు నిలవదు. తక్కిన పైపై ఏర్పాట్లన్నీ చేసినా ప్రయోజనం లేదు.ప్రాథమిక విద్యను మాతృభాషలో నేర్పడమనే విశ్వవ్యాప్తంగా అంగీకరించిన శాస్త్రీయ పద్ధతిని కాలదన్నిన తర్వాత దానిని ఒక సబ్జెక్టుగా బోధిస్తే ఇప్పుడలా చేస్తున్నందున వస్తున్న సున్నా ఫలితాలే వస్తాయి. ఇలాంటి పరిస్థితుల్నే కొనసాగిస్తూ తెలుగు భాషా సంస్కృతుల్ని రక్షిస్తామని ఎవరు అన్నా అది ఎంతటి నేతలు అన్నా–అది అబద్ధం. కొందరు తెలిసి అనవచ్చు, కొందరు తెలియక అనవచ్చు కానీ ఫలితం అదే. కని పించని కుట్రలు అన్నిస్థాయిల్లో జరుగుతున్నాయి. వాటిని కనిపెట్టి ఎదుర్కొనకపోతే–మన తెలుగే కాదు, మాతృభాషలేవీ మిగలవు.

పోరాటాలే భవిష్యత్తును తీర్చిదిద్దుతాయి. తెలుగుకోసం, మాతృభాషల రక్షణకోసం పోరాటాలే గతి. పోరాటాలు బలంగా వుంటేనే ప్రభుత్వాలు దిగివస్తాయి. లేదంటే– కుట్రదారుల పెత్తనంలో సాగుతున్న ప్రభుత్వాలే ప్రజల నెత్తిన కూర్చొని శాసిస్తాయి. ఇప్పుడు జరుగుతున్నది అదే.

సామల రమేష్‌బాబు

**1-6-2016**

# సమగ్ర భాషావిధానం ప్రకటించాలి

**కొ**త్త ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడి రెండేళ్ళయింది. తెలుగుదేశం పార్టీ పరిపాలనకు కూడా రెండేళ్ళ వయసొచ్చింది. పార్టీ వ్యవస్థాపకుడు కీ.శే. నందమూరి తారకరామారావు జయంతి సందర్భంగా - మే 27, 28లలో మహానాడు కూడా జరుగబోతున్నది. తెలుగువారి చరిత్రలో తనకంటూ ఒక సుస్థిర స్థానాన్ని పొందిన ఆ మహానుభావుడికి శ్రద్ధాంజలి ఘటిస్తున్నాం.

సమైక్య ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం భాషాప్రాతిపదికపై ఏర్పడిన పాతికేళ్ల తర్వాత కూడా తెలుగు ప్రజల ఆత్మగౌరవానికి సంబంధించిన అంశాలతో సహా తెలుగుజాతి ప్రయోజనాలాకు అన్ని విధాలా భంగం కలుగుతూ వుండటాన్ని సహించలేక ఆవేదన చెందారు కీ.శే. ఎన్టీఆర్. వాటిని సరిదిద్ది, దేశ విదేశాల్లో దేశ ప్రతిష్ఠను పెంపొందించేందుకు కంకణం కట్టుకొని ఆయన తెలుగుదేశం పార్టీని స్థాపించారు. ప్రజల్లోకి వెళ్లి తెలుగు భాషాసంస్కృతులను, తెలుగు ఆత్మగౌరవాన్ని రక్షించుకోవడం అనే అంశంపైనే ప్రచారం చేశారు. కాంగ్రెస్‌కు ప్రత్యామ్నాయాన్ని ప్రజలముందుంచి అపార ప్రజాదరణతో అధికారంలోకొచ్చారు. ఆ వెంటనే ఆ అంశాలపై ఆయన దృష్టి సారించి, ఎన్నో చారిత్రాత్మక చర్యలు తీసుకున్నారు. ముఖ్యంగా పరిపాలనను ప్రజల భాష తెలుగులోకి తీసుకురావడానికి ఆయన కొన్ని నిర్ణయాలు తీసుకున్నారు. ప్రజల భాషలోనే పరిపాలించాలనే మౌలిక లక్ష్యం కొద్దిరోజుల్లోనే ఆచరణలోకొచ్చింది. ఆయన అధికారంలోంచి దిగిపోయాక మళ్ళీ పరిస్థితి మొదటికి వచ్చింది. తర్వాత వచ్చిన ముఖ్యమంత్రులకు ఆ అంశాలపై పట్టుదల లేకపోవడమే అందుకు కారణం.

2014 ఎన్నికల మానిఫెస్టోలో తెలుగుదేశంపార్టీ భాష విషయంలో కొన్ని హామీలను ప్రకటించింది. "పాఠశాలదశ నుండి 10వ తరగతి వరకు తెలుగును తప్పనిసరి చేస్తాం. తెలుగు మంత్రిత్వశాఖను ఏర్పాటు చేస్తాం, ప్రత్యేక బడ్జెట్టు కేటాయిస్తాం" అనేది మొదటి వాగ్దానం. దీనికి సంబంధించిన వాస్తవాలేమిటంటే - పాఠశాలదశ నుండి 10 వ తరగతి వరకు తెలుగును తప్పనిసరి చేస్తూ జి.ఒ. ఇవ్వడం ఎన్నడో జరిగిపోయింది. జి.ఒ.ఎం.ఎస్.నెం. 86/2-7-2003ని అప్పుడు చంద్రబాబునాయుడుగారు ముఖ్యమంత్రిత్వం లోనే ఇచ్చారు. అప్పుడు ప్రతిపక్షంగా ఉన్న కాంగ్రెస్ పార్టీ శాసనసభ్యుడూ, నేటి ఉపసభాపతి అయిన మండలి బుద్ధప్రసాద్ ప్రతిపాదించిన ప్రయివేటు బిల్లును ఉపసంహరించుకోమని కోరి, నాటి విద్యాశాఖ మంత్రి మండవ వెంకటేశ్వరరావు శాసన సభలో ఇచ్చిన హామీమేరకు ఆ తర్వాత ఆ జి.ఒ. వచ్చింది. దీనివెనుక ప్రభుత్వ నేతలతో, అధికారులతో తెలుగు భాషోద్యమ సమాఖ్య ప్రతినిధులు జరిపిన చర్చలు, ఉద్యమ చరిత్ర ఉంది. అయితే దాని అమలు గురించి నాటినుంచి నేటివరకు కాంగ్రెసు, తెలుగుదేశం ప్రభుత్వాలు రెండూ ఏనాడూ శ్రద్ధ పెట్టలేదు.

'తెలుగు మంత్రిత్వశాఖను ఏర్పాటు చేస్తాం. బడ్జెట్‌లో నిధులను ప్రత్యేకంగా కేటాయిస్తాం.' అని వాగ్దానం చేయకముందే జి.ఒ. నెం. 909/31-3-2013 ద్వారా నాటి సమైక్యరాష్ట్రంలోనే తెలుగు మంత్రిత్వశాఖ ఏర్పడిఉంది. తర్వాత- రెండు రాష్ట్ర ప్రభుత్వాల్లో ఈ మంత్రిత్వశాఖ, ఏర్పడింది. ఇదంతా చంద్రబాబు నాయుడు గారికి పూర్తిగా తెలుసు. 2012 ఫిబ్రవరి 21న తెలుగు భాషోద్యమ సమాఖ్య నిరసన శిబిరంలో ఆయన పాల్గొని సమాఖ్య డిమాండ్లను బలపరచిన దగ్గర నుండి ఎన్నికల ప్రచారంలో చివరి రోజువరకు సమాఖ్య మళ్ళీ మళ్ళీ వినతిపత్రానిచ్చినంతవరకు - వారికి అంతా తెలుసు.

ఇక మంత్రిత్వశాఖకు ప్రత్యేక బడ్జెట్టు కేటాయిస్తామన్న మాట నేటికీ ఆచరణలోకి రానేలేదు. ఇటీవల రెండు బడ్జెట్లలోనూ, ఈ శాఖ ఏర్పడినట్లు ప్రస్తావనే లేదు.!

ఇక మరొక ముఖ్యమైన వాగ్దానం. 'ప్రభుత్వ పాలనా వ్యవహారాలన్నిటినీ తెలుగులోనే కొనసాగిస్తాం.' అన్నది. "ముఖ్యమంత్రిగా తాను వచ్చిన తర్వాత తన కార్యాలయం నుండే ఇది మొదలు పెడతానని తెలుగులోకి పరిపాలనను పూర్తిగా తెస్తానని" 2012 ఫిబ్రవరి 21న బహిరంగంగా ప్రకటించినా- అది నేటివరకు అమలులోకి రాలేదు. 2015 ఆగస్టు 29న తెలుగు భాషాదినోత్సవం సందర్భంగా ముఖ్యమంత్రి చంద్రబాబుగారు బహిరంగంగా పై రెండు వాగ్దానాలను మళ్ళీ ప్రకటించారు. అంతే. తర్వాత ఎట్టిపురోగతీలేదు. మరి తెలుగు భాషా మంత్రిత్వశాఖ ఏం చేస్తున్నట్లు?

ఒక శాస్త్రీయ, సమగ్ర ఆలోచనతో కూడిన భాషావిధానం ఉన్నట్లయితే ఈ గందరగోళం ఏర్పడివుండేది కాదు. ఇంతకాలం ఒక ప్రత్యేక మంత్రిత్వశాఖ లేనందున భాషావిధానం గురించి ఆలోచించి ఉండకపోవచ్చు. కాని, ఇప్పుడు మంత్రిత్వశాఖ ఏర్పడి ఉందిగనుక దానిని నడిపించేందుకు ఒక సమగ్ర భాషావిధానం కావాలి.

ఒక భాషాజాతికి చెందిన ప్రజలు తమభాషలో తమను పరిపాలించుకోవడం, విద్యనునేర్వడం, సర్వతోముఖ వికాసాన్ని పొందడం అనే లక్ష్యంతోనే భాషారాష్ట్రాలు ఏర్పడ్డాయి. అందుకు సమర్థత గలిగిన భాషల్లో తెలుగు ప్రముఖమైనదని నిపుణులు తేల్చిందే. అందుకే తెలుగును సమకాలీన అవసరాలకు తగినట్లు ఎప్పటికప్పుడు ఎదిగించుకుని, వినియోగించేందుకు, ఒక తెలుగు ప్రాధికారసంస్థ (తెలుగు డెవలెప్‌మెంట్ అథారిటీ)ని ఏర్పాటు చేసుకోవాలి. భాషా విధానాన్ని ప్రకటించడంతోపాటు, ఈ ప్రాధికార సంస్థను కూడా ఏర్పరచి, ఎన్నికల ప్రణాళికలో ప్రకటించినట్లు ప్రత్యేక బడ్జెట్ కేటాయింపులిస్తే - తెలుగు మంత్రిత్వశాఖ ఉన్నందుకు ప్రయోజనం కలుగుతుంది. 'మహానాడు'లో కీ.శే.ఎన్టీఆర్ పేర- సమగ్ర భాషావిధానం, తెలుగు అభివృద్ధి ప్రాధికార సంస్థ ఏర్పాటు- ఈ రెండు అంశాలపై ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడుగారు నిర్ణయాన్ని ప్రకటించాలి. అప్పుడే తెలుగు ప్రజలంతా అభినందిస్తారు. ఇదే సరైన సందర్భం.

**-డా॥సామల రమేష్‌బాబు**, తెలుగు భాషోద్యమ సమాఖ్య అధ్యక్షుడు
(తెలుగుదేశం పార్టీ మహానాడు ఎన్టీఆర్ జయంతి సందర్భంగా)

(ఆంధ్రజ్యోతి మే 26, 2016)

ప్రసంగ వ్యాసం

# తెలుగు భాషాసాంస్కృతిక సమ్మేళనం

## విజయవాడ-31-5-2016

### తెలుగు భాషోద్యమ సమాఖ్య అధ్యక్షుడు డా॥సామల రమేష్‌బాబు ప్రసంగం



**ఈ** తెలుగుభాషా సాంస్కృతిక సమ్మేళనంలో పాల్గొంటున్న అందరికీ వినమ్రంగా నమస్కరిస్తున్నాను.

ఎన్.టి.ఆర్.ట్రస్టు ఆధ్వర్యంలో 'తెలుగుభాషా సాంస్కృతిక సమ్మేళనం' జరుగనున్నదనే వార్త మాబోటి భాషోద్యమకారుల్లో ఉద్వేగాన్ని కలిగించింది. ఇందుకు రెండు కారణాలున్నాయి.

ఇన్నేళ్లుగా తెలుగుభాషా సంస్కృతులకు తెలుగునేలపై జరుగుతున్న ఘోరమైన అన్యాయాన్ని గురించి పట్టించుకోవాలని ఎన్‌టిఆర్ ట్రస్టు అనుకోవడమే ఇందుకు మొదటి కారణం. తెలుగుజాతి చరిత్రలో గర్వకారణమైన అధ్యాయం ఎన్‌టిఆర్ జీవితం. ముఖ్యంగా ఆయన రాజకీయరంగంలోకి వచ్చిన తర్వాత తెలుగుభాషా సంస్కృతులకు, తెలుగు ప్రజలకు ఎనలేని కీర్తి ప్రతిష్టలు తెచ్చేందుకు ఆ మహనీయుడు చేసిన కృషికి సాటిలేదు. ఆయన పేరుతో వున్న ట్రస్టు బాధ్యులు శ్రీ నారా లోకేష్ గారి అధ్యక్షతన ఈ సమ్మేళనం జరుగనుండటం ఇందుకు ప్రత్యేక ప్రయోజనాన్ని చేకూర్చుతున్నదని నేను గట్టిగా నమ్ముతున్నాను.

రెండవ కారణం- ఇది జరుగుతున్న సందర్భం. ఆంధ్రప్రదేశ్ శాసనసభ ఉపసభాపతి గౌరవనీయ శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారి షష్టిపూర్తి సందర్భంగా ఈ కార్యక్రమం జరుగుతూండడం. తెలుగు సాంస్కృతిక ప్రతీకగా అందరి మన్ననలను పొందుతున్న ప్రఖ్యాతి బుద్ధప్రసాద్ గారిదే. తెలుగు భాషోద్యమ సమాఖ్యను బుద్ధప్రసాద్ గారి చొరవతోనే కీ.శే.సి.ధర్మారావు గారు, నేనూ మరికొందరి మిత్రులం వారితో కలిసి 2003లో స్థాపించామని వినయపూర్వకంగా తెలియజేస్తున్నాను.

తెలుగును విద్యారంగంలో, పరిపాలనా రంగంలో ముందుకు తేవడానికై సమాఖ్య స్థాపన నుంచి ఇప్పటివరకు ప్రభుత్వాల నుంచి వచ్చిన ముఖ్యమైన నిర్ణయాలన్నిటి వెనుక ఆయన పాత్ర ప్రముఖంగా వుంది. రాష్ట్రంలోగాని, పొరుగు రాష్ట్రాల్లోగాని, విదేశాల్లోగాని ఏ తెలుగు సాంస్కృతిక కార్యక్రమం జరుగుతున్నా బుద్ధప్రసాద్ గారు అక్కడ ఉంటారు. అటువంటి వారి సమక్షంలో, వారి షష్టిపూర్తి సందర్భంగా ఎన్టీఆర్ ట్రస్టు వారు ఈ కార్యక్రమాన్ని నిర్వహించడం చాలా ఆసక్తికరమైన సందర్భం. తెలుగుభాష, సంస్కృతిపట్ల మన ప్రభుత్వం ఇప్పటికైనా శ్రద్ధ వహిస్తుందనే ఒక ఆశ...ఒక నమ్మకం మాకందరికీ ఇందువల్ల కలుగుతున్నది.

ఈ సందర్భంగా నన్ను మాట్లాడమన్నందుకు సమావేశ కర్తలకు హృదయపూర్వక ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను. సుమారు రెండు దశాబ్దాలుగా భాషోద్యమంలో అంకితమై పనిచేస్తున్న కార్యకర్తగా నేను కొన్ని విషయాలను చెప్పడంలో కఠినమైన మాటలు దొర్లితే మన్నించ గోరుతున్నాను. నేను ఏ వ్యక్తినీ సంస్థనూ ఉద్దేశించి గాక- మొత్తంగా సమస్య మీదే కేంద్రీకరించి మాట్లాడదలచానని, ఆ క్రమంలో కొన్ని విమర్శలున్నా, కొన్ని కఠినమైన సూచనలున్నా వాటిని పెద్దలు సహృదయంతో స్వీకరించాలని, వాటిపై మనసుపెట్టి పరిశీలించాలని మనవి చేస్తున్నాను.

భాష-సంస్కృతి విడదీయరానివి. సాహిత్యం, కళలు మున్నగునవి అన్నీ అందులోనివే. అయితే భాషకు ఒక ప్రత్యేకత వుంది. మనిషి ప్రత్యేకతే భాష. భాష మనిషి మనుగడకు, నాగరకతకు అన్నిటికీ ఆధారం. కాలక్రమంలో వేల ఏళ్ళుగా అనేక భాషలు భూమండలంపైన విలసిల్లాయి. భాష ఆధారంగానే ఆయా మానవ సమూహాలు భాషా జాతులుగా పరిగణించబడ్డాయి. ఆ విధంగా కొన్ని వేల ఏండ్లుగా ఈ భారత భూఖండంమీద పుట్టి పెరుగుతున్న అత్యంత ప్రాచీనమైన ఒక భాషాజాతి- తెలుగుజాతి. భాషలేని జాతికి సాహిత్యం, కళలుతో సహా ఎటువంటి ప్రత్యేక సాంస్కృతికత గుర్తింపుకు రాదు. కనుక మనిషి మనుగడ, నాగరకత వికాసం అంతా భాషపైనే ఆధారపడి వున్నాయి.

ప్రాచీనమైన తెలుగుభాషకు చెందిన మనం ఇప్పుడు అతివేగంగా మన భాషను పోగొట్టుకుంటున్నాం. చదవడం, వ్రాయడం కోల్పోయి కేవలం మాట్లాడుకోవడం వరకే మన భాష పరిమితమైతే నేటి ప్రపంచంలో ఒక భాషాజాతిగా తెలుగుజాతి తన గుర్తింపును కోల్పోతుంది. అంటే ఉనికిని కోల్పోతుంది. ఇప్పుడు చారిత్రకంగా, సామాజికంగా, రాజకీయంగా, సాంస్కృతికంగా మనకు సంక్రమించిన అనేక కారణాలతోపాటు భాషాప్రయుక్త రాష్ట్రాలను ఏర్పాటు చేసుకున్న తర్వాత జరిగిన, జరుగుతున్న పరిణామాలు మనలను ఒక భాషాజాతిగా ఛిన్నాభిన్నం చేసి, కనుమరుగు చేయడానికి దారి తీస్తున్నాయి.

ఇందుకు ప్రధానంగా మేము ప్రభుత్వాలను, పాలకవర్గాలను తప్పు పడుతున్నాము. ప్రభుత్వాల పాత్ర లేకుండా ఒక భాష, దానితోపాటు సాంస్కృతిక వికాసం ఈ రోజుల్లో అసాధ్యమని మనవి చేస్తున్నాము. కేవలం ప్రభుత్వాలనే తప్పు పట్టడం సరికాదని, ఇందుకు ప్రజలు కూడా సమానంగా బాధ్యులు అని కొందరు అంటున్నారు. ప్రజాస్వామ్య ప్రభుత్వాల కాలంలో ప్రభుత్వాల వైఫల్యాలు, సమాజం

లోని మేధావుల, నేతల వైఫల్యాలే అవుతాయి. ప్రజలను చైతన్య పరచటంలో, ప్రభుత్వాల నిర్మాణంలో, విధానపరమైన విషయాల్లో, అన్నింటిలోనూ మేధావుల, నేతల పాత్ర ఎంతో వున్న సంగతి మనకు తెలుసు. తెలుగుభాషాసంస్కృతుల వికాసం విషయంలో మనం ప్రభుత్వ స్థాయిలో తీసుకోవలసిన అత్యవసర అంశాలను ఇప్పుడు ప్రస్తావించుకుందాం.

### సమగ్ర భాషావిధానం కావాలి

ఒక భాషాప్రయుక్త రాష్ట్రంగా 60 ఏళ్ళ చరిత్రలో మన ప్రభుత్వాలు ఎన్నడూ తెలుగుభాషాసంస్కృతులను కాపాడుకోవాల్సిన అవసరాన్ని గుర్తించలేదు. ఒక భాషకు చెందిన ప్రజలు తమను తాము తమ భాషలో పరిపాలించు కోవడానికి, తమ భాషలో చదువుకొని అన్ని రంగాలలో సర్వతోముఖ అభివృద్ధిని సాధించడానికి, ఒక భాషా జాతిగా అన్నివిధాలా వికసించడం కోసమే భాషా రాష్ట్రాలు ఏర్పడ్డాయన్న ప్రాథమిక సూత్రాన్ని మన ప్రభుత్వాలు విస్మరించాయి. తెలుగు భాషకోసం ఒక మంత్రిత్వశాఖను ఏర్పాటు చేసుకోవాలనే ఆలోచననే మన ప్రభుత్వాలు 60 ఏళ్ళ కాలంలో దరికి రానియ్యలేదు. అందువల్లనే మనకొక భాషా విధానం ఉండాలనే స్పృహ వారికి లేకుండా పోయింది. ఈ విషయమై తెలుగు భాషోద్యమ సమాఖ్య 2002 నుండి హెచ్చరిస్తూనే వుంది. చివరకు నాలుగైదు ఏళ్ళపాటు ప్రత్యేకించి పోరాడి 2012లో తిరుపతిలో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా మంత్రిత్వశాఖను సాధించుకుంది. జీవో నెం.909/31-12/2013 ద్వారా తెలుగుకు మంత్రిత్వశాఖ ఏర్పడింది. తర్వాత రెండు రాష్ట్రాలవడంతో రెండుచోట్లా మంత్రిత్వ శాఖలేర్పడ్డాయి. ఈ తరుణంలో భాషావిధానాన్ని ప్రభుత్వాలు ప్రకటించవలసి వుంది.

గౌ॥ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబు నాయుడు గారు 21-2-2012న అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం నాడు హైదరాబాదులో తెలుగు భాషోద్యమ సమాఖ్య నిర్వహించిన నిరసన సభకు వచ్చి సవివరంగా చేసిన ఉపన్యాసంలో సమాఖ్య డిమాండ్లు తొమ్మిదింటిని పూర్తిగా సమర్థించారు. రానున్న ఎన్నికల్లో తాము విజయం సాధించి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసిన తరువాత తెలుగు మంత్రిత్వశాఖనిస్తామని, భాషా విధానాన్ని స్పష్టంగా ప్రకటిస్తామని, తెలుగుభాషను అభివృద్ధిపరచటానికి ఒక ప్రాధికార సంఘాన్ని నియమిస్తామని, వీటికోసం బడ్జెట్‌లో ప్రత్యేక కేటాయింపులు ఇస్తామని ప్రకటించారు. తెలుగును ఒక భాషగా ఒకటి నుంచి 10వ తరగతి వరకు తప్పనిసరి చేస్తామని తాము 2003లో అధికారంలో వున్నప్పుడు ఇచ్చిన జీవో నెం.86ను పూర్తిగా అమలు చేస్తామని, ఇంటర్మీడియట్‌లో కూడా తెలుగును తప్పనిసరి చేస్తామని ఆయన ఆరోజున ప్రకటించారు. ఎన్నికల దగ్గర నుంచి, నవ్యాంధ్రప్రదేశ్ సారథిగా చంద్రబాబు నాయుడు గారు ప్రభుత్వ పగ్గాలను చేపట్టిన తరువాత - మరలా 2015 ఆగస్టు 29న తెలుగుభాషా దినోత్సవం నాడు ఇంచుమించు ఇవే వాగ్దానాలను చేశారు. భాషావిధానం సంగతిని మాత్రం ప్రస్తావించలేదు. తెలుగుదేశం పార్టీ ఎన్నికల మేనిఫెస్టోలో కూడా ఇంచుమించు ఇవే వాగ్దానాలు వున్నాయి. కానీ ఇవేవీ ఇంతవరకు అమలుకు నోచుకోలేదు.

**విద్యారంగం :**

విద్యారంగంలో మాతృభాష స్థానం ఏమిటో- ఒక మాధ్యమంగా దానిని ఎంతవరకు ఉపయోగించదలిచారో, ఒక సబ్జెక్టుగానైనా బోధించటానికి చేపట్టనున్న పాలనాపర చర్యలేమిటో ప్రభుత్వం స్పష్టం చేయాల్సి వుంది. ఈ స్పష్టత లేనందువల్ల విద్యారంగం పూర్తిగా గందరగోళంలో పడింది. విద్యార్థులు తెలుగులో పదవ తరగతిలో సున్నా మార్కులు తెచ్చుకునే పరిస్థితి ఎందుకేర్పడిందో పట్టించుకోవాలి. మాతృభాషను నిర్లక్ష్యం చేసి కేవలం ఇంగ్లీషుతోనే జ్ఞాన సంపాదన అనుకోవడం పూర్తిగ దొల్లతనంతో కూడుకున్నది. అది శాస్త్రీయమైన ఆలోచన కానేకాదు. తెలిసిన భాష ద్వారానే తెలియని జ్ఞానాన్ని సంపాదించడం అనేది శాస్త్రీయపద్ధతి. ఇప్పుడున్న పరిస్థితుల్లో ఆచరణలో వున్న ఇబ్బందుల్ని దాటడానికి ఒక పటిష్టమైన ప్రణాళిక వేసుకోవాలి. ప్రభుత్వం ఒక సమగ్రమైన భాషావిధానాన్ని రూపొందించుకోగలిగితేనే ఇదంతా సాధ్యపడుతుంది.

**పాలనారంగం :**

60 ఏళ్ళ అనుభవాన్ని కలిగి వుండి కూడా ఇంతవరకు పూర్తిగా పరిపాలనను ప్రజలభాష తెలుగులోకి తీసుకురాలేకపోవడం పాలక వర్గాలకు, అధికారులకు తలదించుకోవాల్సిన పరిస్థితి. కానీ వాళ్లు అలా అనుకోవడం లేదు! ప్రతిపాదనల దశ నుంచి చట్టసభలో చట్టాన్ని ఆమోదించడం, ఆ తర్వాత దానిని సచివాలయ స్థాయినుండి పంచాయితీ స్థాయి వరకు అమలు చేయడం-ఇదంతా మన రాష్ట్రంలో ప్రజలభాష తెలుగులోనే జరగాలి. ఇందుకు మన పాలకుల్లో రాజకీయ సంకల్పం లేకపోవడమే వైఫల్యాలకు కారణం. ముఖ్యమంత్రి స్థాయిలో ఒక స్పష్టమైన రాజకీయ సంకల్పం జరిగి దానిని అమలు చేయాలంటే ఇది అసాధ్యమైన సంగతేమీ కాదు. 30 ఏళ్ళ క్రితమే ఎన్టీఆర్ హయాంలో ఆయన దీనిని అమలుజరిపి చూపించారు. కనుక మళ్ళీ ఇప్పుడు మన ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడుగారు ఈ విషయంలో ఒక స్పష్టమైన విధానాన్ని చేపట్టాలని కోరుతున్నాను. ఆయన తలచుకుంటే ఇది చాలా తేలికైన సంగతి. అప్పుడు అధికారులు నిర్లక్ష్యంగా వ్యవహరించి రాజధాని నిర్మాణానికి సంబంధించిన శిలాఫలకాలను తెలుగులో లేకుండా ఇంగ్లీషులోనే వేసి పాలకుల, ప్రజల పరువు తీసే పరిస్థితి తలెత్తి వుండేది కాదు.

నవ్యాంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత కొత్తరాజధాని నిర్మాణంలో అన్ని అభివద్ధి రంగాలలో కొత్త రికార్డులు సాధించే దిశగా గౌ॥ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబునాయుడు గారు అద్భుతంగా చేస్తున్న కృషి సాటిలేనిది. వాటితోపాటు తెలుగుజాతి ఆత్మగౌరవాన్ని కాపాడేందుకు ఆయన అన్ని నిర్మాణరంగాల్లో తెలుగు కనిపించేట్లు, వినిపించేట్లు చర్యలు తీసుకోవాల్సి వుంది. ఇందుకు సరైన అధికారిక ఏర్పాట్లు లేకపోతే మన అధికారుల నిర్లక్ష్యం వల్ల ఎక్కడా తెలుగుకు చోటే లేని పరిస్థితి వచ్చే ప్రమాదం వుంది. తెలుగు అక్షరాలు లేని సంస్కృతి తెలుగు సంస్కృతి కాదు. భాషావిధాన ప్రకటనలో ఈ విషయాన్ని కూడా పరిగణనలోకి తీసుకోవాలి.

**తెలుగు ప్రాధికార సంస్థ (తెలుగు డెవలప్‌మెంట్ అథారిటీ) :**

తెలుగు మంత్రిత్వశాఖ క్రింద తెలుగు ప్రాధికార సంస్థ (తెలుగు డెవలప్‌మెంట్ అథారిటీ)ని ఏర్పరచాలి. ఇందులోనే తెలుగును సమకాలీన అవసరాలకు తగిన విధంగా నిత్యనూతనం చేసేందుకు కావలసిన నిపుణులతో కూడిన భాషాభివృద్ధి విభాగం, అనువాద విభాగం, తెలుగు వ్యుత్పత్తి పదకోశ విభాగం, తెలుగు మహానిఘంటువు నిర్మాణ విభాగం వంటి ముఖ్యమైన విభాగాలన్నీ వుంటాయి. విశ్వవిద్యాలయాల నుండి పాఠశాలల వరకు విద్యాసంస్థలు ప్రభుత్వ పాలనా శాఖలోని అన్ని శాఖలు, సమాచార ప్రసార సంస్థలు తదితర అన్నిరంగాల

వారికి "తెలుగు ప్రాధికార సంస్థ" సేవల్ని అందుబాటులో వుంచాలి. దీనికోసం తమిళనాడులోని తమిళ డెవలప్‌మెంట్ అథారిటీ, కర్నాటక లోని కన్నడ ప్రాధికార సంస్థ కార్య విధానాల్ని పరిశీలించవచ్చు. నిపుణుల, భాషోద్యమకారుల ప్రమేయంతో, సలహా సంప్రదింపులతో ఈ తెలుగు ప్రాధికార సంస్థను రూపొందించాలి.

<u>ఈ సమ్మేళన నిర్వాహకులు పంపించిన లేఖలో భాషకు సంబంధించిన కొన్ని ప్రశ్నలకు నా అభిప్రాయాల్ని తెలియజేస్తున్నాను.</u>

**పొరుగు రాష్ట్రాల్లోనూ విదేశాల్లోనూ స్థిరపడినవారికి తెలుగును నేర్పడం..**

ఇది అత్యంత ముఖ్యమైన విషయం. తెలుగు విశ్వవిద్యాలయంలో భాగంగా వున్న మండలి కృష్ణారావు అంతర్జాతీయ తెలుగు కేంద్రంను స్థాపించిందే అందుకు. 1975లో జరిగిన తొలి ప్రపంచ తెలుగు మహాసభల తీర్మానాన్ని అనుసరించి ఈ సంస్థ ఏర్పడింది. తెలుగు విశ్వవిద్యాలయంలో ఒక భాగంగా దీన్ని చేయడంతోనే దీని ప్రాణం సగం పోయింది. ఇప్పుడు రెండు రాష్ట్రాలైనందున– మళ్ళీ నవ్యాంధ్ర ప్రదేశ్‌లో దీనిని ఒక స్వతంత్ర సంస్థగానే ఏర్పాటు చెయ్యాలి. దీనిని ఏ పరిస్థితుల్లోనూ మరొక సంస్థకు అనుబంధంగాని, శాఖగాని చేయ కూడదు. దీనికి ప్రత్యేకంగా బడ్జెటు కేటాయింపు ఇవ్వాలి. తెలుగు మంత్రిత్వశాఖ పరిధిలో ఈ సంస్థను ఉంచాలా, లేక ముఖ్యమంత్రిగారి కిందే నేరుగా ఉంచాలా అనేది కూడా ఆలోచించాల్సిన విషయం.

రెండు తెలుగు రాష్ట్రాల్లోనూ కలిపి ఎందరు తెలుగువారున్నారో అందుకు సమాన సంఖ్యలో బయటి రాష్ట్రాల్లోనూ తెలుగువారుండటం ఒక చారిత్రక విచిత్రం. ఇందులో 1953లో ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం ఏర్పడినప్పుడూ, 1956లో తెలంగాణను కూడా కలుపుకొని విశాల రాష్ట్రం ఏర్పడినప్పుడూ జరిగిన అన్యాయాల వల్ల చుట్టూ అత్యధికంగా తెలుగువారున్న ఎన్నో ప్రాంతాలను పోగొట్టుకున్నాం. అలా పొరుగు రాష్ట్రాల్లో మిగిలిపోయిన వారంతా భాషాసంస్కృతుల పరంగా ఇప్పుడు బాగా పరాయికరణకు బలి అయ్యారు. 2002లో కృష్ణాజిల్లా శ్రీకాకు ళంలో జరిగిన తెలుగు భాషోద్యమ సమాలోచనా శిబిరంలో మొత్తం చర్చ జరిగిన ఐదు అంశాల్లో ఇదొక అంశం. అప్పుడే ఈ విషయాలను పత్రరూపంలో ప్రకటించడం జరిగింది. అప్పటినుండి ఈ అంశంపై తెలుగు భాషోద్యమ సమాఖ్య, నడుస్తున్నచరిత్ర పత్రిక (ఇప్పుడదే పత్రిక 'అమ్మనుడి'గా వస్తున్నది) విస్తృతంగా ప్రచారం చేస్తూనే వున్నాయి. ఇతర రాష్ట్రాల్లో తెలుగువారికి తెలుగును నేర్పించడం అంటే –చద వడం, వ్రాయడం నేర్పాలి. వాళ్ళకు తెలుగు వచ్చు. అనేక కారణాల వల్ల వాళ్ళు మాట్లాడే తెలుగుకు, మనం మాట్లాడే తెలుగుకు తేడా లుంటాయి. కనుక ఆ అంశాలను దృష్టిలో పెట్టుకొని అక్కడి వారికి అక్కడ ప్రత్యేకించి తయారుచేసిన వాచకాల్నే ముద్రించి ఇవ్వాలి. శిక్ష ణను కూడా ఇక్కడ మనం చేస్తున్నట్లు తెలుగు పేరుతో మూడొంతుల సంస్కృతపదాల్ని నేర్పుదామంటే కుదరదు.

ఈ అంశాల్ని దృష్టిలో వుంచుకొని, 'తెలుగువాణి' అనే ప్రత్యేక ట్రస్టును మేము స్థాపించి దాని ద్వారా ఇప్పటికి తమిళనాడులో ఎంతో కృషి చేశాము. వేలూరు జిల్లాలో కనీసం 4 వేలమందికి, తక్కినచోట్ల మరొక వెయ్యిమందికి తెలుగు నేర్పాం. వారిలోంచి రచయితలు బయ టకు వచ్చి తెలుగులో అనేక కథలు వ్రాశారు. ఇప్పుడు కోయంబత్తూరు దగ్గర ఉడుములపేట ప్రాంతంలో జూన్ 1 నుండి డిసెంబరు 30 వరకు 6 నెలల పాటు 100 గ్రామాల్లో10 వేలమందికి తరగతులు జరుగనున్నాయి. 'తానా' వారు ఆర్థిక సహాయం అందిస్తున్నారు.

భారతదేశంలోని ఇతర రాష్ట్రాల్లో ఉన్నవారంతా ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత బ్రతుకుదెరువు కోసం అక్కడకు వలస వెళ్ళిన వారు కాదు. కనుక వాళ్ళను 'ప్రవాసాంధ్రులు' అనే మాటతో కించపరచ కూడదు. భారతదేశమంతా తమదే అనుకొని బ్రతకటం తెలుగువారికి తొలినుండీ అలవాటు. వ్యవసాయ ప్రధానమైన భూమి ఉందని తెలిస్తే శ్రమిస్తారు. తన చేతి వృత్తులకు అక్కడ అవకాశం ఉందని తెలిస్తే ఎంతదూరమైనా వెళ్ళిపోతాడు. అంతేకాదు..సంచారజాతులుగా దక్షిణ భారతదేశమంతటా– ఆ మాటకు వస్తే దేశమంతటా తిరిగే సంచార జాతుల్లో అత్యధికులు తెలుగువారే. కారణం – భారత ఉపఖండంలో తెలుగువారు ఒక ప్రాచీనభాషాజాతి కనుక. రాష్ట్రేతర తెలుగువారి గురించి మనం ఆలోచించేటప్పుడు ఇంత లోతుగా ఆలోచించాలి. రాష్ట్రం ఏర్పడిన తరువాత అక్కడకు వెళ్ళి ఉద్యోగమో, వ్యాపారమో చేసుకుంటున్న కొద్దిమందిని మాత్రమే దృష్టిలో పెట్టుకొని మనం ఆలోచించకూడదు.

ఇక విదేశాల్లో వున్న తెలుగువారి సంగతి : ఇదీ అనేక రకాలుగా వుంటుంది. శ్రీలంక, బంగ్లాదేశ్, మయన్మార్, మారిషస్, మలేసియా, సింగపూర్, ఇండోనేషియా వంటి దేశాల్లో వందల సంవత్సరాలుగా వున్న తెలుగువాళ్ళ భాషా సాంస్కృతిక అవసరాలకూ, ఇటీవల అమె రికా, యూరప్ దేశాలకు వెళ్ళి స్థిరపడుతున్నవారి పిల్లల భాషావ సరాలకూ బోలెడంత తేడా వుంది.

అందరూ మనకు కావాలి. కనుక రెండు తెలుగు రాష్ట్రాలకు బయట భారతదేశంలోనే ఉన్న తెలుగువారినీ, వందల ఏళ్ళుగా సమీప దేశాల్లో వున్న తెలుగువారినీ, ఇటీవల విదేశాలకు వెళ్ళి స్థిరపడిన వారి పిల్లలనూ– విడివిడిగా దృష్టిలో ఉంచుకొని పాఠ్య ప్రణాళికలను, పుస్తకాలనూ, బోధకులనూ మనం తయారు చేసుకోవాలి. ఇలాంటి అన్ని విషయాలనూ సాకల్యంగా అర్థం చేసుకొని తగినంత సామర్థ్యంతో అంకితభావంతో పని చేయగల వ్యక్తులతో అంతర్జాతీయ తెలుగు సంస్థను మనం ఏర్పాటు చేసుకోవాలి. దీన్నెట్లా మనం రూపొందించు కోవాలో తెలియాలంటే ఎంతో గొప్పగా పని చేస్తున్న అంతర్జాతీయ తమిళ సంస్థను చూచి కొంతయినా నేర్చుకోవడం మంచిది అని మనవి చేస్తున్నాను.

**పేరు పలకలు (నామఫలకాలు), రాతి పలకలు (శిలాఫలకాలు) వంటి అంశాలు :**

2002 నవంబరులో కృష్ణాజిల్లా శ్రీకాకుళంలో శిబిరం జరిగిన తర్వాత భాషోద్యమకారులం తీసుకొన్న తొలి కార్యక్రమమే – హైదరా బాద్‌లో సచివాలయం వాకిలిపైనా, తెలుగుతల్లి విగ్రహం పైనా తెలుగు లేకపోవడం పైన ఉద్యమం అన్న సంగతి మరువకూడదు. అప్పుడు ముఖ్యమంత్రిగా ఉన్నదీ గౌ॥నారా చంద్రబాబునాయుడుగారే. గౌ॥ మండలి బుద్ధప్రసాద్ గారు అప్పుడు కాంగ్రెసు పార్టీకి చెందిన శాసన సభ్యులుగా వున్నారు. మేమంతా సచివాలయం వాకిలి వద్ద ధర్నా చేసి ఆయనతో సహా అందరం అరెస్టు అయ్యాం కూడా. ఇప్పుడూ అదే పరిస్థితి. నవ్యాంధ్ర రాజధాని శిలా ఫలకంలో తెలుగు లేదు. అయినా ఆందోళనలకు పూనుకోకుండా విన్నపాలతో సరిపుచ్చడానికి కారణాలు 1. ఇది కొత్త రాష్ట్రం – అంతా అభివృద్ధి అంశాల పనుల్లో ఉన్నారు. అభివృద్ధి అంటే ఇంగ్లీషే అనే గాలిలో పడి కొట్టుకుపోతున్నారు. అధికారులంతా తెలుగును పట్టించుకోవడం

లేదు. అయినా అంతా మనవాళ్ళే గనుక దారికి వస్తారులే అనే ఆశ.
2. గౌ॥బుద్ధప్రసాద్ గారు ఉపసభాపతిగా వుండగా తెలుగు భాషోద్యమ సమాఖ్య ఆందోళనకు పూనుకొనే ముందు-సమాఖ్య స్థాపకుల్లో ఆయనా ఒకరు గనుక-మరికొంత వ్యవధి తీసుకోవాలనే సంయమనం.

ఇది అసలు పెద్ద సమస్య కాదు. కానీ పాలకుల, ప్రజల పరువును పోగొట్టే అంశం ఇది. దీనికి కారణం- కేవలం ప్రభుత్వ నేతల, అధికారుల పట్టనితనం. అయితే పరిపాలనను పూర్తిగా ఆంగ్లంలోకి తేవాలనే వ్యూహం ఇందులో అంతర్లీనంగా వున్నదని కొందరు పెద్దలు అనుమానిస్తున్నారు.

ఏలికలకు మనసు ఉంటే ఈ సమస్య పరిష్కారం చాలా సులువు :-

1. అంగళ్ళ మరియు సంస్థల చట్టాన్ని కఠినంగా, ఎటువంటి మినహాయింపులు లేకుండా అమలు జరపాలి. ఉల్లంఘించినవారికి శిక్షలను విధిస్తూ ఉత్తర్వులు ఇవ్వాలి.
2. ప్రభుత్వ స్థాయిలో గాని, ప్రభుత్వేతర రంగాల్లో గాని ఎటువంటి కార్యక్రమాలెక్కడ జరిగినా వాటికి సంబంధించిన బోర్డులను, ప్రకటలను, పత్రాలను అన్నిటిని మొదట తెలుగులో ప్రముఖంగా యిచ్చి, ఆ తర్వాతే ఇంగ్లీషును గాని, ఏ ఇతర భాషను గాని ఇవ్వవచ్చు..అని స్పష్టమైన జి.వోను ఇవ్వాలి. దీని అమలుకు రాష్ట్ర సచివాలయ అధికారులతో పాటు జిల్లా, పంచాయితీ స్థాయిలలోని అధికార్లను బాధ్యుల్ని చేయాలి. ఉల్లంఘనకు శిక్ష విధించాలి.
3. పై రెండు చర్యలతో పాటు ఈ అంశంపై గౌ॥ముఖ్యమంత్రి, గౌ॥మంత్రులు, పార్టీల నేతలు, ప్రజల్లో ఒక స్ఫూర్తిని తెచ్చేందుకు సంకల్పించి, పట్టుదలతో ప్రచారం చేయాలి. దీన్నొక ప్రత్యేక కార్యక్రమంగా కొత్త రాష్ట్రంలో తీసుకుంటే- తెలుగుదేశం పార్టీకి, ప్రభుత్వ నేతలకు పరువు దక్కడమే కాదు, కీర్తి వస్తుంది. ప్రజలకు మళ్ళీ ఎన్టీఆర్ తలపుకొస్తారు.

**తెలుగుభాషకు ప్రాచీనతా(క్లాసికల్) హోదా వలన లభించే నిధుల గురించి ప్రభుత్వ చర్యల గురించి...**

ఈ అంశాన్ని సరిగా తెలుసుకోవాలంటే ప్రాచీనభాష హోదావల్ల కలిగే ప్రయోజనాల గురించి, కార్య విధానాన్ని గురించిన అవగాహన ఉండాలి. అది లేకుండా ఎవరికి తోచినట్లు వారు బాధ్యతాయుత స్థానాల్లో వున్న పెద్దలతో సహా మాట్లాడి, వ్యవహరించి చివరకు ఎందుకూ గాని పరిస్థితికి తెచ్చారు. ముందుగా తెలుసుసుకోవాల్సిన అంశాలు ఇవి.

1. ఈ హోదా క్రింద జరుగవలసిన పరిశోధన వగైరా కార్యక్రమాలకు నిర్వహణ, నియంత్రణ- ఆర్థిక వ్యవహారాలతో సహా- మొత్తం మైసూరులోని సి.ఐ.ఐ.ఎల్ క్రిందనే వుంటుంది.
2. కోర్టులో వున్న కేసుల దృష్ట్యా పూర్తిస్థాయిలో పనులు ప్రారంభం కాకుండా కేవలం పరిశోధనా సంస్థను ప్రారంభించి నిర్ణయించిన ప్రకారం కొన్ని పనులను మాత్రమే చేయవలసి వుంటుంది.
3. మైసూరులో పరిశోధనా సంస్థను తొలుత ప్రారంభించి, రెండేళ్ళ తరువాత తెలుగునేలకు తెచ్చుకుంటే వ్యవస్థ సరిగా ఏర్పడి వుండేది. తమిళనాడు వారు అలా చేశారు. అయితే మనం మాత్రం స్వాభిమానానికి పోయి పరువు పోగొట్టుకున్నాం. ముగ్గురు ముఖ్యమంత్రులు మారినా మన ప్రభుత్వం పరిశోధనా సంస్థకు కావలసిన భవన వసతిని ఇవ్వలేకపోయింది. అందువల్ల అటు మైసూరులోనూ కాక, ఇటు హైదరాబాదులోనూ గాక రెంటికీ చెడ్డ రేవడిలా అయినాము. ఇప్పుడున్న పరిస్థితుల్లో- రెండు రాష్ట్రాలయిన నేపథ్యంలో- మైసూరులోనే కేంద్రపరిశోధనా సంస్థను కొనసాగనివ్వడం మంచిది. అక్కడే తగిన వ్యక్తులను చేర్చుకొని పని సాగించడమే మంచిది. కోర్టులో వున్న వ్యవహారాన్ని పరిష్కరించుకోవడానికి మన రెండు రాష్ట్రాలూ కలిసికట్టుగా కృషి చేసి సాధించాలి. ఇంతకుమించి ఇప్పుడీ దశలో ఎవరు మాత్రం ఎటువంటి సూచనలు చేయడానికి అవకాశం వుంది గనుక?! లాంఛనంగా మైసూరులో కొంత పని మొదలయిందని వింటున్నాము. ఇప్పటికైనా ఆంధ్రప్రదేశ్, తెలంగాణ ప్రభుత్వాలు ఈ అంశంపై మాట కలుపుకొని, ముందుకు సాగాలి.

పెద్దలారా! ఒక ముఖ్యమైన విషయాన్ని మీ అందరిదృష్టికి తేదల్చుకున్నాను.

**భాషా విధానం గురించి గుంటూరులో 2004లో రెండు రోజుల సదస్సును తెలుగు భాషోద్యమ సమాఖ్య నడిపింది. దానిలో భాషా శాస్త్రజ్ఞులు, అధ్యాపకులు, ప్రభుత్వ అధికారులు, మంత్రివర్యులు పాల్గొన్నారు. అప్పటినుండి భాషా విధానం గురించి సమాఖ్య పని చేస్తున్నది.**

**భాషావిధానం ఎట్లా వుండాలో పూర్తి వివరాలతో తయారుచేసి సిద్ధంగా వుంది. దీనిని హైదరాబాదు విశ్వవిద్యాలయ ఆచార్యులు శ్రీ గారపాటి ఉమామహేశ్వరరావు, శ్రీ అద్దంకి శ్రీనివాస్ తయారు చేయగా, అమ్మనుడి మాసపత్రికలో దానియొక్క ప్రధాన భాగాన్నంతా ప్రచురించాము.** (సెప్టెంబరు, అక్టోబరు, నవంబరు, డిసెంబరు 2015 సంచికలు)

**దీనిని సమీక్షించి, అమలుకై అవసరమైన వ్యవస్థ నిర్మాణం వంటి విషయాలపై చర్చించి నిర్ణయాలు తీసుకునేందుకు తెలుగుభాషా సాంస్కృతిక శాఖామంత్రిగారు సంబంధిత అధికారులు అన్ని రంగాల నిపుణులతోను, భాషోద్యమ ప్రతినిధులతోనూ ఒక ప్రత్యేక సమావేశాన్ని ఏర్పాటు చేయవలసిందిగా కోరుతున్నాను. ఆ సమావేశం సిఫార్సుల మేరకు ముమ్ముందు తగిన కార్యాచరణకు పూనుకోవాల్సిందిగా బాధ్యులకు మనవి చేస్తున్నాను. ఈ ప్రయత్నంలో ప్రభుత్వానికి తెలుగు భాషోద్యమ సమాఖ్య పూర్తి సహకారాన్ని అందించగలదని హామీ ఇస్తున్నాను.**

చివరగా ఒక్కమాట...

తెలుగు లేని, రాని తెలుగు ప్రజలు ఎంతకాలం తెలుగుజాతి వారిగా గుర్తింపబడతారు? ప్రపంచవ్యాప్తంగా అత్యంత ఉన్నత స్థానాలకు మనం చేరవలసిందే. అందుకు కావలసిన భాషలన్నింటినీ నేర్వవలసిందే. కానీ ప్రపంచంలోనే అతిపెద్ద భాషల్లో ఐదవస్థానంలోనో ఆరవస్థానంలోనో వున్న మన భాష - అన్ని విధాలా శ్రేష్ఠమైన భాష. మన వారసత్వం మన సంస్కృతి ప్రతీకను పూర్తిగా వదులుకుందామా? లేక దాని ఆధారంగానే సగర్వంగా తలెత్తుకుని ప్రపంచంలో అభివృద్ధి పథాలకు దూసుకుపోదామా? ఆలోచించండి! మాతృభాషతోనే...అంటే అమ్మనుడితోనే అందలం. అమ్మనుడి ద్వారానే ఇతర భాషలను, అనంత విజ్ఞానాన్ని అందుకుందాం. మన పాలకులు, మన మేధావులు, మనం ఈ దిశగా ఆలోచించాలని నా విన్నపం. తెలుగు రాష్ట్రాలు రెండూ నిజమైన తెలుగు రాష్ట్రాలుగా విలసిల్లాలని కోరుకుంటున్నాను. ❋

-స.వెం.రమేశ్

# తెలుగులో తెలుగు నుడికట్టు-2

ఒక నుడి కట్టుబాటునూ అందుకు చెందిన తీరు తెన్నులనూ వివరించేది వ్యాకరణశాస్త్రం. దాన్నే 'నుడికట్టు' అని తెలుగులో అనుకొందాం. అసలు, ఒక నుడికి చెందిన వ్యాకరణాన్ని మరొక భాషలో వ్రాయడమెందుకు? తెలుగు వ్యాకరణాన్ని సంస్కృతీకరించి, తెలుగుకొక మర్యాదను తేవడానికే ఆనాటి పండితులు తమదైన శైలిలో కష్టపడ్డారనుకుందాం. ఇప్పుడా చర్చ అక్కరలేదు. కాని కొందరు తెలివిపరులు అడుగుతున్నట్లు - ఏం, తెలుగు వ్యాకరణాన్ని - అదే - నుడికట్టును కమ్మటి తెలుగులోనే వ్రాసుకోలేమా? నేర్చుకోలేమా? అటువంటి ప్రయత్నాన్ని లోగడ కొందరు చేశారేమో! ఇప్పుడు మాత్రం 'అమ్మనుడి' (నడుస్తున్న చరిత్ర) పత్రిక చదువరులకు చిరపరిచితుడైన స.వెం.రమేశ్ ఆ పని చేశాడు. చక్కని తెలుగులో కతలు, వ్యాసాలు వ్రాసి ప్రసిద్ధుడైన తెలుగు నుడి పోరాట కార్యకర్త, తమిళనాడులో తెలుగువారికి తెలుగును చదువనూ, వ్రాయనూ నేర్పుతున్న 'తెలుగువాణి' ట్రస్టీ ముఖ్య కార్యకర్త స.వెం.రమేశ్ - ఎవరినీ ఏమీ విమర్శించకుండా ఎంతో తేలిగ్గా తెలిసేట్లు 'తెలుగులో తెలుగు నుడికట్టు'ను వ్రాశాడు. ఇంతవరకు ఉన్న వ్యాకరణ సూత్రాలనే సిసలైన తెలుగులో మనకు అందిస్తున్నాడు. దీనిలో తప్పులను ఎత్తిచూపితే సరిదిద్దు కొంటాననంటున్నాడు. సూచనలు, సలహాలను వినయపూర్వకంగా కోరుతున్నాడు. తెలుగు పండితులు, తెలుగు భాషాశాస్త్రజ్ఞులు దయతో దీనిని మనసు ఉంచి చదవాలని, తమ విమర్శలను, సూచనలను, సలహాలను తెలియజేయాలని కోరుతున్నాం. వాటిని 'అమ్మనుడి' పత్రికలో ప్రచురించడానికి అనుమతిస్తే ప్రచురిస్తామని కూడా మనవి చేస్తున్నాం. - సంపాదకుడు

మే సంచికలో 'తెలుగులో తెలుగు నుడికట్టు' వ్యాసం తొలిభాగాన్ని (మునుపలుకును) ఇచ్చాము. అందులోని కొన్ని- తెలుగు రాష్ట్రాలలో వాడుకలో లేని తెలుగు మాటలకు- ఇప్పుడు వాడుకలో వున్న పదాలను ఈ క్రింద ఇస్తున్నాము.

| | తెలుగు మాటలు | పెరతెల్లము |
|---|---|---|
| 1) | ఉసురు | - ప్రాణి |
| 2) | కవత | -మైధునం |
| 3) | విడిత | -ప్రత్యేకత |
| 4) | వంచము | -ముఖ్యం |
| 5) | అరయిక | -పరిశోధన |
| 6) | ఎసవరి | -శాస్త్రవేత్త |
| 7) | నెరవు | -వ్యాప్తి |
| 8) | కనుబడి | -ఉత్పత్తి |
| 9) | మట్టు | -స్థాయి |
| 10) | నిలమ | -స్థితి |
| 11) | ఎసరక | -ప్రకృతి |
| 12) | ముట్టులు | -వస్తువులు |
| 13) | అవనించు | -సిద్ధపరచు |
| 14) | కవరం | -వ్యాపారం |
| 15) | త్రోవ | -మతం |
| 16) | ఏరుపాటు | -నియమం |
| 17) | కట్టుపాటు | -నిబంధన |
| 18) | పాటిడి | -ఆచారం |
| 19) | తెలివిడి | -జ్ఞానం |
| 20) | మొక్కుబడి | -ప్రార్థన |
| 21) | బాగుబడి | -పూజ |
| 22) | తొడరు | -అనుసరించు |
| 23) | పెరుమాళు | -విష్ణువు |
| 24) | కరద | -వచనం |
| 25) | కొలువు | -సభ |
| 26) | ఎరుకువ | -విజ్ఞానం |
| 27) | పెనునుడి | -అనుసంధాన భాష |
| 28) | ఆనునుడి | -ఆధారభాష |
| 29) | నిలవరం | -పరిస్థితి |
| 30) | మేవడి | -గౌరవం |
| 31) | మినుకు | -వేదం |
| 32) | కొలువడి | -ఛందస్సు |
| 33) | వ్రాపొడ | -లిపి సంకేతం |
| 34) | ఒళంద | -డచ్ |
| 35) | బుడతకీచు | -పోర్చుగల్ |
| 36) | పరాసు | -ఫ్రెంచి |
| 37) | అగవనిక(అగవు+అను+ఇక) | -క్రియావాచకం |
| 38) | పేరనిక (పేరు+అను + ఇక) | -నామవాచకం |
| 39) | మంది ఏలుబడి | -ప్రజాస్వామ్యం |
| 40) | పేరోలగం | -అకాడెమీ |
| 41) | మరమయగింత | -యాంత్రీకరణ |
| 42) | ఎసవు ఎరుక | -శాస్త్రవిజ్ఞానం |
| 43) | మూలమయగింత | -ప్రపంచీకరణ |
| 44) | తరి | -కాలం |
| 45) | దొరతనం | -ప్రభుత్వం |
| 46) | అగవిలు(అగవు+ఇలు) | -కార్యాలయం |
| 47) | మెలన | -చరిత్ర |
| 48) | నోయి | -గ్రంథం |
| 49) | అరణి | -ధర్మసంస్థ (ట్రస్ట్) |
| 50) | ఆనిమిమాట | -సాంకేతికపదం |

# తెలుగు నుడికట్టు

**తా**వుతావుకూ కుదురుకుదురుకూ నోటినోటికీ మారే పలుకు తీరుకు వ్రాతలో ఒక కట్టుపాటు ఉండాలె. నిక్కముకు కట్టుపాటును ఏరుపఱచుకొని నుడి పుట్టదు. నోటి నుడువుకే కట్టుపాటును వ్రాసు కొంటాము. అయితే నోటిమాట, తతితతికీ తావుతావుకూ ఎంతో వేఱిమి కలిగి ఉంటుంది. వ్రాతలో ఈ పలుతనాన్ని అంతా చూప లేము. కతలూ పాటలూ వంటి నానుడి అల్లికలో తావుపలుకు తీరును చూపించవచ్చు కానీ, బడిపొత్తాలలో ఎసవునోయిలలో ఉండేనుడికి ఒక కట్టుపాటు ఉండాలె. అప్పుడే అది అన్ని తావుల వారికీ చెందు తుంది. ఆ వ్రాత కట్టుపాటును తెలుపునదే నుడికట్టు.

**1. నుడిపాయలు :-**

నుడిలో అయిదు తీరుల మాటలు ఉంటాయి. వీటిని నుడి పాయలు అంటారు. అవి వరుసగా; పేరనిక, మఱుపేరనిక, అగ వనిక, ఓజనిక, బిగువనిక.

1:1) పేరులను తెలుపునది పేరు అనిక. ఇది నాలుగు తీరులు.

అ) గుఱిపేరు : సుబ్బమ్మ, పోచయ్య, కంచి

ఆ) గుమిపేరు :బడి, మేక, పండు

ఇ) ఓజపేరు :చిన్న, పెద్ద, పిఱికి

ఈ) పనిపేరు :చదువు, వెలుగు

1:2) పేరుకు మారుగా వాడునది మఱు పేరనిక: నేను, మేము, మనము, నువ్వు, మీరు, అతడు, ఆమె, అది, వారు

1:3) పనిని తెలుపునది అగవనిక, ఇది నాలుగు తీరులు.

అ) చేబడి అగవు : చేబడితో ఉండునది.

మచ్చు : ఎల్లయ్య బర్రెను మేపెను (బర్రె ఇక్కడ చేబడి)

ఆ) చేబడమి అగవు : చేబడి లేనిది. మచ్చు : మల్లి పరుగెత్తెను

ఇ) నిండు అగవు : చేసెను, తినెను

ఈ) కొఱ అగవు : చేసి, తిని

1:4) ఓజను తెలుపునది ఓజనిక. ఇది తొమ్మిది తీరులు.

| | |
|---|---|
| అ) గుఱితోడు ఓజ | : **చిన్నయ్య** అతడు |
| ఆ) గుమితోడు ఓజ | : **కుమ్మరి** కులం |
| ఇ) అగవుతోడు ఓజ | : **వచ్చు** పిల్లవాడు |
| ఈ) ఓజతోడు ఓజ | : **నల్లని** పాప |
| ఉ) అంకెతోడు ఓజ | : **ఏడు** చేపలు |
| ఊ) ఉరువుతోడు ఓజ | : **తెలివి**పఱుడు |
| ఎ) అణకువ ఓజ | : **తిక్కన** ప్రెగ్గడ |
| ఏ) అగవు ఓజ | : **మెల్లగా** నడిచెను |
| ఐ) అగపుట్టు ఓజ | : **చెప్పిన** మాట |

1:5) మాఱుపుకు లోనుకాకుండా బిగువుగా ఉండునది. బిగువనిక. ఇది రెండు తీరులు.

అ) పుట్టుబిగువు : పుట్టుకతోనే బిగువు. మచ్చు : మిక్కిలి, ఊరక

ఆ) పెట్టుబిగువు : నుడికట్టు వలన ఏరుపడునది. మచ్చు : చదివి, తినక

**2. కూరుపులు :-**

తేటతెల్లంగా నుడుగు ఏరుపడుటకు, మాటల వరుస నడుమన వాడే వాటిని కూరుపులు అంటారు. తెలుగు కూరుపులు ఏడు పెడలుగా ఉంటాయి.

| **కూరుపు** | **పెడ** |
|---|---|
| డు-ము-వు-లు | తొలిపెడ |
| ని-ను-ల-కూర్చి-గుఱించి | రెండవపెడ |
| చేత-చే-తోడ-తో | మూడవపెడ |
| కొఱకు-కై-కోసం | నాలుగవపెడ |
| వలన- కంటె-పట్టి | అయిదవపెడ |
| కి-కు -యొక్క-లో-లోపల | ఆఱవపెడ |
| అందు-న | ఏడవపెడ |
| ఓ-ఓయి-ఓరి-ఓసి | పిలుపుపెడ |

3. **అంకె అనికలు :-**

అంకెను తెలిపేవి అంకె అనికలు. ఇవి నాలుగు తీరులు.

3-1) ఒక ఉరువును కానీ ఒక ఉసురును కానీ తెలియచేయునది ఒక్కనిక. మచ్చులు : ఎద్దు, కడవ

3-2) ఒకటికి మించిన ఉరువులను కానీ ఉసురులను కానీ తెలియచేయునది పెక్కనిక. మచ్చులు : ఎద్దులు, కడవలు

3-3) ఎల్లప్పుడూ ఒక్కనికలుగానే ఉండునవి ఎల్ల ఒక్కనికలు.

అ) పైరు పేరులు : కంది, వరి, పెసర

ఆ) వంట సరకులు : ఉప్పు, చమురు, చక్కెర

ఇ) లోహములు : ఇత్తడి, ఇనుము, వెండి

ఈ) ఓజ పేరులు : ఎరుపు, నలుపు

3.4) ఎల్లప్పుడూ పెక్కనికలుగానే ఉండునవి ఎల్ల పెక్కనికలు.

అ) గుఱుముల పేరులు : పెసలు, రాగులు, వడ్లు

ఆ) ఆటల పేరులు : అచ్చనగాయలు, ఓమనగుంటలు

ఇ) ఊటల పేరులు : నీరు, పాలు, చల్ల

4. **పుట్టులు :-**

పుట్టుక తీరును తెలుపునవి పుట్టులు. ఇవి మూడు తీరులు.

4.1) పెంటిపుట్టు : ఆడువారిని తెలుపునది= మంగ, రుద్రమ

4.2) పోతుపుట్టు : మగవారిని తెలుపునది = వేమన, అన్నమయ్య

4.3) పేడిపుట్టు : పై రెండు వగలలోనూ చేరనివి. ఇవి రెండు తీరులు; ఉసురు ఉన్నవి (చిలుక, మేక), ఉసురు లేనివి (కొండ, రాయి)

**5. నుడుగులు :-**

నిండు అయిన తెల్లమును ఇచ్చు మాటల వరుసను నుడుగు అంటారు. నుడుగులు నాలుగు తీరులు.

5.1) నిండు నుడుగు : నిండు అగవుతో కూడిన నుడుగు

మచ్చు : ఆదెయ్య చెప్పును కుట్టెను

5.2) నిడుపు నుడుగు : పలు కొఱ అగవులు కలిగి, ఒక నిండు అగవుతో ముగిసే నుడుగు.

మచ్చు: పొన్నమ్మ కూడు **తిని**, బడికి **పోయి**, బాగా చదివినది.

5.3) అడ్డగింత నుడుగు : మాటలాడునపుడు ఒక నుడుగుకు నడుమన వచ్చు మఱొక నుడుగు.

మచ్చు : కాంతమ్మ వంట చేయుట నేరుచుకొంటున్నపుడు– **అప్పటికి ఇంకా కాంతమ్మకు పెండ్లి కాలేదు** –కందిపప్పు వెల బాగా తక్కువ.

5.4) పెన్నుడుగు : పై నుడుగులు అన్నీ కలసిన పెద్ద నుడుగు.

**6. తఱి అనిక :–**

జరిగిపోయిన, జరుగుతున్న, జరుగబోవు వాటిని తెలుపునవి తఱి అనికలు.

6.1) కడతఱి : గడచిపోయిన తఱిని తెలుపునది.

6.2) నడతఱి : నడుచుచున్నాడు, తినుచున్నది.

6.3) మీదుతఱి : జరుగబోవు తఱిని తెలుపునది.

6.4) పాటి తఱి : పాటిగా జరుగు పనులను తెలుపునది.
మచ్చు :గాలి వీచును, పొద్దుపుట్టును

**7. మాసి అనిక :–**

7.1) తొలిమాసి : తనను గుఱించి తెలుపునది నేను, మేము

7.2) మలిమాసి : ఎదుటివారిని గుఱించి తెలుపునది నువ్వు, మీరు

7.3) ఎడమాసి : ఎడంగా ఉన్నవారిని గుఱించి తెలుపునది అతడు, ఆమె

**8. చేతరి, చేబడి, చేత :–**

తెలుగు నుడుగులందు మాటలు, 'చేతరి చేబడి చేత' వరుసలో ఉంటాయి. చేతరి తొలిపెడ నందు, చేబడి రెండవ పెడనందు ఉంటాయి.

8.1) చేతరి : పనిని చేయువాడు/ చేయునది.

8.2) చేబడి : పని పంటను చవికొనువాడు/ చవికొనునది.

8.3) చేత : పనిని తెలియచేయునది.
మచ్చు : తిమ్మక్క రామన్నను తిట్టెను

తిమ్మక్క : చేతరి రామన్న : చేబడి తిట్టెను : చేత

**9. కలయిక :–**

రెండు మాటలు ఒకదానితో ఒకటి కలసిపోయి, ఒకేమాటగా ఏరుపడుటను కలయిక అంటారు. తెలుగులో ఇరువయి వరకూ కలయికలు ఉన్నాయి. ఒక కలయిక యొక్క కట్టుపాటును చెప్పు నుడుగును కట్టడ అనీ, కట్టడను తేటతెల్లము చేయు దానిని తెల్లము అంటారు.

9.1) అత్తు కలయిక :–

కట్టడ : అత్తునకు కలయిక పలువు.

తెల్లము : మొదటి మాట చివరన ఉండు 'అ' కారమునకు, రెండవ మాట మొదటి ఉసురు కలసినపుడు కలయిక పలుతీరులుగా ఉండును.

మచ్చులు : అ) ఎప్పటికీ వచ్చుట=రామ+అయ్య : రామయ్య.

ఆ) అరమరగా వచ్చుట=మేన+అత్త : మేనత్త లేదా మేనయత్త

ఇ) రాకుండట = వెల+ఆలు : వెలయాలు

ఈ) వేఱు తీరులో వచ్చుట=వచ్చిన+వాడు : వచ్చినాడు

9.2) ఇత్తు కలయిక :–

కట్టడ : ఇత్తునకు కలయిక అరమర.

తెల్లము : మొదటిమాట చివరి 'ఇ' కారమునకు, కలయిక జరుగవచ్చు జరుగక పోవచ్చు.

మచ్చు : ఏమి+అంటివి=ఏమంటివి లేదా ఏమియంటివి.

9.3) ఉత్తు కలయిక :–

కట్టడ : ఉత్తునకు కలయిక కడ్డాయము.

తెల్లము : మొదటిమాట చివరి 'ఉ' కారమునకు కలయిక తప్పక జరుగును.

మచ్చు : కుంకుడు+ఆకు : కుంకుడాకు

9.4) య రాక కలయిక :–

కట్టడ : కలయిక లేనిచోట చేరుసురుకు య రాకగు

తెల్లము : కలయిక జరుగునపుడు రెండవ మాటలోని ఉసురుకు 'య' వచ్చి చేరును.

మచ్చు : నా + ఎదుట : నా యెదుట

9.5) పు దూఱు కలయిక :–

కట్టడ : పొందికన, 'ము' వ్రాయికి 'పు' మాఱగు.

తెల్లము : పొందిక అంటికలో మొదటిమాట చివరన ఉన్న 'ము' వ్రాయికి మాఱుగా 'పు' దూఱును.

మచ్చు : చుట్టము+చూపు :చుట్టపుచూపు

9.6) ఇబ్బడి కలయిక :–

కట్టడ : ఉసురునకు ఇబ్బడి చేరునపుడు కలయిక తఱుచుగా అగు.

తెల్లము : ఒకమాటను రెండుసారులు పలికినపుడు రెండవదానిని ఇబ్బడి అంటారు. మొదటిమాట చివరి ఉసురునకు ఇబ్బడి చేరిన కలయిక జరుగును.

మచ్చు : ఇల్లు+ఇల్లు =ఇల్లిల్లు

9.7) ఇబ్బడి ఇరుటకార కలయిక :–

కట్టడ : ఇబ్బడి చేరికతో తొలిమాట కడవ్రాయి ఇరుటకారమగు.

తెల్లము : ఇబ్బడి చేరునపుడు, తొలిమాటలోని చివరి వ్రాలు అన్నీ 'ట్ట'గా మారును.

మచ్చు : పగలు+పగలు=పట్టపగలు

9.8) గసడదవ దూఱు కలయిక :–

కట్టడ : తొలిపెడమీది కఱకులకు, గసడదవలు పలువుగా అగు.

తెలుగునుడి మీద ప్రచురించిన వ్యాసం చూశాను. మీ ప్రయత్నం బాగుంది కానీ చాలా మాటలు అర్థం కాకపోవడంతో 'వ్రతం చెడింది, ఫలం దక్కలేదు'. ఈ వ్యాసంలో వాడిన ఎన్నో కొత్త (పాతవే, అలవాటు నుండి తప్పిపోయినవి) మాటలకి చివర అర్థాలు ఇవ్వకపోతే నా బోంట్లకి అర్థం కాదు. ఇలా రాసినందుకు క్షమించగలరు.

తా.క. నేను కూడ ప్రయోగాత్మకంగా కొత్తమాటలు వాడుతూ ఉంటాను కానీ పక్కనే అర్థం రాస్తూ ఉంటాను.

**–వేమూరి వేంకటేశ్వరరావు,** యు.ఎస్.ఏ.

❋ తప్పే జరిగింది. మన్నించండి. ఆ తప్పును ఈ సంచికలో సవరించుకొన్నాము. ఆ వ్యాసంలోని తెలుగు మాటలకు మనం సాధారణంగా వాడుతున్న సంస్కృతం/ఇంగ్లీషు మాటలను ఈ సంచికలో 13వ పుటలో ఇచ్చాము. ఆ వ్యాసానికి కొనసాగింపుగా ఈ సంచికలో వస్తున్న వ్యాసంలోని కొన్ని తెలుగు మాటలకు ఆ వ్యాసం చివరనే వివరాలు ఇచ్చాము. –సంపాదకుడు

తెల్లము : కఱకులు అంటే 'క చ ట త ప' అనే అయిదువ్రాలు. తొలిపెడ మీది కఱకులకు మారుగా 'గ స డ ద వ'లు వరుసగా వచ్చును.
మచ్చు : వాడు+ కొట్టె= వాడుగొట్టె
పని+చెప్పు = పనిసెప్పు
నీవు+ టక్కరివి = నీవుడక్కరివి
నిక్కము+తెలిసి = నిక్కముదెలిసి
చిన్న+పోయి = చిన్నవోయి
9.9) మూండ్లు కలయిక :-
కట్టడ : 1. ఆ ఈ ఏ లను మూండ్లు అందురు.
2. మూండ్లమీది ఒంటిమెయి, జంటమెయి అగు.
3. జంటమెయి అగునపుడు ముందరి పొడవుసురు పొట్టిదగు.
మచ్చు : ఈ+చోట = ఇచ్చోట
ఏ+కడ = ఎక్కడ
9.10) రు రాక కలయిక :-
కట్టడ : పొందికన కొన్ని మాటలకు 'ఆలు' చేరునపుడు 'రు' వచ్చు.
మచ్చు : పేద+ఆలు= పేదరాలు
బాలెంత+ఆలు = బాలెంతరాలు
9.11) వెలితి కలయిక :-
కట్టడ : ప్రాతల తొలి ఉసురు మీది వ్రాలుకెల్ల వెలితి అగు.
తెల్లము : ప్రాత లేత మొదలయిన మాటల మొదటి ఉసురు మీద ఉన్న అన్ని వ్రాలకూ వెలితి వచ్చును.
మచ్చు : ప్రాత+ఇల్లు = ప్రాయిల్లు
లేత+నగవు = లేనగవు
కట్టడ : క్రొత్తకు, తొలికట్టడ మిగులుకు కొన్ని యెడల 'న్' రాక, కొన్ని యెడల మీదిమెయికి కవ వచ్చు.
తెల్లము : క్రొత్త అనే మాటకు, తొలికట్టడ చే పోగా మిగిలిన మొదటి వ్రాయికి కొన్ని చోట్ల 'న్' వచ్చును, కొన్నిచోట్ల మీది మెయికి కవ వచ్చును.
మచ్చు : క్రొత్త+చాయ = క్రొంజాయ
క్రొత్త+నన : క్రొన్నన
9.12. పదుల కలయిక :-
కట్టడ : పదు వంటివి చేరునపుడు, ముకారము తొలగవచ్చు లేదా నిండుసున్నగ మారవచ్చు.
మచ్చు : ఆత్రము+ పదు = ఆత్రపదు లేదా ఆత్రంపదు
కట్టడ : మలిమాసి ముకారమునకు మెయిచేరిన, వెలితి అరమర.
తెల్లము: మలిమాసి 'ము' కు మెయిచేరిన, 'ము' తొలగవచ్చు ఉండ వచ్చు.
మచ్చు : చూడుము+నన్ను = చూడుమునన్ను లేదా చూడునన్ను
9.13. ఇరుటకార కలయిక :-
కట్టడ : కుఱు, చిఱు, కడు, నడు, నిడు చప్పుదుల అడలకు, ఉసురు చేరునపుడు ఇరు టకారమగు.
మచ్చు : చిఱు+ఎలుక = చిట్టెలుక
నడు+ఇల్లు = నట్టిల్లు
9.14. టు రాక కలయిక :-
కట్టడ : పొందికన ఉత్తునకు ఉసురు చేరునపుడు 'టు' వచ్చును.
మచ్చు : నిగ్గు+ అద్దము = నిగ్గుటద్దము.
కట్టడ : పొందికన 'పేరు' వంటి చప్పుదులకు ఉసురు చేరునపుడు 'టు' అరమరగ వచ్చును.
మచ్చు : చిగురు+ఆకు : చిగురుటాకు లేదా చిగురాకు
9.15. ప దూఱు కలయిక :-
కట్టడ : నాము వంటి మాటల ముకారమునకు మాఱు పకారము వచ్చు.
మచ్చు : నాము+ చేను = నాపచేను
జనుము+నార = జనుపనార
9.16. దు రాక కలయిక :-
కట్టడ : నీ, నా, తన, చప్పుదులకు రెండవమాట చేరునపుడు 'దు' రావచ్చు.
మచ్చు : నా+బ్రతుకు = నాదుబ్రతుకు
నీ+బలిమి = నీదుబలిమి
9.17. లు ల న ల కలయిక :-
కట్టడ : లు ల నలు చేరునపుడు, ముకారము వెలితి, ముందు ఉసురు ఈడుపు అరమరగ అగును.
మచ్చు : నిక్కము+లు = నిక్కాలు లేదా నిక్కములు
కాలము+న = కాలాన లేదా కాలమున
9.18. దు వెలితి కలయిక :-
కట్టడ 1 : 'మూడు'కు మాట చేరునపుడు, దు కారము వెలితి పడి, మీది మెయి కవ అగును.
కట్టడ 2 : కవమెయి అగునపుడు, ముందరి పొడవు ఉసురు పొట్టిదగు.
మచ్చు : మూడు+లోకములు = మూ ల్లోకములు =ముల్లోకములు
మూడు+మాఱు-మూ మాఱు = ముమ్మాఱు
919. చేరుపునురు కలయిక :-
కట్టడ :చేరుపు చేరునపుడు అన్ని ఉసురులకూ కలయిక అగు.
తెల్లము : మాటకాని దానిని చేరుపు అంటారు. చేరుపు తొలి వ్రాయి ఉసురుగా ఉంటే, అన్ని ఉసురులతోనూ కలియును.
మచ్చు : మూర+ఎడు = మూరెడు
కందు+ఎన = కందెన

**10. అంటిక :-**

చేవ కలిగిన మాటలు పక్కపక్కన అంటుకొని ఒకమాటగా అగుటే అంటిక. అంటిక తెల్లమును విడమరచి చెప్పునది విడమరపు. అంటిక చేయునపుడు మొదటి మాటన ఉన్న కూరుపు వెలితిపడును.
10.1. వెనునొడి అంటిక : వెనుకమాట వంచముగా ఉండునది వెనునొడి అంటిక. పెడలను పట్టి ఇవి ఏడు తీరులు. 'నన్' తో కలిపి ఎనిమిది.

| అంటిక | మచ్చు | విడమరుపు |
|---|---|---|
| అ. తొలివెన్నొడి అంటిక | పూర్వకాయము | పూర్వము కాయము |
| ఆ. రెండవ వెన్నొడి అంటిక | నెలతాలుపు | నెలను తాలుపు |
| ఇ. మూడవ వెన్నొడి అంటిక | చేనేత | చేతితో నేత |
| ఈ. నాలుగవ వెన్నొడి అంటిక | అమ్మాయిలబడి | అమ్మాయిలకొఱకు బడి |
| ఉ. అయిదవ వెన్నొడి అంటిక | దోమలబెడద | దోమలవలన బెడద |
| ఊ. ఆరవ వెన్నొడి అంటిక | చెఱువుకట్ట | చెఱువుయొక్క కట్ట |

ఎ. ఏడవ వెన్నొడి అంటిక  కంటినీరు  కంటియందలి నీరు
ఏ. నన్ వెన్నొడి అంటిక  అన్యాయము  న్యాయము కానిది
10.2. పొందిక అంటిక : ఓజకూ పేరుకూ పొందిక కలిగించునది పొందిక అంటిక. ఇవి ఏడుతీరులు.
అ. మునుమాట ఓజంటిక : ఓజ మునుమాటగా ఉండును.
తొలిపలుకు = తొలిది అయిన పలుకు
ఆ. వెనుమాట ఓజంటిక :ఓజ వెనుక మాటగా ఉండును.
వేమనయోగి = యోగి అయిన వేమన
ఇ. ఇరుమాట ఓజంటిక :రెండుమాటలూ ఓజగా ఉండును.
సుకుమార సుందరము = సుకుమారము సుందరము
ఆ. మునుమాట పోలికంటిక : పోలిక మునుమాటగా ఉండును.
పూమేను = పూవువంటి మేను
ఉ. వెనుమాట పోలికంటిక : పోలిక వెనుకమాటగా ఉండును.
మహిళామణి = మణివంటి మహిళ
ఊ. మునుమాట పేరంటిక = పేరు మునుమాటగా ఉండును
తెలుగునుడి = తెలుగు అనే పేరుగల నుడి
ఎ. సరిసాటి అంటిక : పోలువు, పోలుపులు సరిసాటిగా ఉండును.
పుడమితల్లి = పుడమియే తల్లి
10.3. రెట్ట అంటిక : రెండు మాటలూ వంచమయినవిగా ఉండునది.
మచ్చు : అన్నదమ్ములు = అన్న తమ్ముడు
ఆలుమగలు = ఆలు మగడు
10.4. ఎన్నిక అంటిక : అంకెమాట ఓజగా ముందు ఉండునది.
మచ్చు : ఏడుచేపలు = ఏడు అయిన చేపలు
ఎనిమిదవ వింత = ఎనిమిదవది అయిన వింత
10.5. వియ్యపు అంటిక = రెండు మాటల నడుమ వియ్యము కలిగినది.
మచ్చు : కలువకంటి = కలువలవంటి కనులు కలది
చెఱకు విలుకాడు = చెఱకునే విల్లుగా కలవాడు
మఱొక రెండు తీరుల వియ్యపు అంటికలు ఉన్నాయి.
అ) ఇరు అంకెల వియ్యపంటిక : అంటికలోన రెండు మాటలూ అంకెలనే తెలుపును.
మచ్చు : మూడు నూఱులు = మూడయిన నూఱులు
వేలవేలు = వేలయిన వేలు
ఆ) సహ మునుమాట వియ్యపంటిక : సహ అనే మాట మును మాటగా ఉండునది.
మచ్చు : సాకారము = ఆకారముతో కూడినది
10.6. బిగువు అంటిక : బిగువు మునుమాటగా ఉండునది.
మచ్చు : విజ్ఞానము = వి జ్ఞానము
నిరాడంబరము = నిర్ ఆడంబరము

**11. సంస్క్రుతపు కలయికలు :-**

ఇవి తెలుగునుడికి అక్కఱ లేనివి. కానీ వెయ్యి ఏండ్ల తెలుగు నానుడిలో సంస్క్రుతపు మాటలు కొల్లలుగా వచ్చి చేరినాయి. ఆ మాటల తెలివిడి కోసం మటుకే ఇవి అక్కఱపడుతాయి.
11.1. నిడుపు కలయిక : కట్టడ : పొట్టి ఉసురులకు అవే ఉసురులు చేరునపుడు నిడుపు వచ్చును.
కట్టడ : పొట్టి ఉసురులకు అవే ఉసురులు చేరునపుడు నిడుపు వచ్చును.
మచ్చు : విమాన+ఆశ్రయము= విమానాశ్రయము
కవి+ ఇంద్రుడు : కవీంద్రుడు
11.2. ఆలుడి కలయిక :
కట్టడ : అకారమునకు ఇ ఉ ఋ లు చేరునపుడు, ఏ ఓ అర్ లు వచ్చును.
మచ్చు : దేవ+ఇంద్ర = దేవేంద్ర
అరుణ+ ఉదయము = అరుణోదయము
11.3. పెంపు కలయిక :
కట్టడ : అకారమునకు ఏ ఐలు చేరునపుడు ఐ కారము, ఓ ఔలు చేరునపుడు ఔ కారము వచ్చును.
మచ్చు : ఏక+ఏక = ఏకైక
పరమ+ఔషదము = పరమౌషదము
11.4. య వ దూఱు కలయిక :
కట్టడ : ఇ కారమునకు వేఱు ఉసురు చేరునపుడు 'య' వచ్చును.
మచ్చు : ప్రతి+ఉత్తరము= ప్రత్యుత్తరము
కట్టడ : ఉ కారమునకు వేఱు ఉసురు చేరునపుడు 'వ' వచ్చును.
మచ్చు : అణు + అస్త్రం = అణ్వస్త్రం
11.5. ముక్కువు కలయిక :
కట్టడ : క చ ట త ప లకు, ముక్కువులు చేరునపుడు, ఆ గుమి ముక్కువులే దూఱును (ముక్కువులు : ఙ ఞ ణ న మ)
మచ్చు : వాక్+మయము = వాఙ్మయము
జగత్+నాదుడు = జగన్నాదుడు
11.6. సత శచ కలయిక :
కట్టడ : 'స త' లకు 'శ చ'లు చేరిన 'శ చ' లే వచ్చును.
మచ్చు : మనస్+చలనము = మనశ్చలనము
సత్+ చరిత్ర = సచ్చరిత్ర
11.7. నునుపు కలయిక :
కట్టడ : కకుకులఱ, ఉసురులయినా నునుపులయినా య ర వ లయినా చేరునపుడు, నునుపులే వచ్చును.
మచ్చు : వాక్+అదిపతి = వాగదిపతి
సత్+ గతి = సద్గతి
సత్+ వినయము = సద్వినయము

❃



# ఈ వ్యాసంలోని తెలుగు మాటలకు పెరనుడి తెల్లములు

01) నుడికట్టు = వ్యాకరణం (Grammar)
02) కుదురు = కులం
03) తఱి = కాలం
04) వేఱిమి = వ్యత్యాసం
05) పలుతనం = వైవిధ్యం
06) నానుడి = సాహిత్యం
07) ఎసవునోయి = శాస్త్ర గ్రంథం
08) నుడిపాయలు = భాషా భాగాలు (Parts of Speech)
09) పేరనిక = పేరు +అను+ఇక = నామవాచకం (Noun)
10) మఱుపేరనిక = సర్వనామం (Pronoun)
11) అగవనిక = అగవు+అను+ ఇక = క్రియావాచకం (Verb)
12) ఓజనిక = ఓజ + అనిక = విశేషణం (Adjective)
13) బిగువనిక = బిగువు +అనిక = అవ్యయం (Indeclinable)
14) గుఱిపేరు = సంజ్ఞా నామవాచకం (Proper Noun)
15) గుమిపేరు = జాతి నామవాచకం (Collective Noun)
16) ఓజపేరు = గుణ నామవాచకం (Abstract Noun)
17) పని పేరు = క్రియా నామవాచకం (Verbal Noun)
18) చేబడి అగవు = సకర్మక క్రియ (Transitive Verb)
19) చేబడమి అగవు = అకర్మక క్రియ (Intransitive Verb)
20) నిండు అగవు = సమాపక క్రియ (Finite Verb)
21) కొఱ అగవు = అసమాపక క్రియ (Infinite Verb)
22) ఓజ = గుణము
23) గుఱితోడు ఓజ = సంజ్ఞా ప్రయుక్త విశేషణము
24) గుమితోడు ఓజ = జాతి ప్రయుక్త విశేషణము
25) అగవుతోడు ఓజ = క్రియాప్రయుక్త విశేషణము
26) ఓజతోడు ఓజ = గుణ ప్రయుక్త విశేషణము
27) అంకెతోడు ఓజ = సంఖ్యా ప్రయుక్త విశేషణము
28) ఉరువుతోడు ఓజ = ద్రవ్య ప్రయుక్త విశేషణము
29) అణకువ ఓజ = విధేయ విశేషణము
30) అగవు ఓజ = క్రియా విశేషణము
31) అగపుట్టు ఓజ = క్రియాజన్య విశేషణము
32) పుట్టుబిగువు = ప్రతిపదోక్తావ్యయం
33) పెట్టు బిగువు = లాక్షణికావ్యయం
34) కూరుపు = ప్రత్యయం (Affix)
35) పెడ = విభక్తి (Case)
36) అంకె అనిక = వచనం (Number)
37) ఒక్కనిక = ఏకవచనం (Singular Number)
38) పెక్కనిక = బహువచనం (Plural Number)
39) ఎల్ల ఒక్కనిక = నిత్యైక వచనం
40) ఎల్ల పెక్కనిక = నిత్య బహువచనం
41) గుఱుములు = ధాన్యాలు
42) ఊటలు = ద్రవాలు
43) పుట్టులు = లింగాలు (Gender)
44) పెంటిపుట్టు = మహతీ వాచకం (Feminine Gender)
45) పోతుపుట్టు = మహద్వాచకం (Masculine Gender)
46) పేడి పుట్టు = అమహద్వాచకం (Neuter Gender)
47) నుడుగు = వాక్యం (Sentence)
48) నిండునుడుగు = సంపూర్ణవాక్యం
49) నిడుపు నుడుగు = సంశ్లిష్ట వాక్యం
50) అడ్డగింత నుడుగు = అవాంతర వాక్యం
51) పెన్నుడుగు = మహావాక్యం
52) తఱి అనిక = కాలము (Tense)
53) కడ తఱి = భూతకాలం (Past Tense)
54) నడతఱి = వర్తమానకాలం (Present Tense)
55) మీదు తఱి = భవిష్యత్కాలం (Future Tense)
56) పాటి తఱి = తద్ధర్మకాలం (Aorist)
57) మాసి అనిక = పురుష (Person)
58) తొలిమాసి = ఉత్తమ పురుష (First person)
59) మలిమాసి = మధ్యమ పురుష (Second person)
60) ఎడమాసి = ప్రథమ పురుష (Third person)
61) చేతరి = కర్త (Subject)
62) చేబడి = కర్మ (Object)
63) చేత = క్రియ (Predicate)
64) కలయిక = సంధి
65) కట్టడ = సూత్రం (Rule)
66) పలువు = బహుళం
67) అరమర = సందేహం
68) కడ్డాయము = తప్పనిసరి
69) రాక = ఆగమం
70) దూఱు = ఆదేశం
71) ఇబ్బడి = ఆమ్రేడితం
72) వ్రాయి = అక్షరం
73) కఱకు = పరుషం
74) వ్రాలు = అక్షరాలు
75) మూండ్లు = త్రికములు
76) ఒంటిమెయి = అసంయుక్త హల్లు
77) జంటమెయి = ద్విత్వహల్లు
78) పొడవుసురు = దీర్ఘాచ్చు
79) మెయి = హల్లు
80) కవ = ద్విత్వం
81) ఈడుపు = దీర్ఘం
82) అంటిక = సమాసం (Compound)
83) వెనునొడి/వెన్నొడి అంటిక = తత్పురుష సమాసం
84) విడమరపు = విగ్రహ వాక్యం
85) పొందిక అంటిక = కర్మధారయ సమాసం (Appositional compound)
86) మునుమాట ఓజంటిక = విశేషణపూర్వపద కర్మధారయ సమాసం
87) వెనుమాట ఓజంటిక =విశేషణోత్తరపద కర్మధారయ సమాసం

(21వ పుట చూడండి)

-డా॥వావిలాల సుబ్బారావు
98664 02973

# తెనాలి జీవీకే

**అన్యత్ర ఉన్నవన్నీ భారతంలో ఉన్నాయి. (యతిహాస్తి తదన్యత్ర) అని భారతేతిహాసానికి కీర్తి ఉంది. 'తెనాలి' గూర్చి గూడ అంతే. లోకంలో ఉన్న ధార వీచికలన్నీ 'తెనాలి'లో వీస్తాయి. 'తెనాలిలో వీచని గాలి లేదు' అనవచ్చు. అత్యంత వైష్ణవ పండితుల నుండి సత్నా 'బుల్‌డోజర్'లో కూల్చుకుంటూ పోతే రాయిస్టులు-చలమిస్టులు దాకా తెనాలిలో చింతనావిస్తృతి కలిగించారు. అన్నింటిలోకి హేతువాద దృక్పథానికే అక్కడ ప్రథమస్థానం. పట్టణం చిన్నదైనా మనసు పెద్దది. స్థానిక ప్రతిభావంతులను గుర్తించి గౌరవించుకోవటం అనేది ఆంధ్రులకు అంతగా తెలియని సుగుణం తెనాలిలో పుష్కలంగా వుంది. అట్లాంటి సందర్భమే శ్రీ జి.వి.కృష్ణారావు గారి శతజయంతి సంచిక.**



కానీ విశేషమేమిటంటే ఆ మేధావులందరూ ప్రాంతీయ పరిమితులను అధిగమించినవారే. ఒకప్పుడు ప్రముఖ హేతువాద నాయకుడు ఆవుల గోపాలకృష్ణమూర్తి 'భారతదేశంలో పుట్టినందుకు నేనేమీ గర్వపడటం లేదు' అని అమెరికాలో అన్నమాట ఇక్కడకు చేరి, గొడవలు రేపింది. ఎవరి గొప్పదనమైనా ప్రాంతం వల్ల రాదు, స్వయం ప్రతిభ వల్లనే కలుగుతుందని -వారి అభిప్రాయంగా గుర్తించలేకపోయారు కొందరు వివాద ప్రియులు. అట్లాగే అనేకమంది గురించి గూడ. ఆ కోవలోనివాడే జి.వి.కృష్ణారావు గారు గూడ. ఆయనకున్న యోగ్యతకు సముచిత స్థాయిలో ప్రశస్తి రాలేదేమో ననిపిస్తుంది.

తెలుగు సాహిత్యవేత్తలలో ఇంతగా తత్వశాస్త్ర అధ్యయనం చేసినవారు అప్పట్లో చాలా అరుదు. తత్వశాస్త్ర పరిచయం ఉండటం కాదు. కూలంకషత్వం గురించి... తత్వశాస్త్ర వైవిధ్యం గురించి.. నేనంటున్నది. చదివినది తీయకుండా వాటిని తూకం వేసి, అంచనాలు కట్టి, స్వీయదృక్పథాన్ని వెల్లడించడం విశేషం. స్వయంగా తాత్వికుడైనవాడి లక్షణం ఇది. ఇట్లాంటి తత్వనిష్టతో సాహిత్య రంగంలో ప్రవేశించినవారు మన తెలుగుభాషకు సంబంధించి నంతవరకు వ్రేళ్ళమీద లెక్కపెడదామంటే చేయి తెరుచుకోవటం లేదు. (జి.వి.కె.కి ముందు సంగతి)

జి.వి.కెగారిలా వివిధాంశాలను పరిశీలిస్తూ దాదాపు సమగ్రంగా అనేక వ్యాసాలతో వచ్చిన ఈ సంకలనం సాహిత్య వివేచకులందరికి అవసరం. కృష్ణారావు గారి శ్రేష్టతలతో పాటు తత్వశాస్త్ర భారం వల్ల సాహిత్య గుణం తగ్గిన సందర్భాలు గూడ ఉన్నాయి. ఉదాహరణకు నవలలో సంభాషణలు సహజ ప్రతిస్పందనలుగా ఉండవు. అర్థవంతంగా ఉండాలన్న తాత్వికభారం ఎక్కువ అవుతుంది. 'సామాజిక వర్తమానత' రచయితకు ప్రధాన ధ్యేయం కావాలని భావించి గూడ తాత్విక నిర్లిప్తతలోకి జి.వి.కె వెళ్ళిపోయారని శ్రీ పాపినేని విశ్లేషించి -బహుశ ఇది నాగార్జునుని 'శూన్యతాసిద్ధాంత' ప్రభావమేమోనని అనుమానించారు.

ఆచార్య నాగార్జునుడు పరమార్థ శూన్యతనే ప్రతిపాదించాడు గానీ - వ్యావహారిక శూన్యత చెప్పలేదు. జి.వి.కె. ఆచార్యుని అపార్థం చేసుకోలేదు. పరిష్కారాలు ఇవ్వటం రచయిత బాధ్యత కాదని, ఎవరు పరిష్కారం ఇచ్చినా అది పాక్షికము, తాత్కాలికమే అవుతుందని నిత్య పరిణామశీలమైన సమస్యలకు పరిష్కారాలు స్థిరంగా వుండవన్నది బౌద్ధ తత్వనిర్ణయం. పరిష్కారాన్వేషణకు సమాజాన్ని ప్రేరేపించటమే రచయిత బాధ్యత అని జి.వి.కె.గారి అభిప్రాయం కావచ్చు.

'కీలుబొమ్మలు' నవల జి.వి.కె. నవలల్లో శ్రేష్టమైనది. తెలుగులో పది మంచి నవలలు పేర్కొంటే అందులో తప్పక ఇది ఒకటి అన్నారు. ఇందులో 'అసంగత శిల్పం' ఉందన్నారు శ్రీ వేగుంట. పాపికొండలు నవలను నిశితంగా పరిశీలించి "గ్రామం గ్రామంగా ఉండబోదని, రాజకీయాలకు రంగస్థలం కాబోతున్నది, అంతర్జాతీయ విపణికి భూమి కాబోతున్నది" అని సూచించిన జి.వి.కె భవిష్యద్దర్శనాన్ని మెచ్చుకున్నారు వి.చంద్రశేఖరరావు.

జి.వి.కృష్ణారావుగారికి ఆచార్య నాగార్జునుని మీద ప్రత్యేక శ్రద్ధ. జటిలమైన నాగార్జునుని 'విగ్రహవ్యావర్తిని'కి అనువాదం- దానికి విపులమైన పీఠిక చదివితే ఆయనకున్న స్పష్టమైన అవగాహన తెలుస్తుంది. తెలుగులో తత్వశాస్త్రం చదవదల్చుకున్న వారు జి.వి.కె. రచనలను అనివార్యంగా చదవాలని 'బౌద్ధరత్న' అన్నపరెడ్డి గారే అన్నారు. అది నిజమే గాని, జి.వి.కె.గారి తత్వభాష అంత సుగమం కాదు. బహుశా వారికున్న సంస్కృత భాషాపాండిత్యం వల్ల ఆ కాఠిన్యం వచ్చిందేమో. సంస్కృత మహోపాధ్యాయులలో భాషా సారళ్యత ఉన్నవారు బహు కొద్దిమంది. 'పంచాగ్నుల'వారు, ఉమాకాంత విద్యాశేఖరులు వంటి ఇద్దరు ముగ్గురు మినహాయింపు. జి.వి.కె.గారిది శిష్టవ్యావహారికమేగాని కష్టవ్యావహారికం గూడ.

తెలుగు సాహిత్య విమర్శ 'రాళ్ళపల్లి', 'కట్టమంచి'తో నూతన మార్గం తొక్కిందంటారు. నిజమే. సాహిత్య విమర్శకు సౌందర్య మీమాంసను (aesthatics) జోడించే ప్రయత్నం చేసిన ప్రథములు మాత్రం జి.వి.కృష్ణారావుగారే. వారు వ్రాసిన కావ్య జగత్తు -కష్టపడి అయినా చదవవలసిన పుస్తకం.

పురాణాల్లో శివునికి మూర్తికల్పన చేసిన "వ్యాసుని" మనస్సును ఆధునికంగా ఫ్రాయిడ్ పద్ధతిలో విశ్లేషించటానికి యత్నించి, "వ్యాసుడు

(తరువాయి 24వ పుటలో...)

-డా॥అద్దంకి శ్రీనివాస్, 9848881838

# తేట తెలుగుకు చోటు ఎక్కడ?

**వైయక్తికంగా విన్పించే భాష సమాజపు ఉమ్మడి సంపద. అలసత్వం, అనవగాహన, అశాస్త్రీయదృక్పథం, అహేతుకతల వల్ల భాషలు నశించిపోతాయి. దక్షిణాఫ్రికాలో నశించిపోయిన రెడ్ ఇండియన్ భాషలే ఉదాహరణ. తెలుగుభాష విషయానికొస్తే - విద్యా వ్యాపార వ్యవహార రంగాలలో నూటికి నూరుశాతం చిత్తశుద్ధి కనిపించటం లేదు. రాయటం, మాట్లాడటం, సృజన చేయటం అనే మూడింటిలోనూ విచ్చలవిడితనం రాజ్యమేలుతుంది. ప్రతి భాషకూ ఒక వ్యాకరణ వ్యవస్థ ఉంటుంది. అది పండితుడికైనా పామరుడికైనా ఒకేలా పనిచేస్తుంది.**

ఈ వ్యవస్థకు భిన్నంగా అవ్యాకృత ప్రయోగాలను ఎవరికి వారే వాడటం తప్పు. అకరక్టు, గ్రేటాతిగ్రేటుడు వంటి ప్రయోగాలకు హాస్యం పండుతుందేమోగానీ భాష అసహాస్యం పాలవుతుంది. ఆంగ్లభాష విషయంలో అక్షర, ఉచ్చారణ దోషాలను అంగీకరించరు. తెలుగును ఎవరు ఎలా మార్చి రాసినా అంగీకరించమంటారు. వ్యక్తి గత లోపాలను భాషలో చేర్చి పలకడం, రాయడం తెలుగులోనే ఎక్కువగా ఉంది. ఒక కొత్తపదాన్ని పదబంధాన్ని పరిచయం చేసే స్థాయిలోనే అవ్యుత్పన్నత ఉంటే అది అంతకంతకూ పెరుగుతుంది. ఉచ్చారణ విషయంలో సాంకేతిక కారణాలు కాక, అనుకరణలు, అధునాతన ధోరణులు అస్పష్టతకు కారణాలవుతున్నాయి. భాషా వినిమయం జరిగే రంగాల ఉద్యోగులకు శాబ్దిక పటుత్వం అవసరం. కానీ దీనికోసం ప్రత్యేకదృష్టీ ఎంపికలో ప్రాధాన్యమూ ఎంతమాత్రమూ లేదు. ఆంగ్లంలో స్పష్టోచ్చారణ ఎంత ఎక్కువగా వుంటే అంత మంచి కొలువులు దొరుకుతున్నాయి. ఈ పరిస్థితి తెలుగులో మృగ్యం. అదే భాషపట్ల నిర్లక్ష్యవైఖరికి కారణం.

**తెలుగు వ్యవహారం :** తెలుగు వ్యవహర్తల మౌఖిక -లేఖన భాషల్లో పద, వాక్య, క్రియా, సమాస, వ్యాకరణ దోషాలు కుప్పలు తెప్పలు. నాగరికత, సామాగ్రి, సమిష్టి అధికారికాలుగా స్థిరపడిన పదాల పూర్వరూపాలు. నాగరకత, సామగ్రి, సమష్టి ఆధికారికాలు. వీటి పూర్వరూపాలనే వాడటం వల్ల ప్రయోజనం లేదు. 'అవగాహనా క్షమ్యత' ఉన్నంత వరకూ పదపరిణామం సర్వదా గ్రాహ్యం. ఈ పదాలను ఉపయోగించి ఇంకా పదాలను తయారు చేయటానికి స్థిరపడిన రూపం కన్నా పూర్వరూపమే ఉపయోగపడుతుంది. అందు కైనా ఈ జ్ఞానం అవసరం. పాలాభిషేకం, శంఖుస్థాపన, శాఖాహారం, సమైఖ్యాంధ్ర, యాత్రీకులు, తీక్షణం, అయిష్టం మొదలైన రూపాలు సహజ వ్యుత్పత్తులకు భిన్నంగా రూఢికెక్కాయి. సమాసాలను, పదాలను వింగడించి, పదమూలాలను విశ్లేషించి, మౌలిక ధాతువులను గమనించటం భాషకు ఎంతో అవసరం. తద్వారా నూతన పారిభాషిక పదసృష్టి సులభతరమవుతుంది. సంస్కృతాంగ్లాలకు ఈ సౌకర్యం పుష్కలం. తెలుగుకు తత్సమ పదాల వరకు సాధ్యం. దేశిపదాలకు కష్టసాధ్యం. ఇప్పటివరకూ ఉన్న వ్యుత్పత్తులను కూడా అలసత్వం వల్ల చేజార్చుకుంటే సహజత్వం భాషలో క్రమంగా నశిస్తుంది.

మాట్లాడేభాషకు వైవిధ్యం అనంతం. వ్యక్తి, ప్రాంతం, సంస్కృతి, అన్యభాషా సంపర్కం, హోదా, విద్య, వయస్సు...ఇలా ఎన్నో కారణాలు. అయితే నలుగురూ నాలుగు రకాలుగా మాట్లాడితే అందరికీ అర్థమయ్యే ఒక భాషా సమ్మతి కావాలి. అదే ప్రామాణికత. అన్ని మాండలికభాషలూ సమానమైనవే. ఒక రాష్ట్రంలో నాలుగు భిన్న మండలాలుంటే దానికి ఒక ప్రామాణికత కావాలి. ఒకే మండలం లోనూ ఉపమాండలికాలుంటాయి. దానికీ ప్రామాణికత అవసరం. లేదంటే అవగాహన దెబ్బ తింటుంది. కాబట్టి ప్రామాణికత వ్యక్తుల స్థాయినుండి జాతీయ, అంతర్జాతీయ స్థాయివరకూ ఉండవలసిందే. మాండలిక ప్రయోగాలు మండలాలను దాటి విస్తరించినప్పుడు వాటికీ ప్రామాణికత వస్తుంది. ఇది నిరంతరం జరిగే ప్రక్రియ. ల-ళ-ణ-నల మధ్య భేదం పాటించకపోవటం తెలుగులో ఒక మాండలిక భాషలో కన్పిస్తుంది. దీనికి సాంకేతికంగా కారణం ఉండ వచ్చు. ఉంటుంది. అయితే ఈ వ్యవహారాన్ని ఆ మండలం వరకే పరిమితం చేయాలి కానీ మొత్తం భాషా వ్యవహార సమాజానికి చుట్ట కూడదు. భాష వ్యవహారంలో ఉన్నప్పుడు వక్తృత్వ సౌలభ్యానికి కష్టంగా, అడ్డంగా ఉన్నదేదీ నిలవదు. రాసే భాష భిన్నం. ఇది లిఖిత రూపంగా కొన్ని సంవత్సరాలు భాషను నిలిపి ఉంచుతుంది. అందువల్ల అనవగాహన వల్ల ఏర్పడే భాషా పరమైన చిక్కుముళ్ళనూ, అన్వయక్లిష్టతలను తొలగించుకోవటానికి భాషాలక్షణాన్ని, పరిణామాన్ని తెలుసుకోవటం మంచిది.

1. కొన్ని వాక్యాలు మౌఖికంగా లేకపోయినా లేఖనంలో కన్పిస్తాయి. ఉదా : దరఖాస్తులు కోరబడుతున్నాయి. ఈ షోరూమ్ ప్రారంభిస్తున్నామని చెప్పటానికి సంతోషిస్తున్నాం. మొ॥ మనం మాట్లాడే భాషనే రాయటం లేదనటానికి ఈ వాక్యాలు ఉదాహరణలు.
2. 'అతణ్ణి' అనే రూపాన్ని 'అతడ్ని' అని రాస్తున్నారు. డకారం నాదమూర్ధన్య స్పర్శం(voiced retroflex plosive) నకారం దంత్యానునాసికం. నాదమూర్ధన్య స్పర్శం వల్ల దంత్యానునాసికం మూర్ధన్యానునాసికం కావటం ఇక్కడి పరిణామం. అతడు+ని =అతడి+ని=అతణ్ణి రాముణ్ణి కృష్ణుణ్ణి మొ॥.
3. రామాయణం వంటి శబ్దాలలో 'అయనం' లోని దంత్యానునాసికం రకార మూర్ధన్యకంపితం వల్ల మూర్ధన్యానునాసికంగా మారింది. (రషాభ్యాం నోనః సమాసపదే-అష్టాధ్యాయి) దీనిని మళ్ళీ రామాయనం అనటం భాషా సహజ లక్షణాతిరేకమే కదా!
4. వాళ్ళు, వీళ్ళు, నీళ్ళులను వాల్లు, వీల్లు, నీల్లుగా వాడుతున్నాం. ఇల్లు- ఇళ్ళులలో మొదటిది ఏకవచనం. రెండోది బహు

వచనం. పల్లు నిత్యబహువచనాంతం. ఇటువంటి రూపాల విషయంలో అస్పష్టత ఏర్పడుతుంది.

5. ఆంగ్ల ఫ (Fa) ప్రభావం వల్ల తెలుగులోని 'ఫలం' వంటి పదాలలోని 'ఫ' ఉచ్చారణ పోయింది. ఫ(Fa) కు తెలుగులో లిపి చిహ్నం లేదు. అలాగే Rat, Mat , తెలుగులోని తాటాకు మొదలైన పదాలలో ఉన్న మధ్యార్థ వివృతాచ్చు (Mid half open vowel) కూ లిపిచిహ్నం లేదు. అచ్చులమీద అను నాసిక్యం ఉచ్చారణలో కన్పిస్తుంది. దీనిని 'ఆc' అని అర సున్నతో రాస్తున్నాం. కానీ తెలుగులో అరసున్నకు ఉచ్చారణశక్తి లేదు. కాబట్టి వీటిని రాసే టప్పుడు ఆనునాసిక్య చిహ్నం ఉంచి రాయాలి.

6. తెలుగులో 'సున్న' పరుషాలకు గానీ, సరళాలకు గాని ముందు ఉంటుంది. లోకము+నకు – లోకంనకు. ఇది భాషలో ఎక్కడా కన్పించదు.

7. తెలుగులో బ్రమ్హ అని పలుకుతూ బ్రహ్మ అని రాస్తున్నాం. ఆంగ్లంలో Psychology Tsunami పదాలనే సైకాలజీ, సునామి అని పలికే తీరు బట్టి రాస్తున్నాం. 'బ్రహ్మ'లో బకారం స్పర్శధ్వని. అందుకని వెంటనే స్పర్శానునాసికాన్నే వెంటనే తీసుకొంటుంది. 'హ' కారం కంఠధ్వని. అందుకే దానిని తరువాత పలకటం. An apple, న + అశ్వం – అనశ్వం, మా + ఇల్లు – మా యిల్లు వంటి రూపాలకూ కారణం ఇదే. సంస్కృత, ఆంగ్ల భాషల విషయంలోనే లేఖన, భాషణ వైరుధ్యాలు తెలుగులో కన్పిస్తాయి.

8. యత్తదర్థక, కర్మణి ప్రయోగాలు తెలుగుకు అసహజం. నన్నయ కవిత్వంలో సంస్కృత ప్రభావం వల్ల కర్మణి ప్రయోగాలు కన్పిస్తాయి. 'నాచే వ్రేల్చబడిన హవ్యకవ్యంబులు' ఇది నన్నయ ప్రయోగం. తిక్కనాదులు నా చెప్పిన, నా చేసిన, నా నేర్చిన వంటి ప్రయోగాలతో వీటిని పరిహరించారు. 'ఎవరైతే వెళ్ళారో వాళ్ళింకా రాలేదు'. ఇది యత్తదర్థక ప్రయోగం. దీనిని 'వెళ్ళిన వాళ్ళింకా రాలేదు' అంటే చాలు.

**కర్తవ్యం :** వ్యాకరణం భాషాంతర్లీనమైనది. అది వ్యవహారావసరం. సౌకర్యాలను బట్టి ఎప్పటికప్పుడు వ్యవస్థితమౌతుంది. దానికి విరుద్ధంగా వ్యవహారం ఉండదు. ఉంటే అది వ్యక్తిగత అలసత్వమే. వ్యావహారిక భాషావాదం ఉదారమూ, ఉదాత్తమూ అయినది. దానిని అలుసుగా తీసుకొని అశాస్త్రీయంగా వ్యక్తి స్వేచ్ఛను బట్టి ఇష్టం వచ్చినప్పుడు, ఇష్టం వచ్చినట్టు వాడకూడదు. ప్రతి భాషకీ కొన్ని సామాన్య లక్షణాలుంటాయి. ఆయా లక్షణాలున్న పదజాలాన్ని ఒక వర్గంగా వింగడిస్తాం. ఇటువంటి మర్యాదకు లోబడనప్పుడు ఒక్కొక్క పదానికి, ఒక్కొక్క వ్యవహర్త నుండి ఒక్కొక్క సూత్రాన్ని ఏర్పరచవలసి వస్తుంది. అన్యదేశ్యాలను స్వీకరించేటప్పుడు స్వీకర్తృ భాషాలక్షణాలకి అనుగుణంగానే రూపనిర్మాణం జరుగుతుంది. దానిని అవగాహనా రాహిత్యంతో మార్చకూడదు. అన్ని మండలాలనూ సమన్వయపరిచే వ్యాకరణాలు తెలుగులో కాలానుగుణంగా విరివిగా రావాలి.

❈

---

**(తెలుగు మాటలకు పెరనుడి తెల్లము– 18వ పుట తరువాయి)**

88) ఇరుమాట ఓజంటిక = విశేషోభయపద కర్మధారయ సమాసం
89) మునుమాట పోలికంటిక = ఉపమాన పూర్వపద కర్మధారయ సమాసం
90) వెనుమాట పోలికంటిక = ఉపమాన ఉత్తరపద కర్మధారయ సమాసం
91) మునుమాట పేరంటిక = సంభావనా పూర్వపద కర్మధారయ సమాసం
92) సరిసాటి అంటిక = రూపక సమాసం (Determination compound)
93) రెట్ట అంటిక = ద్వంద్వ సమాసం (Copulative compound)
94) ఎన్నిక అంటిక = ద్విగు సమాసం (Numeral compound)
95) వియ్యపు అంటిక = బహువ్రీహి సమాసం (Relative compound)
96) ఇరు అంకెల వియ్యపంటిక = సంఖ్యోభయపద బహువ్రీహి సమాసం
97) సహ మునుమాట వియ్యపంటిక = సహ పూర్వపద బహువ్రీహి సమాసం
98) బిగువు అంటిక = అవ్యయీభావ సమాసం (Indeclinable compound)
99) నిడుపు కలయిక = సవర్ణదీర్ఘ సంధి
100) ఆలుడి కలయిక = గుణ సంధి
101) పెంపు కలయిక = వృద్ధి సంధి
102) యవదూఱు కలయిక = యణాదేశ సంధి
103) ముక్కుపు కలయిక = అనునాసిక సంధి
104) సత శచ కలయిక = శ్చుత్వ సంధి
105) నునుపు కలయిక = జస్త్వ సంధి

❈

---

## జనవాణి

**అ**మ్మనుడి పత్రిక, తెలుగు భాషా సంఘాలు చేస్తున్న విన్న పాలు ప్రభుత్వానికి మెలకువ కలిగించి సచివాలయం ప్రారంభోత్స వానికి తెలుగులో పలకలు వేయడం శుభసూచకం. శ్రీ నరేంద్రమోడీ గారు అమరావతి ఉత్సవానికి వచ్చినప్పటి నుంచి తెలుగుభాషకు జరుగుతున్న అన్యాయాన్ని మీరు 'అమ్మనుడి'లో ఎలుగెత్తి చాటు తున్నారు. తమిళనాట ఎన్నికలు జరిగి జయలలిత ఎన్నిక అయి నారు. ప్రచారం చివరిరోజుల్లో తమిళనాట 2 కోట్ల తెలుగు ఓటర్లు ఉన్నట్లు, వారు ఏ విధంగా ఓట్లు వేసేది ముఖ్యమైన అంశంగా ప్రసార సాధనాలు ప్రకటించాయి. కానీ ఏ రాజకీయ నాయకుడు కూడా ఎన్నికల ముందుగాని, తరువాత గానీ తెలుగుభాష ప్రాము ఖ్యత గురించి ఏమీ మాట్లాడలేదు. ఈమధ్య విజయవాడలో ఒక రోజు తెలుగుభాష గురించి సభ ఉన్నదని ఆహ్వానం వచ్చినది. ఈ మాదిరిగా ఒకరోజు, రెండురోజుల సభలు, ఉపన్యాసాలు, తరువాత భోజనాలు..ఏమాత్రం తెలుగుభాషకు మద్దతు ఇచ్చుటలేదు. ఒక ప్రణాళిక ప్రకారం పని చేస్తే తప్ప వాగ్దానాలు ఆవిరి అయిపోతాయి.

**–అ.నరసింహం,** బెంగళూరు, 080–25526331

-హారతీ వాగీశన్, 94402 53089

# తెలిసిన భాషలోనే నేర్పులను బాగా అందుకోగలం

**ప్రతి తరంలో తల్లిదండ్రులు తరువాతి తరమైన తమ పిల్లలు ప్రయోజకులు కావాలని ఆశిస్తారు. ఉత్పాదక సామర్థ్యంతో తమ కాళ్ళ మీద తాము నిలబడే వాళ్ళు గానూ, సమాజంలో నలుగురిలో మంచిపేరు తెచ్చుకొని నలుగురికి మేలు చేసేవారుగా మారాలని కోరుకుంటారు. ఇట్లా మారడానికి నేర్పు (లు) అవసరం, ఆ నేర్పు (లే) చదువు. మహాకవి పోతన గారి మాటల్లో చెప్తే చదువు వల్ల 'సదసద్ వివేక చతురత' కలుగుతుంది. మంచి ఏదో మంచి కానిది ఏదో తెలుసుకునే వివేచనా శక్తి అనే ఒడుపు లేక చాతుర్యమే చదువు అని కవి భావం.**

ఒకరకంగా నేర్పులను 1) బతుకుదెరువు నేర్పులు 2) సామాజీకరణ నేర్పులు గా విభజించవచ్చు. బతుకుదెరువు నేర్పుల కోసం వ్యక్తీకరణ ప్రజ్ఞ (మాటలతో, రాతలతో, రూపంతో, చేతలతో తానే మిటో తెలియచెప్పే ఒడుపులు) తార్కిక ప్రజ్ఞ (ఏది, ఎందుకు, ఎలా జరుగుతుంది లేక జరగదు అనితెలిసే ఒడుపు) చాలా అవసరం. అది ఏ బతుకుదెరువు మార్గమైనా సరే. మన సమకాలంలో మాట్లాడితే, సర్కారు నౌకరి లోనైనా, ప్రైవేటు కొలువులోనైనా, స్వయం ఉపాధిలోనైనా రాణించాలంటే ఈ ఒడుపులు అత్యవసరం.

ఇక సామాజీకరణ నేర్పుల విషయానికి వొస్తే- తన వంటి మనుషులతో, తనవంటి వారు కాని వారితో ఎట్లా మెలగాలే అనే ఒడుపు, అధికార స్థానంలో ఉన్న వారితో ముఖాముఖి మాట్లాడే ఒడుపు, సమత స్వేచ్ఛ అనే ప్రధాన విలువలను అర్థం చేసుకొని వ్యక్తిస్థాయిలో సముదాయ స్థాయిలో వాటిని సాధించుకునే ఒడుపు. వ్యష్టికి సమష్టికి మధ్య ఉండవలసిన సమతులనం గురించిన, మనిషికీ చరాచర ప్రకృతికీ మధ్య గల సంబంధపు ఎరుక- అనేవి కీలక విలువలౌతాయి. సామాజీకరణ నేర్పులు- ప్రజాస్వామిక రాజ్యమూ, సమాజమూ, హేతుబద్ధమయిన (దురాశాపూరితం కాని) మార్కెట్టు అనే వ్యవస్థల నిర్మాణానికి, నిలకడ గల నాణ్యమైన జీవితానికి (సస్టెయినబుల్ లైఫ్) అత్యవసరం. ఇవీ నేర్పులలోని ముఖ్యాంశాలు. వ్యక్తి, పై నేర్పులను నేర్చుకుంటూ, శారీరకంగా, మానసికంగా, ఉద్వేగాల స్థాయిలో (ఎమోషనల్ లెవెల్‌లో) బౌద్ధిక, (ఇంటలెక్చువల్) స్థాయిలో వికసిస్తూ సాగడమే నిరంతర విద్య.

నేర్పుకు మూడు దశలు ఉంటాయి మొదటిదశ పరిచయం, రెండవ దశ ప్రవేశం, మూడవ దశ ప్రావీణ్యత. స్థాయిని బట్టి ప్రావీణ్యతని, సాధారణ స్థాయి, మధ్యస్థాయి, ఉన్నత స్థాయిగా వర్గీకరణ వీలుంది. తొలిపదహారు సంవత్సరాల నేర్పుల వల్ల క్రమ గతిలో ప్రావీణ్యత అనే ఆవరణలోకి, ఉన్నత విద్య మార్గంలోకి మనిషి పయనం సాగుతుంది. ప్రావీణ్యతా దశకు చేరుకునేందుకు పునాది పరిచయ దశలో పడుతుంది. అక్కడ సరైన పునాది పడకుంటే ప్రావీణ్యత సాధ్యం కాదు. సహజంగానే ఆర్థిక, మేధోపర అసమానతలుండే వాస్తవ ప్రపంచంలో ప్రతితరంలోని వారూ యవ్వనారంభ దశ వరకు నాణ్యమైన బతుకుదెరువు నేర్పులు, సామాజీకరణ నేర్పులలోకి పరిచయం, ప్రవేశం పొందడమూ, వాటిని కల్పించడం పెద్ద సవాళ్ళు.

నేర్పులు- మనిషి జీవితపు తొలిపద్నాలుగు పదహారు సంవత్సరాల్లో అందించే కార్యక్రమమే మౌలిక విద్య. అంటే పుట్టినది మొదలు యవ్వనారంభం వరకు బతుకుదెరువు నేర్పులు సామాజీకరణ నేర్పులతో పరిచయం, ప్రవేశం కల్పించడమే మౌలిక విద్య లక్ష్యం. అందుకే ప్రతి ప్రజాస్వామిక సమాజం తన ప్రజలకు నాణ్యమైన మౌలిక విద్య అందాలని కోరుకుంటుంది. ఈ మౌలిక విద్య అందరికీ (వారి ఆర్థిక సామాజిక స్థాయి ఏదైనా) ఎటువంటి అరమరికెలు లేకుండా అందించడం మన రాజ్యాంగం కూడా ఏర్పరచుకున్న ఆదర్శమే.

విస్తృత అర్థంలో నేర్పు అనేదే భాషగా మారిపోతుంది. ఒక అంశంలో నైపుణ్యం (మంచి ప్రావీణ్యత) గల మనిషిని 'ఆ విషయానికి సంబంధించిన భాష తెలిసిన మనిషి' అని అనడం మనకు అనుభవంలో ఉన్నదే. ఐతే భాష భావాల వినిమయానికి (exchange ideas) ఉపయోగ పడే సాధనం కూడా. ఈ అర్థంలో నేర్పులు నేర్పుకోవడానికి భాష సాధనం అవుతుంది. పరిచయము, ప్రవేశము, ప్రావీణ్యత అనే మూడు దశల నేర్పులకూ ఒక సాధనంగా భాష ఉంటుంది. బతుకుతెరువు నేర్పులలో కీలకమైన వ్యక్తీకరణ సామర్థ్యాలు నేర్పే సాధనం కూడా ఈ భాషనే. ఇదొక సామాజిక నిర్మాణం. భావవినిమయ సాధనాలు అయిన భాషలు పలు రకాలు. లిపి ప్రాతిపదికగా భాషలను లిపి లేనిభాషలు లిపి ఉన్న భాషలు అని ఒక తీరు వర్గీకరించుకోవచ్చు.

**పుట్టుక మొదలు తొలి పదహారు సంవత్సరాలు అందరికీ మౌలికమైన బతుకుదెరువు. సామాజీకరణ నేర్పులను నేర్పడానికి ఏరకంగా భాషలను వాడుకోవాలి? అనేది అనేక భాషా సంస్కృతులు ఉండే భారతదేశం (అటువంటి సమశీతల దేశాలలో) విద్యావేత్తల ముందు ఉండే ప్రశ్న. ఇక్కడ లిపి లేని భాష, లిపి ఉన్న భాష, లిపిగల విస్తరణ గల భాష వంటి భాషలను అన్నింటినీ నేర్పులకోసం వాడవలసి వస్తుంది. కానీవాస్తవ ప్రపంచంలో లిపిలేనిభాష (కోయ వంటి) తక్కువ స్థాయి కలదనీ, లిపి గల ప్రాంతీయ భాష (తెలుగు వంటి) కొంత గొప్ప అనీ లిపిగల విస్తరణ (ఇంగ్లీషువంటి) భాష చాల గొప్పదనీ అనుకునే (దు) స్థితి ఉన్నది. ఇది హేతువుకు నిలువని**

**భాష ఆధిపత్య భావం తప్ప మరోటి కాదు. ఇది అసమానత్వం సహజం అని భావించే వర్ణ కుల ఆలోచనల వంటిదే.**

ఏదైనా విషయం నేర్చుకోవడంలో తెలిసిన విషయం నుండి తెలియని విషయం వైపు పయనించడం జరుగుతుంది. మనుషులు ఏదో ఒక భాషా వాతావరణంలో పుడుతారు. అది లిపి లేని భాష అయినా నేర్పుకు బీజాలు ఆ భాషలోనే పడుతాయి. ప్రపంచంతో పరిచయం ఆ భాషతోనే మొదలవౌతుంది. ఆ భాషకు సమీపంలోగల లిపిగల భాష, దానికంటే దూరంగా ఉండే (లిపిగల) విస్తరణ గల భాషతో పరిచయం కూడా దాని ద్వారానే అందుతుంది. అంటే ప్రతి భాషకు ఆయా స్థాయిల్లో ప్రాధాన్యత ఉంటుంది అని గుర్తించాల్సి ఉంటుంది. పరిచయం లేని భాష ద్వారా, పరిచితమైన ప్రపంచాన్ని గురించి గూడా వివరించడం సాధ్యం కాదు. అపరిచితమైన భాషను నేర్చుకోవడం ఎట్లా? అన్న మెలకువ చాలా క్రమపద్ధతిలో బాగా తెలిసిన భాష పునాదిగా జరగాలి. ముందుగా భాషను ఒకే ఒక భావప్రసాద సాధనంగా అనేక భావనలను(కాన్సెప్టులను)నేర్పే పని ముట్టుగా చూడటం విద్య నేర్పే సందర్భంలో అత్యవసరం. అపరిచిత మైన భాష అవసరం ఎంత ఉంటుంది? ఎందుకు ఉంటుంది? అన్న విషయాన్ని కూడా పరిచితమైన భాషలో నేర్పాల్సి ఉంటుంది. ఆపరిచితమైన భాషను ఏదో అతిగొప్ప విషయమైనట్టు, దానిని నేర్చుకోవడమే అతి గొప్ప విజయం, లేకపోతే ఘోరమైన పరాజయం అయినట్టు చూపడం ద్వారా ఆ అపరిచిత భాష అంటేనే ఒక భయం, వ్యతిరేకతా పెరిగే ప్రమాదం ఎక్కువ. తెలిసిన తల్లి భాషపైన, ప్రాంత భాషలపై చిన్నచూపు, అసహ్యమూ కలగకుండా తెలియని భాష పట్ల భయమూ వ్యతిరేకతా లేకుండా భాషలను నేర్పే వ్యూహాలు ఉండాలి. ఒక విద్యార్థి ప్రాథమిక స్థాయిలో పరిచయం బాగా ఉన్న భాషలో (ల్లో) వ్యక్తీకరణ, తార్కిక సామర్థ్యాలకు పదునుపెడితే వాటి ద్వారా ఇతర భాష మెలకువలను నేర్చుకోవడం కూడా సాధ్యమే.

ప్రభుత్వ స్కూళ్ళల్లో ప్రాథమిక స్థాయి నుండి బోధన ఇంగ్లీషులో మాత్రమే సాగాలె అనే రాజకీయ సంవాదాన్ని (political debate) ఇటీవలికాలంలో దళిత బహుజన చింతనా పరులు ముందుకు తెస్తున్నారు. మొత్తంగా దళిత బహుజన మెజారిటీ పిల్లలకు పెద్ద సంఖ్యలో ఉండే సాధారణ ప్రభుత్వ స్కూల్స్ ద్వారా ఎటువంటి సామర్థ్యాలూ అందడం లేదు అన్న వాస్తవాన్ని గానీ, ఫీజులు వసూలు చేసే ప్రైవేటు ఇంగ్లీషు మీడియం స్కూళ్ళలో నాణ్యత నాసిరకంగా ఉన్నది అన్న విషయాని గానీ వారు పట్టించుకున్నట్టు లేదు. దానికి తోడు తొలి తరం లోనో రెండవ తరం లోనో బడికి వస్తున్న ప్రాంతీయ (లిపి లేని, లిపి గల) భాషల పిల్లలు అపరిచితమైన భాషతో, స్పెల్లింగు లతో సహా అంతా బట్టీ పట్టవలసిన హింసలోకి, నేర్పులేమి లోకి నెట్టబడుతున్నారు అన్న వాస్తవాన్ని గుర్తించడం లేదు. కనీసం పద్నాలుగు సంవత్సరాల కాలంలో చదువరి ఇంగ్లీషు నేర్చుకోవడానికీ ఇంగ్లీషులో నేర్చుకోవడానికీ మధ్య గల అంతరాన్ని స్పష్టంగా గుర్తిం చాలె. **గణితమూ, పదార్థ విజ్ఞానమూ, పరిసర విజ్ఞానము అనేక భావనలతో (కాన్సెప్ట్లతో) కూడి ఉంటాయి ఈ భావనలను అపరిచిత భాషలో ఆ వయసులో నేర్పడం దాదాపు అసాధ్యం. అనేక కీలక భావనల పరిచయమూ ప్రవేశమూ అందవలసిన స్థాయిలో గాడి తప్పితే ఇంక ఆ పిల్లల నేర్పుకు భవిష్యత్తు ఉండదు, నేర్పులో నాణ్యతా ఉండదు.**

**బతుకు తెరువు నేర్పులూ, సామాజీకరణ నేర్పులూ కలిసి ఉన్నత స్థాయి నేర్పులల్లోకి పోవడానికో లేక ఏదో ఒక వృత్తిజీవితం లోకి ప్రవేశించడానికో, వీలుగా ఒక మనిషి తొలి పదహారు సంవత్సరాల నేర్పులు ఉండాలె. సాధారణ ప్రభుత్వ బడులలో (12 వ తరగతితో కలుపుకుని) ఈ నేర్పులు నేర్పేందుకు ఎటువంటి సంసిద్ధత ఉన్నది? వాటి నాణ్యతను మరింత పెంచేందుకు జరగవలసిన చర్యలేమిటి? అన్నప్రశ్నలే, సమాజంలో చదువు విషయంలో సానుకూల మార్పును కోరుతున్న వాళ్ళ నిరంతరం చర్చ, కార్యాచరణలకు ప్రేరణ కావాలె. ప్రస్తుతం ప్రాథమిక మాధ్యమిక విద్యని పొందిన తొలిపదహారు సంవత్సరాలవారిలో మెజారిటీ, తీవ్రమైన నేర్పుల లోటుతో (స్కిల్ డెఫిసియన్సీ) ఉండటం మన తెలుగునేలలు (ఆమాట కొస్తే దేశ మంతా) ఎదుర్కొంటున్న తీవ్ర సమస్య. ఈ లోటు పైస్థాయి చదువుల పైన కూడా ప్రతికూల ప్రభావాన్ని చూపుతుంది. పైన పేర్కొన్నస్థాయి చదువుకున్న యువ జనాభాలో కనీసం 40 శాతమైనా నేర్పులోటు లేని సమర్థులు ఉండాలి కానీ అది 10 శాతం కన్నా మించి ఉన్నట్టు కనిపించడం లేదు. దేశంలో ఉత్పాదక రంగం వికసించాలె అన్నా, సమత్వమూ స్వేచ్ఛతో కూడిన కొత్త సామాజిక నిర్మాణం ఏర్పడాలె అన్నా, ప్రజాస్వామ్యపు స్వభావము మంచిగా మారాలె అన్నా ఈ నవయవ్వన తరమే కీలకం. ఈ కీలక నేర్పులు స్కూలులోనూ స్కూలు బయటా నేర్చుకోవడం జరుగుతుంది. స్కూలు బయట ఉండే విశాల ప్రపంచం నుండి ఏమి, ఎట్లా నేర్చుకోవాలే అనేదే స్కూలో కీలకంగా తెలుసుకోవలసి ఉంటుంది.**

2004 ప్రాంతం నుండి మన మన దేశంలోని ఉద్యోగ వయసులో గల, పట్టాలు పుచ్చుకొని ఉన్న అనేకమందికి వాస్తవానికి నైపుణ్యాల కొరత ఉన్నది అని ప్రభుత్వమే ఒప్పుకుంటున్నది. జాతీయ నైపుణ్యాల అభివృద్ధి బోర్డును (నేషనల్ స్కిల్ డెవలప్మెంట్ బోర్డు) నెలకొల్పారు. ఆ కాలంలోనే సర్టిఫికెట్లు ఉన్నా సామర్థ్యం లేని యువత ఎందుకు తయారు అయ్యింది? అన్న విషయాన్ని ప్రధానంగా దళిత బహుజన చింతనాపరులు ముఖ్యంగా పట్టించుకోవల్సి ఉన్నది. స్కూలు కాలేజీ చదువు, అది అందించే నైపుణ్యాలు మాత్రమే పెట్టుబడిగా గల యువతలో అత్యధిక భాగం వెనుకకు నెట్టివేయబడిన పాలిత కుల వర్గాల పిల్లలే ఉంటారు అన్నది నిర్వివాదం.

మౌలిక విద్యను నేర్పే తీరులో ఉన్న తీవ్రమైన లోపాలను, నాణ్యామైన విద్య అందరికీ అరమరికెలులేకుండా అందించలేని ప్రభుత్వాల నిర్లక్ష్యాలనూ, కనీస స్థాయి నాణ్యమైన విద్య అత్యంత ఖరీదైన వ్యవహారంగా మారిపోవడాన్ని ప్రశ్నించడం అప్రధానమై, దేశంలోని మెజారిటీ ప్రజలకు అందరికీ ఇంగ్లీషులో ప్రభుత్వం చదువు చెప్పడం ప్రస్తుతపు అవసరం అని భావించడంలో లోపం ఉన్నది. దోపిడీ, పీడన, బ్రాహ్మణీయ ఆధిపత్యం, దాని పనితీరుల దుష్పరిణామాల వంటి అంశాల విశ్లేషణ సందర్భంలో ఎంతో విలువైన వాదనలను ముందుకు తెచ్చిన దళిత బహుజన చింతకులు ఈ విషయం గురించి లోతుగా ఆలోచించవలిసి ఉన్నది. **పదహారు ఏండ్ల వ్యక్తికి ఇంగ్లీషు మాట రాతలలో కొంత వెనుకబాటు ఉన్నా దాన్ని కొంత శ్రమతో జయించవచ్చు. కానీ అదే వయసులో మొత్తంగానే బతుకుదెరువు నేర్పులు, సమాజీకరణ నేర్పులలో లోటు ఏర్పడితే అది ఆ వ్యక్తిని**

ఎదగనివ్వదు.

ఇంగ్లీషు కాని ఇంకే ఇతర విదేశీ భాషఅయినా నేర్చుకోవడం ఎలా అన్న అంశాలు మారిన ప్రపంచ పరిస్థితులలో అత్యంత కీలకం. స్కూల్లో పదహారు సంవత్సరాలు చదువుకున్న వ్యక్తి తక్కువ పరిచయం గల లేక పరిచయం అంతగాలేని భాషను నేర్చుకోవడం ఎట్లా? అనే వొడుపును తెల్సుకోవడం వల్ల మాత్రమే ఇంగ్లీషులో గానీ ఇతర భాషలో గానీ పట్టు సాధ్యం. భాషా వ్యక్తీకరణ నైపుణ్యాలు, సదరు వ్యక్తి ఎంచుకున్న జీవన రంగాన్ని బట్టి ఉంటుంది.

ఉదాహరణకు ఒక ఇంజనీరు వాడే ఇంగ్లీషుకూ, ఒక డాక్టరు వాడే ఇంగ్లీషుకు తేడా ఉంటుంది వాళ్ళు ఆయా వృత్తుల పరిభాష వాడుతారు (ఆమాట కొస్తే వారు వృత్తి పరంగా మాట్లాడే స్థానిక భాషలో కూడా ఇదే స్థితి ఉంటుంది) తొలి పదహారు ఏండ్ల చదువు, నేర్పుల తరువాత ఎంచుకున్న బతుకుబాటను బట్టి, లేక పై స్థాయి అధ్యయన రంగాలను బట్టి, ఏ ఏ భాషలు ఎంత స్థాయి (పరిచయ స్థాయి, ప్రవేశ స్థాయి, ప్రావీణ్యస్థాయి) లో నేర్చుకోవాలో తేలుతుంది. ఈ తీరులో ఆలోచిస్తే తల్లి, భాష, ప్రాంతీయ భాష, ఇతర భాష అనే మూడు నేర్పులోను అత్యంత కీలక పాత్ర పోషిస్తవి అన్న విషయం అర్థమవుతుంది. అంతే కాక తల్లి భాష ప్రాంతీయ భాషలను మారు తున్న కాలానికి అనుగుణంగా మార్చుకునే మనుషులు కూడా రూపొందుతారు. ఏ భాషా దానికదే తక్కువది కాదు ఏ భాషా దానికదే గొప్పది కాదు అన్న ఎరుక విస్తరిస్తుంది. భాషల మధ్య ఇచ్చిపుచ్చు కోవడమూ పెరుగుతుంది.

బతుకు దెరువు నేర్పులు, సమాజీకరణ నేర్పులు అనే నేర్పుల సముదాయంలో భావవినిమయ సాధనమైన భాషా పాటవాలు ఒక భాగం అని గమనించాలె. అందుకే **మౌలిక విద్య నేర్పులలో భాషా పరమైన అతివాదం (ఫండమెంటలిజం) జొరబడకూడదు. మాతృ భాషపైన కేవలం ఉద్వేగపూరిత అనురక్తి చూపుతూ కేవలం దానిలో మాత్రమే నేర్పు జరగాలె అని చెప్పడం ఒక అతివాదం కాగా, మొదటి తరగతి నుండి ఇంగ్లీషులో మాత్రమే చదువు నేర్పాలె అనేది మరో రకం అతివాదం. సాధారణం గానే భాషా సాంస్కృతిక బహు ళత్వం ఉన్న మన దేశంలో ముందుచూపు లోపించిన అతివాదాలు అనర్థాలకు దారి తీస్తాయి.** నేర్పులకు సంబంధించిన చర్చ జరుగు తున్నప్పుడు స్కూలు కేవలం కమ్యూనికేషన్ స్కిల్స్ నేర్పే ప్రాంతం మాత్రమే కాదు అని గుర్తుంచుకోవాలి. స్కూళ్ళకు బయట ప్రాంతీయ భాషా, ఇతర ప్రపంచ స్థాయి భాషా సామర్థ్యాలను నేర్పే ఏర్పాట్లు జరగాలి, తల్లిభాష, ప్రాంత భాషా పరిరక్షణ అనేది కేవలం స్కూళ్ళు మాత్రమే చేసే పని కాదు, పాలనా మంత్రాంగమూ, మిగతా సమా జమూ, ఎరుకతో చేయవలసిన పని అది.

ఇప్పుడు మన తెలుగు నేలల్లోనూ మన దేశంలోనూ లేని తొలి పదహారు సంవత్సరాల నాణ్యమైన (నేర్పులలోటుని పెంచని) విద్య అందరికీ అందించడం అనే హక్కు మీద వివేకవంతమైన చర్చ, ఫలితాలు ఇవ్వగల చర్చ జరుగవలిసి ఉన్నది, ఈ ముఖ్య విషయాన్ని ఏ భాషలో నేర్పాలి? అన్న చర్చకు కుదించడం తప్పుడు అవగాహన. నేర్పులే భాషలుగాగా వెలిగే కోట్లాది మంది అనేక తీర్ల నేర్పరులు మనకు అవసరం. ❊

**(మనసులోమాట– 19వ పుట తరువాయి)**

సహజ వాసనలను సహజ మార్గాన పోనీయక సంయమించటం వల్ల శివునికి ఈ రూపం కల్పించాడు" అని ఊహించారు. ఇట్లాంటి ఊహాత్మ నిర్ణయాలు ఆసక్తికరంగా ఉండవచ్చు గాని, సమగ్ర సమా చారం లేకుండా చేసిన పరిశీలనలు తప్పుదారి పట్టిస్తాయి.

'కళాపూర్ణోదయ' కావ్యానికి వీరు వ్రాసిన ఇంగ్లీషు సిద్ధాంత గ్రంథం తెలుగు సాహిత్యపరిశోధనల్లోనే ప్రత్యేకంగా పేర్కొనదగినది. పరిశోధనలకున్న ఆనాటి మూసపద్ధతికి భిన్నమైనది.

ఇప్పుడు గౌతమీపుత్ర శాతకర్ణి చలనచిత్రం తీయబోతున్న సందర్భంలో ఒక అంశాన్ని గుర్తుంచుకోవాలి. జి.వి.కె. వ్రాసిన 'బొమ్మ ఏడ్చింది'లో నాగార్జునాచార్యుణ్ని గౌతమీపుత్ర శాతకర్ణి కాలంవాడుగా చిత్రించారు. ఆ రాజును హైందవ కాఠిన్యం కలవాడని వర్ణించారు. కాని శాతకర్ణికి దాదాపు 80 సంవత్సరాల తర్వాత వచ్చిన యజ్ఞశ్రీ శాతకర్ణి కాలానికి చెందినవాడుగా చారిత్రకులు అచార్యుని కాలాన్ని నిర్ణయిస్తున్నారు.

జి.వి.కె. వ్యక్తిత్వంలో ముగ్గురు మూర్తులు ఉన్నారు. ఒకరు సాహిత్య స్రష్ట, మరొకరు సాహిత్య విమర్శకుడు, మూడవమూర్తి తాత్వికుడు. ముగ్గురిలో తాత్విక జి.వి.కె మిక్కిలి పొడగరి. వారి సాహిత్య రచనలు తన తాత్విక చింతనకు కూర్చిన సాహిత్యరూపాలు. సాహిత్య రచనల్లో వారు ధ్వనించే ప్రాపంచిక అర్థాలన్నీ లోకం మీద కన్నా పరమార్థం వైపు దృష్టి సారించి ఉంటాయి. ధర్మాన్ని సమాజ సూత్రంగా ఆమోదించే వ్యక్తి స్వాతంత్ర్యమే – జి.వి.కె. తత్వదృష్టి. కర్మక్షేత్రంలో ఫలంతో నిమిత్తం లేకుండా ధర్మానుగుణంగా వ్యవహరించాలని 'కాంటు' చెప్పాడుట. అది జి.వి.కె.కు అభిలషి తార్థం. ఆర్థిక సామాజిక రంగాలలో మార్పు సిద్ధాంతంపట్ల గౌరవమే గాని 'గతితర్కం' పరమ ప్రమాణం కాదంటారు ఈయన.

ప్రాక్పశ్చిమ సిద్ధాంతాల సమ్మేళనం నుండి ఒక నూతన శాస్త్రాన్ని నిర్మించదలచినట్లు వీరి ప్రయత్నం అర్థమవుతుంది. జి.వి.కె. భవిష్యద్దర్శనమున్న తాత్వికుడు. శ్రద్ధ గల పాఠకులు దృష్టి మళ్ళించ వలసిన రచయిత.

వారి సమగ్ర రచనలను అభిమానులు ఎపుడో సంపుటాలుగా వేసి ఉదారంగా అందించారు. జిజ్ఞాసువులకూ ఇపుడు కొనుగోలుకు లభించటం లేదు. ఆ కొరతను పూరించటానికి ప్రయత్నిస్తే చాలా మేలు. వీటి చెల్లుబాటు నిదానంగానే జరుగుతుంది.

వజ్రాన్ని గుర్తించటం ఆలస్యమే కదా! ❊

శిశువు శారీరక వికాసానికి తల్లిపాలు
మానసిక వికాసానికి తల్లి భాష
గుండెలోతుల్లోంచి వచ్చేదీ, మనసు
విప్పి చెప్పగలిగేది అమ్మనుడిలోనే.

జాతి సాంస్కృతిక పతాక –మాతృభాష

–అన్నపూర్ణపుత్ర **డా॥ఈమని శివనాగిరెడ్డి**
ది కల్చరల్ సెంటర్ ఆఫ్ విజయవాడ, 98485 98445

# శాతవాహనులు

**శా**తవాహన ముందరి రాజుల తరువాత, ఛిముకుడనే రాజు తెలంగాణాలోని కోటలింగాల్లో శాతవాహన రాజ్యాన్ని స్థాపించాడు. అతని తరువాత వచ్చిన శాతకర్ణి మహారాష్ట్ర, మధ్య భారత దిగువ భాగం, విదర్భ ప్రాంతాలను జయించి, రాజ్యాన్ని విస్తరించాడు. క్రీ.శ.1వ శతాబ్దిలో గౌతమీపుత్ర శాతకర్ణి, దక్షిణాపథాన్ని, ఉత్తర భారతంలోని ఎగువ, వాయువ్యప్రాంతాలను జయించి శాతవాహన రాజ్యాన్ని సామ్రాజ్యంగా మలిచాడు. పురాణాలు పేర్కొన్న 30 మంది శాతవాహన రాజుల్లో శాసనాలు గానీ, నాణాల ద్వారాగానీ మనకు తెలుస్తుంది, కేవలం 15 మంది రాజులు మాత్రమే. వారు ఛిముక, కన్హ, సిరిశాతకర్ణి–1, శాతకర్ణి–2, మొదటిపులుమావి, గౌతమీపుత్ర శాతకర్ణి, వాసిష్టీపుత్ర పులుమావి 2 సిరసాపిలక, వాసిష్టీ పుత్ర సిరి శాతకర్ణి, వాసిష్టీపుత్ర సివసిరి పులుమావి–3, వాసిష్టీ పుత్ర (శివ) స్కన్దశాతకర్ణి, గౌతమీపుత్ర యజ్ఞశ్రీ శాతకర్ణి, వాసిష్టీపుత్ర విజయ శాతకర్ణి, ఛంద శాతకర్ణి, పులుమావి–4 శాసనం గానీ, నాణెం గానీ దొరకని రాజులు 14 మంది ఉన్నారు. వారు, పూర్ణోత్సంగ, లంబోదర, మేఘస్వాతి, కుంతల శాతకర్ణి, నేమకృష్ణ, అరిష్టకర్ణ, హాలుడు, మండలక, పురీంద్రసేన, సుందర శాతకర్ణి, చకోర స్వాతి కర్ణి, శివస్వాతి. శాతవాహనులు ముందుగా కోటలింగాల తరువాత పైఠాను, ధాన్యకటకం రాజధానులుగా క్రీ.పూ.52 నుంచి క్రీ.శ.230 వరకు పాలించారు. కొందరు రాజులు కేవలం 'రాజ' శబ్దంలోనూ, మరికొందరు రాజులు దాదాపు 15కు పైగా బిరుదుల్ని ధరించారు. వివరాల్లో కెళితే–వంశమూల పురుషుడైన ఛిముకునికి, 'వంశవర్ధన' (సిముక శాతవాహనస వంశవధనస) అనే బిరుదున్నట్లు నాగనిక నానేఘాట్ శాసనంలో ఉంది. కోటలింగాల నాణాలపై రణోసిచ్చిముక శాతవాహన అని రాజ శబ్దంతోనూ, రాయసిముక శాతవాహన అని నాసిక్ శాసనంలో (రాయశబ్దంతోనూ)నూ ఛిముకుని ప్రస్తావన లున్నాయి.

మొదటి శాతకర్ణి పైఠాను నుంచి పాలించి దక్షిణాపథంలో ఎక్కువభాగాన్ని స్వాధీనం చేసుకోవటం చేత, అతనికి 'వీర', 'శూర' 'దక్షిణాపథేశ్వర' బిరుదులు లభించాయి. అతని శూరత్వానికి 'అప్రతి హతచక్రి' బిరుదు కూడా లభించింది. క్రీ.శ.60–90 సం॥ల మధ్య ముందు పైఠాను, తరువాత కొండాపూరు, అటు తరువాత ధాన్య కటకం నుంచి పాలించిన గౌతమీపుత్ర శాతకర్ణి, రాజ్యవిస్తృతి గావించి పశ్చిమ తీరాన్ని, దక్షిణా పథాన్ని అటు తరువాత ఉత్తరం గానూ, వాయువ్యంగానూ, ఇప్పటి తెలంగాణా, కర్ణాటక, తీరాంధ్ర, తమిళనాడు, కొంకణ, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, గుజరాత్, రాజస్థాన్ ప్రాంతాలను జయించి అప్రతిహతచక్రవర్తిగా గుర్తింపు, అనేక బిరు దులూ పొందాడు. ఆ వివరాలన్నీ, అతని తల్లి గౌతమీ బలసిరి, కొడుకు వాసిష్టీ పుత్ర పులుమావి కలసి వేసిన నాసిక్ శాసనంలో వున్నాయి.

ఈ శాసనంలో గౌతమీపుత్రునికి రాజరఞ్ఞో(రాజులకు రాజు, రాజరాజు) హిమవతమెరుమీదర ప వతసమ(హిమవన్మేరు మందర పర్వత సమానుడు), సవరాజలోకమడలపతిగహిత సాసనస (సర్వ రాజలోక మండలము చేత తన శాసనము శిరమున దాల్చబడిన వాడునూ), తిసముద తొయపీత వాహన(మూడు సముద్రాల నీరు త్రాగిన గుర్రాలు=వాహనాలు కలిగిన వాడునూ), ఖతియద పమాన మదన (క్షత్రియుల దర్పమును, మానమును అణగగొట్టిన వాడునూ), సకయవన పల్హవ నిసూదన (శక, యవన, పల్లవులను నాశనం చేసిన వాడునూ), ఖఖరాతవసనిరవసెసకర (క్షహరాట వంశమును నిర్మూలించిన వాడునూ), సాతవాహన కులయస పతిథాపనకర (శాత వాహన వంశకీర్తిని ప్రతిష్టించిన వాడునూ), వినివతిత చాతువణసకర (చాతువర్ణ సంకరమును నివారించిన వాడునూ), అనేక సమరావ జితసతుసఘ(అనేక యుద్ధాల్లో శతృసంఘాలను జయించినవాడునూ), అపరాజిత విజయపతాక (పరాజయమెరుగని విజయపతాకము కలవాడునూ), అగమాన నిలయస (ఆగమములకు నిలయమైన వాడునూ), సపురిసానం అసయ స సిరీయ అధితాన( సత్పురుషులకు ఆశ్రయుడునూ, సిరిసింపదలకు అధిష్టానమైనవాడునూ), ఏకధనుధర (ఏకధనుర్ధరుడు), ఏకసూర (ఏకశూరుడును), ఏకబంహణ (ఏక బ్రాహ్మణుడును), (రామకేవార్జునభీమసేనులతో సమాన పరాక్రమము కలవాడునూ, చణఘనుస వ సమాజ కారక (అవిచ్ఛిన్నములైన ఉత్స వములందును, సమాజములందును దాతృత్వము కలవాడునూ), సమరజితరిపుసఘ (యుద్ధాల్లో శత్రుసంఘాలను జయించిన వాడునూ), కులవిపులసిరికర (శాతవాహన కులమునకు విపులమైన సిరిని సంపా దించినవాడునూ) అన్న బిరుదులతో పేర్కొనబడినాడు. ఇంతటి శక్తి మంతుడు, ఇన్ని రాజ్యాలను జయించినవాడు, శాతవాహన వంశంలో లేడన్నది నిజం. నిజానికి ఈ నాసిక్ శాసనం, రుద్రదాముని జునాగడ్ శాసనం, సముద్రగుప్తుని అలహాబాద్ ప్రశస్తి శాసనాలకు నమూనాగా నిల్చిందనటంలో అతిశయం లేదు. ❊



బయటి తెలుగు బతుకు కతల మాలిక-1

# ఓ సంచారి అంతరంగం

కుప్పె నాగరాజు గారు
కన్నడంలో రచించిన
'అలెమారియ అంతరంగ'కు
రంగనాథ రామచంద్రరావు గారి
తెలుగు అనువాదం



## 1.నెలవుకొన్న ఘడియ

ఇంత విశాలమైన ఈ భూమి మీద నా తండ్రికి ఎక్కడ కూడా ఒక అరచేయి వెడల్పు స్థలం ఉండలేదు. తావు లేని నాన్న ఊరూరు తిరుగుతూ తన వంశపారంపర్యమైన జోలెను భుజానికి వేలాడదీసుకుని బడగసీమ నుంచి ఈ వైపు వచ్చాడు. తాత ముత్తాతల నుంచి వారసత్వంగా వచ్చిన ఆస్తి, అదే జన్మతో వచ్చిన భిక్షావృత్తిని బదుకుగా మార్చుకున్నాడు. పాటలు పాడి, బయలాట ఆడుతూ, హరికథలు చెబుతూ ఊరూరు తిరుగుతూ వర్షం, పంటలు సమృద్ధిగా ఉండే దిక్కుకు తన సంసార రథాన్ని నడిపించుకుని సాగేవాడు. తన మనస్సు ఎక్కడ కుదురుతుందో, ఎక్కడ నాలుగు రోజులు విడిది చేయడానికి అనుకూలమైన వాతావరణం ఉంటుందో, ఎక్కడ నీళ్ళు, నీడ ఉంటాయొ అలాంటి స్థలంలో మూడురాళ్ళ పొయ్యి పెట్టి, చుట్టుపక్కల ఉన్న పుల్లలు, ఎండుటాకులు సేకరించి పొయ్యి వెలిగించి అమ్మ కడుపుకు ఇంత ఆధారం చేసేది. (మా కడుపులు నింపటానికి ఏమైనా చేసేది.)

నాన్న నుదుటికి విభూతి పూసుకుని, తలకు పాగా చుట్టి, తెల్లటి అంగీ, తెల్లటి పంచె, ఎవరి నుంచో పొందిన పాత కోటు తొడుక్కుని భుజానికి జోలె తగిలించుకుని, చేతిలో తంబూరనో లేదా శృతిపెట్టెనో పట్టుకుని తన దైనందిన కార్యక్రమానికి బయలుదేరే వాడు. ఇలా ఊరూరూ తిరుగుతూ ఎక్కడ కూడా స్థిరనివాసం ఏర్ప రుచుకోక జంగమావస్థలోనే తాను తన సంసారం సంచరించేది.

ఇలాంటప్పుడు మా తండ్రికి ఈ ఊరు ఎలా నచ్చిందో తెలి యదు. ఊరి జనం ఇతను పాడుతున్న రకరకాల లావణిలు- కథన గీతాలు, వాయిస్తున్న వాయిద్యాలు, చెబుతున్న బయలాట డైలాగులు, వేసుకుంటున్న వేషభూషణాలు, బయలాటలలో అందరిని ఆశ్చర్య పడేలా అభినయిస్తున్న కోడంగి పార్టు వల్ల ఆకర్షితుడయ్యాడు. బాల గ్రహ పీడితులై చలిజ్వరంతో బాధపడుతున్న పసికందులకు తాయె త్తులు కట్టి, నుదుటికి, పొట్టకు మంత్రించిన విభూతి పూసి ఈయన వారిని బాగుచేసే రీతి, తనకు తెలిసిన జ్యోతిష్య జ్ఞానంతో శుభఅశుభ ఘడియలను తెలియజేసి మంచి కార్యకలాపాలకు సమయాన్ని- ఘడియలను నిర్ణయిస్తున్న విధానం వల్ల ఊరి జనం ఇతడిని అభిమా నించేవాళ్ళు. గవ్వలు విసిరి శాస్త్రం చెప్పి తప్పిపోయిన పశువులు ఫలాన దిక్కులో ఉన్నాయని, వెళ్ళి వెదకండని చెప్పేవాడు. విచిత్రంగా ఆ తప్పించుకున్న పశువులు దొరికి నాన్న చెప్పిన శాస్త్రం నిజమయ్యేది.





కాళ్ళు చేతుల నరాలు పట్టేసిన రైతుజనానికి మంత్రం వేసి పట్టును వదిలించి నొప్పిని నివారించే నాన్న, తనకు తెలిసిన రకరకాల మొక్కల, మూలికల నుంచి ఔషధాలు తయారుచేసి రోగాలు రొష్టులను బాగుచేసేవాడు. ఇలా ఒకటా? రెండా? పలురకాల జ్ఞానాన్ని సంపాదించిన నాన్న అంటే ఊరి జనాలకు ఎంతో ఇష్టం.

ఈ విధంగా ఊరివారితో పెరిగిన సంబంధమే సంచార జీవితానికి వీడ్కోలు చెప్పి దొడ్డగౌడగారి పశువుల కొట్టపు అరుగు మీద నాన్న కుటుంబం మకాం పెట్టింది. అప్పటికే మావంటి దాసరుల రెండు కుటుంబాలు ఆ ఊరు చేరుకున్నాయి. దాంతో మూడు సంసారాలు అక్కడ ఆశ్రయం పొందాయి.

మా మూడు కుటుంబాలు కలసికట్టుగా బయలాటను ప్రదర్శించడానికి అవసరమైన ఒక బృందాన్ని రూపొందించుకున్నాయి. ఊరూర్లు తిరుగుతూ ఎక్కడా నెలవు కానక అస్వతంత్ర్య స్థితిలో ఉన్న సంసారానికి తాత్కాలికంగా ఒక నెలవు దొరకటం ఒక విధమైన నెమ్మదిని తెచ్చింది. అమ్మతోపాటు మా నలుగురి పిల్లల కడుపులు నింపటానికి నాన్న ఆ ఊరి చుట్టుపక్కలనున్న పది పదిహేను గ్రామాలలో తన వంశపారంపర్యంగా వచ్చిన భిక్షావృత్తినే అవలంభించారు. మా జనం అనుసరిస్తున్న ఈ వృత్తిని గ్రామీణ ప్రాంతం జనం గౌరవించేవారు. మా వాళ్ళు పాడుతున్న పాటలు, చెబుతున్న కథన గీతాలు, తత్వాలు భారతీయ సంస్కృతిలోని ప్రముఖమైన భాగాలే. దాసరులు ఈ సంస్కృతిని ప్రజలకు పంచటానికి, వారి మధ్యన వ్యాపింపజేయటానికి ప్రత్యేకించబడిన జనాంగమేమో అన్నట్టు ఉండేవారు. వీళ్ళు చెబుతున్న కథన గీతాలలో, లావణిలలో రామాయణం, మహాభారతం, భాగవతంలాంటి మహాకావ్యాల ప్రసంగాలూ, ప్రజానాయకుల జీవన చరిత్రలూ చోటుచేసుకునేవి. సమాజంలోని నైతిక ప్రజ్ఞ, సత్యం, ధర్మం, న్యాయం, నీతులతో కూడిన పాఠాలు ఈ దాసరుల భవద-భిక్షాటనా వృత్తి ద్వారా బహుపాలు నిరక్షరాస్యులే నిండిన గ్రామీణ ప్రాంతపు జనసముదాయానికి అందేవి. ఈ సంస్కృతి పరిచయంతోపాటు మనోవికాసం, మనోరంజనల తియ్యదనాన్ని రుచి చూపించేవారు.

నాన్న మరియు ఇతరులు కలసి రూపొందించుకున్న నాటక బృందం ఊరూర్లు తిరుగుతూ-భక్త ప్రహ్లాద, శని మహత్మ్యం, గంగా-గౌరి, కంస వధ మొదలైన నాటకాలను ప్రదర్శించేవారు. ఊళ్ళోని ప్రధాన వీధుల్లో వేదికను నిర్మించి, గ్రామీణుల నుంచే అందమైన చీరలను అడిగి తీసుకుని రాజు, రాణిల పాత్రధారులుగా అలంకరించుకుని ప్రజలను రంజింపజేసేవారు. ఏ నాటకం వేసినా మా నాన్న రాత్రంతా రంగస్థలం మీద తప్పనిసరిగా ఉండేవాడు. ఆయన

నిర్వహిస్తున్నది 'కోడంగి' (విదూషకుడి) పాత్ర. రాజు, రాణి, మంత్రి, సేనాధిపతి, దైత్యుడు–ఇలాంటి ఏ పాత్రల మధ్యనైనా ఈ 'కోడంగి' పాత్ర ఉండాల్సిందే. సున్నితమైన హాస్యభరితమైన సంభాషణలు, అంగచేష్టల వల్ల రాత్రంతా ప్రేక్షకులను రంజింపజేసి, నవ్వించి, గంతులు వేయించే విశిష్టమైన వేషం ఈ పాత్రది. సంభాషణలు, కందపద్యాలు, పాటలు, సందర్భాలను మరిచిపోయినవారికి తన 'మరుగు' భాషలో చెప్పిస్తూ ఎక్కడా నాటకం లయ తప్పకుండా ప్రేక్షకులకు విసుగు కలగని రీతిలో అద్భుతంగా నిర్వహించేవాడు.

నా తండ్రికి అతని తల్లితండ్రులు పెట్టిన పేరు సింగయ్య. అయితే బయలాటలలో ఆయన అభినయిస్తున్న 'కోడంగి' (విదూషకుడి) పాత్ర వల్ల ఆయనను 'కోడంగి' అనే జనం గుర్తించసాగారు. కాలక్రమంలో రెవెన్యూ రికార్డులలోనూ 'కోడంగయ్య' గానే ఆయన పేరు నమోదై ప్రాచుర్యం పొందింది. సింగయ్య అనే మూలనామం మరుగున పడింది.

నా తండ్రి ప్రదర్శిస్తున్న ఈ బయలాటలు, పాటిస్తున్న ఈ ధార్మిక భిక్షాటన, అదే విధంగా అమ్మ చేస్తున్న కూలీనాలీ వల్ల మా నలుగురు పిల్లల కడుపులు నిండేవి. అమ్మకు కులవృత్తి వచ్చేది కాదు. నాన్నకు వ్యవసాయం కానీ, కూలీనాలీ పనుల గురించి కానీ తెలిసేది కాదు. నాన్న దైనందిన కార్యక్రమం– ఉదయమే లేచి ముఖం, కాళ్ళు చేతులు కడుక్కుని, నుదుట విభూతి రేఖలు దిద్దుకుని, తలకు తెల్లటి పాగా చుట్టుకుని, భుజానికి జోలెను వేలాడదీసుకుని బయలు దేరేటప్పుడు ఇద్దరు ముగ్గురితో కలసి వెళుతుండటం పద్ధతి. కొన్ని సార్లు ఒక్కడే వెళ్ళేవాడు.

మా పాలిట నాన్న జోలె కామధేనువు– కల్పవృక్షం. ఆ జోలెలో మూడు భాగాలుండేవి. ఒక భాగంలో వడ్లు, రాగులు, జొన్నలు వేయించుకుంటే; మరొక భాగంలో రాగిపిండి, బియ్యం, రొట్టెలు వేయించుకునేవారు. మరొకదానిలో ధాన్యపు గింజలు, మిరపకాయలు మొదలైన సాంబరు పదార్థాలు ఉండేవి. మా ఆకలిని తీర్చే అక్షయ పాత్ర అది. నాన్న భిక్షాటన ముగించుకుని వచ్చిన వెంటనే అమ్మ గబగబా ఆ అక్షయపాత్రలాంటి జోలెను పరిశీలించి అందులో నిండుగా ఉన్న ధాన్యపు గింజలను వేరు చేసేవారు. ముందుగా రాగిపిండి ఉన్న సంచి తీసి జల్లెడపట్టి అందులోంచి బియ్యాన్ని వేరుచేసి, మరొక సంచిలో ఉన్న గింజల్ని తీసి సాంబరులో ఉడక టానికి వేసి, ముద్ద, అన్నం, చారు చేసేది. ఇవన్నీ సమకూర్చుకుని వంట సిద్ధం అయ్యేసరికి మేమంతా ఓ కునుకు తీసేవాళ్ళం. అమ్మ అందర్నీ లేపి భోజనం చేయించి, మిగిలింది తాను తిని నడుం వాల్చేది. ఇది ప్రతీ రోజుటి దినచర్య. నాన్న ఒక్కొక్కసారి భిక్షాటన ముగించి తిరిగొచ్చేటప్పుడు ఏదో ఒక జంతువునో, పక్షినో వేటాడి తీసుకుని రావటం జరిగేది. ఈ జంతువులను పట్టుకోవటానికి అవ సరమైన వల, ఉచ్చులు మొదలైనవాటిని జోలెతోపాటు సర్దుకునేవాడు.

ఇలా ఆ ఊరు, ఆ ఊరి ప్రజల ప్రేమ మా సంచార బ్రతుకు లకు నెలవై, ఊరివాళ్ళ అరుగుల మీద వేసుకున్న తడికెల కప్పుల అంతఃపురం మాకు జన్మ ఇచ్చిన జన్మస్థానమూ అయింది. ఆ అరుగు మీద ఆరునెలలు, ఈ అరుగు మీద ఆరు నెలల కాలం గడుపుతున్న మా కుటుంబాలకు చివరికి ఒక స్థిరమైన నివాసం దొరికే రోజూ దగ్గర పడింది. మా ఊరి సహృదయుడైన పటేలూ, ఛైర్మన్ అయిన పుట్టమల్లప్పగారు "ఇక మీ సంసారాలు పెద్దవవుతున్నాయి. మైసూరు, హుణసూరు ప్రధాన మార్గంలో ఉన్న గడ్డిమైదానంలో గుడిసెలు వేసుకోండి" అని సూచించారు.

కుడివైపున అర కి.మీ.లో సవర్ణుల ఊరుండేది, ఎడమవైపున హరిజనులున్న మరొక ఊరుండేది. ఈ రెండింటి మధ్యన మా దాసరుల కొత్త గుడిసెలు తలెత్తాయి. గుడిసెలు వేసుకోవటానికి కావలసిన కర్రలు, దుంగలు, కొబ్బరిమట్టలు, గడ్డి మొదలైనవన్నీ ఆ ఊరి జనమే ఇచ్చి సహాయపడ్డారు. సవర్ణుల, హరిజనుల రెండు వీధులూ దాసరుల గుడిసెలకు రక్షణాత్మకమైన గోడలా ఉండి, ఈ కళాకారుల సముదాయం అక్కడ మకాం పెట్టింది.

మా దొమ్మరి దాసరులు ప్రదర్శిస్తున్న బయలాటలకు మరులు పోయిన గ్రామీణులు తాము కూడా బయలాటలు నేర్చుకోవటం ప్రారంభించారు. హరిజనుల వీధిలో ఒకరు నాటక పాఠం మొదలు పెడితే, సవర్ణుల వీధిలో మరొకరు పాఠం చెబుతూ సముదాయా లన్నిటికీ పాఠాలు చెప్పే గురువులై సామరస్యమైన జీవితం గడపటానికి ఈ దాసరుల సమూహం తోడ్పడింది.

## 2. అన్నం, నీళ్ళకు తప్పని సంచారం

ఎందుకో ప్రకృతికి మేము ఒక చోట స్థిర నివాసం ఏర్ప రుచుకోవటం వద్దనిపించిందేమో? ఆ ఏడు వర్షాలు లేక వాగులు వంకలన్నీ ఎండిపోయి ఆలమందలకు, జంతువులకు, పక్షులకూ తాగడానికి నీళ్ళు లేనట్టయింది. పంటలు లేకపోవటంతో కరువు కాలం వచ్చింది. పల్లెటూరి జనం పంటలు పండించి సమృద్ధిగా ఉంటేనే మా జీవనం సాగేది. ఆ కారణంగా మా జీవితానికే దౌర్భాగ్యం వచ్చి పడింది. నాలుగుపల్లెలు తిరిగినా ఒక్క పడి ధాన్యం దొరకటమూ గగనమైంది. కరువు వల్ల బాధితులైన జనం నాటకం, హరికథల కోసం మా వాళ్ళను పిలవటం నిలిపివేశారు.

మా సముదాయంతోపాటు మా తల్లితండ్రులకు ఈ కార ణంగా ఎక్కడలేని విచారం కలిగింది. అన్నం, నీళ్ళు లేక పిల్లాజెల్లా చావవలసి వస్తుందని, మళ్ళీ దేశాటనం చేయాలని ఆలోచించారు. ఏ దిక్కులో వర్షం, పంటలు ఎల్ల కాలం సమృద్ధిగా ఉంటాయో ఆ దిక్కులో ఈ సముదాయం చలించటం అలవాటు. మా గుంపులో మారయ్య అనే వ్యక్తి ఉండేవాడు. గంగిరెద్దును ఆడించేవాడు. అతను ఎప్పుడూ ఊరూర్లు తిరుగుతూ ఉండేవాడు. అతనికి ఏ దిక్కులో పరిస్థితులు ఎలా ఉన్నాయో తెలుసును. నా తండ్రి దగ్గర అతను, "అన్నా, మనం ఇప్పుడు హుణసూరు, పిరియా పట్టణం దాటి కొడగు, కొంగామలె తొట్టు పోదాము. అంతో ఇంతో వాన–పంట, అయ్యిం దట ఈ ఆడ బిడ్డుపాపుల్ని సాకోని బదకొచ్చు" అన్నాడు. ఆ మాటలు నాన్నకు సమంజసంగా తోచాయి. తమ ఆస్తులైన చిరుగుల చాప, విరిగిన పాత్రలు, లోటాలు మూట కట్టుకుని చిన్నచిన్న పిల్లలమైన మమ్మల్ని వెంటబెట్టుకుని హుణసూరు వైపు బయలుదేరారు. కాలి నడకనే హుణసూరు చేరాం. అక్కడే ఆరోజు రాత్రి ఓ చింత చెట్టుకింద వంట చేసుకుని, తిని అక్కడే పడుకున్నాం. మళ్ళీ ఉదయం అక్కడి నుంచి ప్రయాణం ముందుకు కొనసాగించాం. ఆడవాళ్ళు, పిల్లలు సామాన్లు సరంజాము తలల మీద పెట్టుకుని నడుస్తూ ఉంటే; నాన్న,

ఇంకా ఇతరులు దార్లో అక్కడక్కడ తారసపడే పల్లెల్లో భిక్షాటన చేసి సాయంత్రానికి మమ్మల్ని చేరుకునేవారు. ఆ రోజు చిల్కుంద దాటి కంప్లాపుర చేరాం. సంత బజారు పక్కన స్కూలు ఉంది. బజారులోని ఓ చెట్టు కింద రాళ్ళపొయ్యి పెట్టి అమ్మ, ఇతరులు వంట చేయడానికి పూనుకున్నారు. నాన్న పల్లెను చుట్టి వస్తూ నాలుగైదు ఉడుతలను వేటాడి తెచ్చాడు. అమ్మ దానితో చారు చేసి మాకు వడ్డించింది. ఆ రాత్రి ఊర్లో పదాలు పాడటానికి నాన్న ఒప్పుకున్నాడు. భోజనం చేసి పదాలు పాడటానికి వెళ్ళాడు. మేము ఉదయం నుంచి నడవ టంతో అలసిపోయి, కడుపులో ముద్దపడటం తోటే నిద్రలోకి జారి పోయాం. సామాన్యంగా ఊరికి దాసరులు వచ్చినట్టు తెలిసేదట. రాత్రి పదాలు పాడించుకోవటం, నాటకాలు వేయించటం పల్లెకారు లకు ఇష్టమైంది. కళాకారులైన దాసరులు గ్రామీణుల మనస్సులను రంజించే ముఖ్యమైన మాధ్యమంగా ఉండేవారు. మా ప్రయాణం అదే విధంగా కొడుగు ప్రధాన మార్గంలో ముందుకు సాగింది. దారికి ఇరుపక్కలా పెద్దపెద్ద రావి, మామిడి, మేడి మొదలైన చెట్లు పెరగటం మా వంటి నటరాజ సర్వీసును (కాలినడకను) ఎంచుకున్న వారికి నీడనిచ్చి పుణ్యం కట్టుకునేవి. పిల్లలమైన మేము చెట్లు, మొక్కల్లో దొరికే పత్తిపళ్ళు, కలివిపళ్ళను వెదుకుతూ దొరికిన వాటిని నోట వేసుకుంటూ కంటపడిన జంతువుల, పక్షుల వైపు రాళ్ళు విసరుతూ నడవసాగాం. ఆరోజు పిరియా పట్టణ దాటి చిట్టెనహళ్ళి అనే ఊళ్ళో బస చేశాం. మా ఊరి నుంచి ఈ ఊరి వరకు కేవలం కరువు కాలపు కరాళ ఛాయనే పరుచుకుని ఉంది. నడిచీ నడిచీ అలసిపోయిన మేము అక్కడే నాలుగైదు రోజులు మకాం పెట్టాం. రోజూ నాలుగైదు పల్లెలు తిరిగినా భోజనానికి కావలసిన ధాన్యపుగింజలు దొరికేవి కావు. అమ్మ అక్కడున్న పొలాల్లో పొదల్లో తిరిగి ఏవో ఆకులు, కూరలు తెచ్చి ఉడికించి మాకు పెట్టేది. సాయంత్రానికి తిరిగొచ్చిన నాన్న జోలె నిండుగా ఉంటే సంతోషం కలిగేది. లేకపోతే సగం కడుపు గురించి, రేపటి భోజనం గురించి చింత పీడించేది.

మరలా ఆ ఊరిని ఖాళీచేసి కుశాలనగర వైపు బయలుదేరాం. చిట్టెనహళ్ళిని దాటి బైలుకుప్పె చేరుతుండగా దారికి ఇరువైపులా ఉన్న వేలాది ఎకరాల స్థలంలో టిబెటియన్ నిరాశ్రితులు బస చేసిన చోటు కనిపించింది. ఆ జనం దైత్యాకారులు. వాళ్ళు తమకు సమాన బరువున్న మూటలను తమ వీపులకు కట్టుకుని దారి వెంబడి నడిచే వారు. వాళ్ళను చూస్తే మాకు ఒక విధమైన భయం కలిగేది. వాళ్ళు దేశభ్రష్టులై నిరాశ్రితులైతే మేము మా దేశంలోనే నిరాశ్రితులై తిరుగు తున్నాం. వాళ్ళను చూస్తే భయం వల్లనో, భాష తెలియని కారణం గానో వారి ఇండ్ల దగ్గర మేము మసిలేవాళ్ళం కాదు. బైలుకుప్పె దాటిన తరువాత కనిపించే మరో గ్రామమే కుప్పె. ఇది మైసూరు జిల్లా సరిహద్దు గ్రామం. మధ్యన కావేరినది ప్రవహిస్తూ ఉండి అవతలి ఒడ్డు కొడుగు జిల్లాకు చెందితే, ఇటువైపు ఒడ్డు మైసూరు జిల్లాకు చెందింది. కావేరినది వంతెన దాటి మేము కుశాలనగర చేరాం. మకాం పెట్టడానికి తగిన స్థలం వెదికి మా సామాను సరంజామాలను దింపి రాత్రికి నింపవలసిన కడుపుల గురించి దృష్టి సారించారు. అక్కడే ఓ చోట మూడురాళ్ళ పొయ్యి పెట్టి పుల్లలు, గడ్డిపరకలు ఏరుకొచ్చి నిప్పు రగిల్చి ఆ బట్టబయలు ప్రదేశంలో వీస్తున్న గాలికి అడ్డూ ఆపూ లేకుండా పొయ్యిలోని మంటలు ఎగిసిపడుతూ అటూ ఇటూ ఊగిసలాడాయి. పొయ్యికి సరిగ్గా వేడిమి తగలక వంట చేసే తల్లులను ఇబ్బంది పెట్టసాగాయి.

కుశాలనగరానికి అవతలివైపున మలెనాడు (కొండ ప్రాంతం), ఇటువైపు బయలుసీమ (మైదాన ప్రాంతం). రెండింటిని తనలో పెట్టుకుని తమ మధ్య నుంచి జీవనది కావేరి ప్రవహిస్తూ చాలా ప్రశాంతంగా ఉండేది. మాలాటి ఆశ్రయం కోరుకున్న మరికొన్ని సంచార సముదాయాలు అక్కడున్నాయి. ఈ ప్రాంతానికి రావడానికి మాకు మార్గదర్శకుడిలా ఉన్న మారయ్య తన బసవడికి (గంగిరెద్దు) రకరకాల ఆటలు నేర్పి తాను ఊదే సన్నాయి నాదానికి తగినట్టు అది ప్రతిస్పందించటాన్ని దానికి నేర్పాడు. ఆ బసవన్న కొమ్ములకు రంగురంగుల బట్టల కుచ్చులు కట్టి, ఇక కొమ్ముల చివరలకు ఇత్తడి పొన్నులు పొదిగి, దాని మెడలో గజ్జెల దండ, ఆ దండ మధ్యన ఒక పెద్ద గంట, బసవన్న నాలుగు కాళ్ళకు మువ్వల సరాలు కట్టి, దాని ఒంటి మీద రకరకాల రంగురంగుల బట్టలు వేసి అలంక రించాడు. ఆ బసవన్న రాజగాంభీర్యంతో ఊరి వీధిలో గజ్జెల చప్పుడు చేస్తూ నడుస్తుంటే వీధి అరుగుల మీద కూర్చున్న జనం నుంచుని చేతులు జోడించేవాళ్ళు. మారయ్య ఒక పల్లెకు వెళితే మా నాన్న మరొక పల్లెకు వెళ్ళేవాడు. ఆ పల్లెను తప్పించి ఈ పల్లెకు, ఈ పల్లెకు కాకుండా ఆ పల్లెకు – ఇలా చాలా రోజుల వరకు కుశాలనగరం చుట్టుపక్కల ఉన్న పల్లెలన్నింటిని తిరిగి తిరిగి దారిని అరగదీశారు. నదికి వెళ్ళి గాలం వేసి చేపలను, తాబేళ్ళను పట్టేవాళ్ళు. నది ఒడ్డున పురుగుపుట్రా తినడానికి వచ్చే పక్షులను 'పాజి' అనే ఒక ప్రత్యేకమైన వలను నీళ్ళపై పరిచి వేటాడేవాళ్ళు. వాళ్ళు ప్రతీ రోజు తాగే సారాలో నంజుకోవడానికి మాంసం, చేపలు ఉండేవి. పిల్లలను తమ వెంబడి సారా అంగడికి పిలుచుకుని వెళ్ళి ఒక్కింత సారా తాగించి, చీకులు తినిపించి రుచి చూపించేవారు.

**–ఇంకాఉంది**



విశాఖపట్నం ప్రేమసమాజం హాలులో కొట్టి రామారావు (అధ్యక్షుడు, ఆంధ్రసారస్వత సమితి, మచిలీపట్నం) గారి అభినందన సభలో ప్రత్యేక సంచికను విడుదల చేస్తున్న బి.ఎల్.నారాయణ, డా॥ఏ.గోపాలరావు, ఎం.వి.రమణ, కొట్టి రామారావు, భానుకుమార్, బాలి, ఎస్.ప్రభాకరరావు గార్లు.

-మధురాంతకం నరేంద్ర, 98662 43659

# తెలుగు కథానిక- విశిష్టత

**'కథ' అనేది మానవుల ఆదిమ గుహాయుగం నుంచే వున్నా, 'కథానిక' 'చిన్నకథ' అని యిప్పుడు పిలుస్తున్న సాహిత్య ప్రక్రియ మాత్రం పాశ్చాత్య దేశాల్లో 19వ శతాబ్ది ప్రారంభంలో పుట్టింది. దీనికి మూలమైన కథలూ, గాథలూ, పుక్కిటి కథల్ని పేర్కొంటూ పాశ్చాత్య విమర్శకులు చాఫర్ కాంటర్ బెరీటేక్స్‌నూ, బొకాచియో 'డెకమెరాన్'నూ, యింకా పాతకాలంనాటి హోమర్ వొడెస్సీ, యూలిసెస్ పురాణాలనూ పేర్కొంటారు. ఆ మాటకొస్తే భారత రామాయణాలూ, కథా సరిత్సాగరం, బృహత్‌కథామంజరి లాంటి భారతీయ గ్రంథాల్లో కథలను గూడా ఆధునిక కథానికకున్న పాత రూపాలుగా గుర్తించి తీరాలి.**

'ఆధునిక సాహిత్య విమర్శ పాశ్చాత్యదేశాల్లోనే బాగా రూపొంద డమూ, యీ రంగంలో ఆధునిక భారతీయ లక్షణకారులు చురుకుగా లేకపోవడమూ అలా గుర్తించకపోవడానికి ముఖ్యమైన కారణం.

ఆధునిక కథానికను గురించి చర్చించినప్పుడల్లా దాన్ని గొప్ప సాహిత్య ప్రక్రియగా తీర్చిదిద్దిన మహా రచయితలుగా ఎడ్గార్ ఎలాన్ పో, ఆంటోన్ చెకొవ్, గైడీ మపాసా, ఓహెన్రీలను యెక్కువగా పేర్కొం టారు. తరువాత సోమర్సెట్‌మాం, జేమ్స్‌జాయిస్, యెర్నెస్ట్ హెమింగ్వే, గోగోల్ లాంటి వాళ్ళను గుర్తిస్తారు. యీ జాబితాలోకి రవీంద్రనాథ్ టాగూరును చేర్చకపోవడానికి గూడా, ఆధునిక భారతీయ విమర్శ వెనకబాటుతనమే కారణం. దాదాపుగా మపాసా, చెకోవ్‌లకు సమ కాలికుడైన రవీంద్రనాథ్ ఠాగూరు, మరే యితర రచనలు చేయక పోయి వుండినా, ఆయన రాసిన వందకు పైగా కథలు ఆయనను గొప్ప సాహితీ వైతాళికుడిగా నిలబెట్టగలిగి వుండేవి.

కథానిక' ప్రక్రియలో సుప్రసిద్ధులై, కళాస్రష్టలుగా గుర్తింపు పొందినవాళ్ళు చాలామంది కనిపిస్తారు. యింతకూ యిటువంటి కళాస్రష్ట లెవరన్న విషయాన్ని కాలమే స్పష్టంగా నిరూపిస్తుంది. సమ కాలీన కాలంలో బాగా ప్రాచుర్యమున్న కథకులు కొందరు ఆ తరువాత అంత గొప్పవాళ్లుగా గుర్తించబడకపోవచ్చు. సమకాలీన కాలంలో అంతగా గుర్తింపు పొందని రచయితలు ఆ తరువాతి కాలాల్లో ప్రాచు ర్యాన్ని పొందవచ్చు. అయితే పో, చెకోవ్, మపాసా, ఓహెన్రీ, ఠాగూరు లాంటి వాళ్ళ రచనా ధోరణుల్ని పరిశీలించి, కళాస్రష్ట అంటే ఎలా ఉండాలో తెలుసుకోవచ్చు. వీళ్ళందరూ తమ చిన్నతనం నుంచీ, మరణించే వరకూ నిరాటంకంగా,సాహితీ సృజన చేసిన వ్యక్తులు. మానవుడి బహిరంగ జీవితం గురించి 'పో' రాసిన గ్రాటెస్క్యూ, అరబెస్క్యూ కథలు అపరాధ పరిశోధక కథలకు ప్రారంభాలు. అలాగే మానవుడి ఆంతరంగిక జీవితపు మారుమూల ప్రాంతాలను సైతం శోధించిన 'పో' కథల ప్రాముఖ్యత క్రమక్రమంగా పెరుగుతూనే వుంది. అనేకమంది మానసిక శాస్త్రవేత్తలపైన ఆయన ప్రభావం వుంది. డాస్టోవిస్కీ వంటి మహా రచయితలు సైతం ఆయన ప్రభా వంలో పడ్డారు. చెకోవ్ వాస్తవిక ధోరణిలో మానవుల ఆశలు, ఆవే శాలు ప్రతిభావంతంగా చిత్రించి తరువాత తరం రచయితలకు మార్గదర్శకుడయ్యాడు. మానవ జీవిన వైచిత్రిని, సాంఘిక జీవనం లోని హద్దులనూ, ప్రాకృతికమైన పద్ధతిలో చిత్రించిన మొపాసా కథలు నిత్యనవీనంగా వుంటాయి. నగరాల్లోని మధ్యతరగతి వ్యక్తుల ఆరాటాలను ఆసక్తికరమైన కథలుగా మలచిన ఓ హెన్రీ తనదైన విశిష్టమైన పద్ధతిని ప్రవేశపెట్టాడు. యీ కొలబద్దలతో కొలిచినప్పుడు ప్రపంచ సాహిత్యంలో చాలామంది కళాస్రష్టలు కనపడతారు. ఇంగ్లీషులో కిప్లింగ్, మాం, జేమ్స్‌జాయిస్, ఆర్థర్ కానన్‌డయల్, హెచ్.జి.వెల్స్, అమెరికాలో పో, ఓహెన్రీ, హెన్రీ జేమ్స్, హెమింగ్వే, ఫ్రెంచిలో మపాసా, రష్యాలో తుర్గనేవ్, చెకోవ్, గోగోల్, గోర్కీ టాల్‌స్టాయ్, లాటిన్ అమెరికా రాజ్యాల్లో మార్క్వెజ్ బోర్జెస్...యీ జాబితా పెద్దదే!

భారతదేశంలో ఇలాంటి విశిష్ట కథకులు చాలామందే కని పిస్తారు. బెంగాల్‌లో రవీంద్రునితో పాటు శరత్‌చంద్ర చటర్జీ, మహా శ్వేతాదేవి, బిబూతి భూషణ్ బందోపాధ్యాయ, ఆశాపూర్ణాదేవి, హిందీలో ప్రేంచంద్, సాదత్ మంటో, క్రిషన్ చందర్, తమిళంలో జయకాంతన్, ఇందిరా పార్థసారథి, కన్నడంలో మాస్తి వేంకటేశ అయ్యంగార్, అనంతమూర్తి, మలయాళంలో తకజిశివశంకరపిళ్ళై, యం.టి.వాసుదేవన్ నాయర్, వైకం బషీర్ వంటి కథకులు ఇతర ప్రాంతాలలో గూడా వారి పుస్తకాల అనువాదాల ద్వారా పరిచితులు. ఇలా గమనించినప్పుడు యే భాషలోనయినా కళాస్రష్టలనదగిన కథ కులు అయిదారు మందే కనబడుతున్నారు. కానీ తెలుగులో మాత్రం ఇటువంటి కథకులు పదికి పైగా వున్నారు. ఇదొక అరుదైన విషయం. నిజానికి ఇదొక ముఖ్యమైన చర్చనీయాంశం. వివాదాస్పదమైనది గూడా! ముందుగా కళాస్రష్ట అని గుర్తించడానికున్న కొలమానా లేవన్నది ప్రశ్న. ఆ తరువాత వో రచయిత కళాస్రష్ట యెందుకవుతాడు, లేకపోతే యెందుకు కాడు, అన్నది ప్రశ్న. సాహిత్యంలోని అనేక ప్రశ్నలకు శాస్త్రీయమైన సమాధానాలు దొరకవు. ఈ ప్రశ్నలకు కేవలం రకరకాల వేర్వేరు సమాధానాలు మాత్రం దొరుకుతాయి. ఈ చర్చను ఎంత నిర్మోహతతో, ఎంత అవలోకనతో జరిపారన్న విషయంపైనే దాని సమాధానాలుంటాయి. సహజంగా మానవులందరూ ఉద్రేక పరులు గావడంతో ప్రతి భాష వాళ్ళు తమ భాషా సాహిత్యంలోనే ఎక్కువమంది కళాస్రష్టలున్నారని నమ్మవచ్చు.

గురజాడ అప్పారావుకు ముందు చాలామంది కథలు రాసినా, ఆయన దిద్దుబాటుతో సహా చాలా కథలు ఆధునిక కథానికకు దిద్దు బాటలు గానే యిప్పుడు గుర్తిస్తున్నారు. ఆయన రాసిన మిగిలిన 4 కథలు- ముఖ్యంగా 'మీ పేరేమిటి?' ఆధునిక తెలుగు కథకున్న గొప్ప ప్రారంభాన్ని నిర్ద్వందంగా నిరూపిస్తాయి.


గురజాడ


శ్రీపాద


రావిశాస్త్రి


చలం


చాసో


బలివాడ కాంతారావు


బుచ్చిబాబు

తెలుగు కథానికా స్రష్టల్లో మొదటివారు శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి గారు. ఉభయగోదావరి జిల్లాల్లోని బ్రాహ్మణుల జీవితాల గురించే ఎక్కువగా కథలు రాసినా ఆయన కథలన్నీ సార్వజనీయాలు, సార్వకాలీనాలూ. బాల్యవివాహాలూ, వరకట్నాలూ, వర్ణ వివక్షలూ మొదలైన సాంఘిక దురాచారాలను గురించే ఆయన కథలల్లారు. మంచివైపే మొగ్గుతూ, మానవత్వమే ప్రధానమని ఆయన చాటి చెప్పారు. అయితే ఆయన కథలు కేవలం ప్రచారాలు గానే గావు. గొప్ప కళాసృష్టులు గూడా. ఆయన గొప్ప శిల్ప మర్మజ్ఞుడు. సంభాషణలే ప్రధానంగా చాలా కథలు రాసినవాడు. అందువల్ల వాటిలో నాటకీయతతోపాటు వాస్తవికతా వుంటుంది. కేవలం సంభాషణల ద్వారా ఆ పాత్రలను పాఠకుల మనోనేత్రాల ముందు నిలబెట్టగలిగే నేర్పు ఆయనది. కళలో పరిపూర్ణత కోసం ఆయనెంతో పరిశ్రమ చేశాడనీ, చాలా కథల్ని అవి మరో ముద్రణకు వచ్చినపుడంతా తిరగరాశారనీ కొందరు చెబుతారు.

వస్తువులో వుండే విప్లవాత్మక కథల్నెంత కళాత్మకంగా తీర్చిదిద్దుతాయో చలం కథల్ని చదివితే తెలిసొస్తుంది. అగ్నిపర్వతంలా ఆవేశపడే కథకుడు, పాఠకుల్ని ఊపిరాడనివ్వకుండా ఎలా కట్టిపడేయగలడో చలం నిరూపిస్తాడు. స్త్రీ స్వేచ్ఛ కోసం ఆయనొక ఉద్యమంలా సాగించిన కథాయజ్ఞం అనితర సాధ్యమైంది. అందువల్ల ఆయన కథలు గొప్ప ప్రభావాన్నీ (effect) శిల్పాన్నీ (structure) సాధించాయి. ఆయన రాసిన 'ఓ పువ్వు పూసింది' ప్రపంచ సాహిత్యంలోని అనర్ఘ రత్నాల్లో తప్పకుండా చేరుతుంది.

> ***తెలుగులో ఉన్నంతమంది మార్గదర్శకులూ, మార్గ నిర్ణేతలు అయిన కథానికా కళాస్రష్టలు, మరే యితర భాషలోనయినా వున్నారా అన్నది ప్రశ్న. బహుశా లేరేమోననీ, వున్నా అటువంటి భాషా సాహిత్యాలు చాలా చాలా తక్కువనీ నా నమ్మకం. ఈ విషయాన్ని విమర్శకులు పట్టించుకుని నిగ్గుదేలిస్తే బావుంటుంది. ఇటువంటి మహా రచయితల రచనలు అనువాదాల ద్వారా మరింత విస్తృతమైన ప్రపంచానికి చేరువయినప్పుడు ఆ పని మరింత సులభసాధ్యమవుతుంది.***

కథానికకు శాస్త్రీయమైన ఆలోచనా పద్ధతిని నేర్పించినవాడు కొడవటిగంటి కుటుంబరావు. ఆడంబరాలు లేని నిరలంకారమైన వచనం ఆయనది. రంగులేమీ పులమని వాస్తవికతే ఆయన కథల వస్తువు. జీవితాన్ని ప్రభావితం గావించే చలన సూత్రాలేవో తెలుసుకొని, వాటిని పసిగట్టి చూపేటట్టుగా కథలు రాయటం ఆయన ప్రత్యేకత. తన జీవితానికొక ఉపనదిలా, చివరివరకూ, కథా రచనను కొనసాగించి తన సమకాలీన జనజీవితాన్నంతా సాహిత్యీకరించే పనిని చిత్తశుద్ధితో కొనసాగించినవాడు కుటుంబరావు. శిల్పమర్మజ్ఞత దృష్ట్యా గూడా ఆయన రాసిన నాలు గయిదు వందల కథలు గొప్ప కథలు.

తెలుగు కథకు కార్యగౌరవం చేకూర్చిన కథకుల్లో బుచ్చిబాబు ముఖ్యుడు. పాశ్చాత్య సాహిత్యాన్నంతా అధ్యయనం చేసి, జీవితాన్ని, సాహిత్యాన్నీ కళాత్మకంగా మలచుకోవడంలోనే కృషి చేసిన కళాపిపాసి ఆయన. ప్రకృతీ, స్త్రీ ఆయనకెంతో ఇష్టమైన అంశాలు. స్త్రీ పురుష సంబంధాల్లో వుండే వైచిత్రినంతా ఆయన కథలుగా మలిచాడు. మానవ ప్రవృత్తిని నియంత్రించే శక్తులను గురించిన విచికిత్స ఆయన సాహిత్యమంతా కనబడుతుంది. బుచ్చిబాబు సాహిత్య ప్రపంచం నిజమైన ప్రపంచంలా గాకుండా విశిష్టంగానూ, వైవిధ్యంతోనూ కనపడుతుంది. ఆయన చాలా పాత్రలు వాస్తవమైన వ్యక్తుల్లా గాకుండా భిన్నంగానూ కనబడతారు. అయితే ఆ లోకంలోకి వెళ్ళినపుడు, ఆ పాత్రలతోనే పాఠకుడు మమేకమైపోతాడు. ఓసారి ఆయన సాహిత్య ప్రపంచంలోకి వెళ్ళివచ్చిన పాఠకుడు మనస్సులోని మకిలినంతా పోగొట్టుకుని, పరిశుభ్రుడై నాగరికుడైపోతాడు. ఎడ్గార్ అలాన్ పో మనుషుల్లోని మకిలిని పట్టి చూపుతాడు. కానీ బుచ్చిబాబు మనుషుల్లోని కళాత్మకతనే చిత్రిస్తూ పాఠకులను ఆ యెత్తులకు చేరేలా చూస్తాడు. ఈ దృష్టితో చూసినప్పుడు ప్రపంచ సాహిత్యంలోనే బుచ్చిబాబుతో పోల్చదగిన కథకుడు మరొకరు కనిపించడు.

కథానికను గొప్ప కళాస్వరూపంగా మలచిన కథకుడు రాచకొండ విశ్వనాథశాస్త్రి. ఉపమానాలు వాడడంలో ఆయనకు ఆయనే సాటి. మానవత్వమే భూమికగా ఆయన రాసిన తొలినాళ్ళ కథలు ఆధునిక ఉపనిషత్తులు. వామపక్ష భూమికలతో ఆ తరువాత రాసిన కథలు 'దేశం' అనే సాంఘిక వ్యవస్థ చేస్తున్న దుర్మార్గాలపైన విరుచుకుపడిన తిరుగుబాటు జెండాలు. పాఠకుడిపైన బలమైన ప్రభావాన్ని చూపెట్టటం కోసం కథనంతా యేకోన్ముఖంగా, కవిత్వాత్మకంగా, శిల్పపరిపూర్ణతతో నడిపించడం ఆయన విశిష్టత. గొప్ప ప్రతిభావంతుడైన శిల్పి చెక్కిన అద్భుత శిల్పాల్లా ఆయన కథలన్నీ పరిపూర్ణంగా, లోపరహితంగా వుంటాయి. వస్తువూ, శిల్పమూ పరస్పర పూరకాలుగా ఎదుగుతూ అభిన్నంగా తయారుగావటంలో రావిశాస్త్రి నైపుణ్యమంతా కనబడుతుంది.

కథానికకు తెలుగుదనం నేర్పించిన కథకుడు మధురాంతకం రాజారాం. వస్తువుతోబాటూ కథానికకు రాయలసీమ జానపద శిల్పాలను గూడా సమకూర్చిన కథకుడాయన. జనజీవితంలోంచి మాయమైపోతున్న కులవృత్తులవాళ్ళను, గ్రామీణ జీవితంలో వస్తున్న మార్పులనూ, మానవ సంబంధాల్లో చోటు చేసుకుంటున్న పరాయీకరణనూ ఆయన మానవతాదృక్పథంతో, పూర్తిగా భారతీయమైన దృష్టితో చిత్రించాడు. మనుషుల్లోని మంచితనాన్ని ఆవిష్కరించేవీ, కారు చీకట్లలో సైతం మినుకుమినుకుమనే వెలుగుల్ని విరజిమ్మేవీ అయిన


కాళీపట్నం రామారావు


కొడవటిగంటి


మధురాంతకం


పాలగుమ్మి పద్మరాజు


ఆర్.వసుంధరాదేవి


మునిపల్లె రాజు


పెద్దిభొట్ల సుబ్బరామయ్య

ఆశావహమైన విషయాలపైనే ఆయన దృష్టంతా కేంద్రీకరించి వుండేది. తాను నమ్మిన మానవతా విలువలకోసం, నిశ్శబ్దంగా, ధైర్యంగా, చిత్తశుద్ధితో రచనలు చేసుకుంటూ వెళ్ళిన జీవితం ఆయనది. అందుకే ఆయన రచనలు వ్యక్తిత్వ వికాస బోధనలుగా గూడా వుంటాయి. జీవితశిల్పానికుండే ప్రాముఖ్యతలను వివరించే ఆయన కథల్లోని సాహిత్య శిల్పం గూడా విశిష్టంగా వుంటుంది.

కాళీపట్నం రామారావు గారు కథలు రాయడం చాలాకాలం కిందే ఆపినా, ఆయన రాసినవి కొద్ది కథలే అయినా అవి వాసిలో గొప్ప కథలు. కథల్ని ఆలోచనలకు భూమికగా, మానవ జీవితాలని విశ్లేషణల్లా మలచడం ఆయన ప్రత్యేకత. మానవ జీవితాన్ని ప్రభావితం చేస్తున్న అంశాల్ని లెక్కలు చేసినంత శాస్త్రీయంగా, చిత్తశుద్ధితో విడమర్చడానికి ఆయన తపనబడ్డారు. జీవన గమనంలో ఎదురౌతున్న సమస్యలపైన దృష్టిని కేంద్రీకరించి సమసమాజమనే సుందర గమ్యానికి చేరడం కోసం సామాన్యులు చేస్తున్న పోరాటాలనంతా విశ్లేషించారు.

కథానికకు భారతీయమైన కరుణ రసాన్ని సమకూర్చిన కథకుడు పెద్దిభొట్ల సుబ్బరామయ్య. మధ్యతరగతి మానవుల పోరాటాలూ, అధోజగత్తు జీవుల హాహాకారాలూ ఆయన కథా వస్తువులు. జీవన యాతనలను గమనించి ద్రవించి పోవడం ఆయన నైజం. సమాజపు అట్టడుగు పొరల్లో బడి కనబడకుండా పోతున్న వ్యక్తులనంతా ఆయన పరిచయం చేస్తాడు. సాదాసీదా ప్రాణులకు గాలి, నీరూ, నిప్పు లాంటి పంచభూతాలు గూడా దక్కకుండా పోతున్న వైఖరిని చూసి కన్నీళ్ళు కారుస్తాడు.

దాదాపుగా తన ముప్పయ్యవ సంవత్సరంలో ప్రారంభించి మరో ముప్పయ్యేళ్ళు, సంవత్సరానికొకటి రెండుగా, నలభై ఐదు కథలు రాసిన రచయిత్రి ఆర్.వసుంధరాదేవి. ప్రతి కథా ఆమెకో జీవన శకలమే. వో గృహిణి దృష్టికోణంనుంచీ, ఆమెకు పరిచయమైన చిన్న ప్రపంచంలోంచీ అసాధారణమైన జీవన తాత్వికతను ఆవిష్కరించిన అరుదైన రచయిత్రి ఆమె. స్త్రీవాద రచనలు గావడం మౌలికమైన లక్షణమే అయినా, ఆమె కథలన్నీ జీవన మౌలిక తత్వాల్ని వివరించే అపురూపమైన కళాస్వరూపాలు గూడా!

మానవీయ కథకుడుగా ప్రారంభించి, దళితోద్యమ స్ఫూర్తిగా తయారుగావడం కొలకలూరి ఇనాక్ గారి విశిష్టత. వివిధ రకాల దళితుల జీవితాల్లోని కల్లోలాల్ని చిత్రించిన ఆయన తొలినాటి కథల్లో గొప్ప సహనమూ, అభ్యుదయ శీలతా, ఆర్తీ, కళాత్మకతా మూర్తీభవించాయి. ఆ తరువాతి రచనల్లో అసహనమూ, ఆందోళనా చోటుచేసుకున్నా, అవి దళిత ఉద్యమ స్ఫోరకంగానే కొనసాగాయి. ఎప్పటికప్పుడు స్పందిస్తూ నిరంతరం రచనా జీవితంలోవే కొనసాగుతున్న సాహిత్యజీవి ఆయన.

కథకు సంక్షిప్తత ముఖ్యమని భావించి కొన్ని కథలే రాసిన చాసో, కథానికకు పాశ్చాత్య కథానికకున్న లక్షణాలన్నీ సమకూరేలా సాధన చేసిన పాలగుమ్మి పద్మరాజు, తెలుగు కథకుల్లో భవిష్యద్దర్శనం చేయగలిగిన ఏకైక కథకుడు మునిపల్లె రాజు, కథా రచనను తన జీవితానికి ఉపనదిగా కొనసాగించిన బలివాడ కాంతారావు, అమరావతి వేదికగా నూరు కథల కథామాలికలను సృజించిన సత్యం శంకరమంచి తెలుగు కథకు విశిష్టతను చేకూర్చిన కథకుల్లో ముఖ్యులు.

ముందే చెప్పినట్టుగా యిదొక ముఖ్యమైన చర్చనీయాంశం. ఈ కళస్రష్టల జాబితాలోకి ఎవరు మిగులుతారన్నది గూడా కాలం నిర్ణయిస్తుంది. అయితే తెలుగులో ఉన్నంతమంది మార్గదర్శకులూ, మార్గ నిర్దేతలు అయిన కథానికా కళాస్రష్టలు, మరే యితర భాషలోనయినా వున్నారా అన్నది ప్రశ్న.

బహుశా లేరేమోననీ, వున్నా అటువంటి భాషా సాహిత్యాలు చాలా చాలా తక్కువనీ నా నమ్మకం. ఈ విషయాన్ని విమర్శకులు పట్టించుకుని నిగ్గుదేలిస్తే బావుంటుంది.

ఇటువంటి మహా రచయితల రచనలు అనువాదాల ద్వారా మరింత విస్తృతమైన ప్రపంచానికి చేరువయినప్పుడు ఆ పని మరింత సులభసాధ్యమవుతుంది. ❋

## కదలిరా ఓ తెలుగుబిడ్డా!


ధరణీశ్వరి మరడాన
కురుపాం
ఫోను :9492853773


కవిత

ఆంగ్లాక్షరాల
పాశ్చాత్య సంస్కృతి
పదనిసలాడుతుంటే
అమ్మతనపు అమృతానికి
ఆమడదూరంలో మనమూ...
మన ముంగిట మమ్మీ డాడీలు
పరాచికాలాడుతుంటే
అల్లల్లాడిపోతున్న
తెలుగుతల్లి...!

ప్రకృతి ఒడిలో పల్లె వెలుగులో
అక్కరకు రాని ఆంగ్ల చదువులు
నేర్వమన్నను నేర్వరాని
నేర్వలేని ఆర్థిక చదువులు!
పొరుగుభాషను
పట్టుగొనవచ్చునేమోగాని
మాతృభాష మరువవచ్చునా!
మాతృభాష మకరందం
మదినిండా నింపుకొనగ

తెలుగును నిత్యనూతనం గావిద్దాం
కదలిరా ఓ తెలుగుబిడ్డా!
నీవు నేను ఏకమై
జాతిలో మమేకమై
తెలుగుజాతి మదినిండా
విజ్ఞానపు లోలకమై
తెలుగుతల్లిని ప్రపంచమంతా
ఊయలలూపుదాం
కదలిరా ఓ తెలుగుబిడ్డా!




# మెలట్టూరు భాగవత గురువు మహాలింగం గారితో...

'చోళ వళనాడు చోరుడైత్తు' అని తమిళ నానుడిలోని ఒక నుడుగు. సారవంతమైన చోళనాడు కూటికి నెలవు అని ఆ నుడుగుకు తెల్లము. పలు చీలికలై పారే కావేటినీటితో తడిచి చేవ ఎక్కిన నేల చోళనాడు. ఇప్పటి తమిళనాడులోని కొంగు, మొరసు, చోళ, తొండ, పాండె అనే అయిదు నాడులలో తెలుగువారు తక్కువగా ఉంటున్న తావు చోళనాడు. పాత తిరుచిరాపల్లి, పాత తంజావూరు జిల్లాలే చోళనాడు. ఈ తావున తెలుగువారి లెక్క తక్కువయినా, ఒకప్పుడు తెలుగు వెలుగులను విరజిమ్మిన తావు ఇది. ఆ వెలుతురు జాడలుగా ఇప్పటికీ కొన్ని చిరుదివ్వెల మినుకులు కనిపిస్తూనే ఉన్నాయి చోళనాడులో. ఆ మెరుపులలో మెలట్టూరు ఒకటి. తంజావూరుకు 22 కి.మీ. దవ్వున ఉన్న చిన్న పల్లెటూరు మెలట్టూరు. ఈవూరి అగ్రహారంలో వేసవి పున్నమినాడు తెలుగు భాగవత పొడమ జరుగుతుంది. మినుదివ్వెల విద్యుద్దీపాల మెరుపుల నడుమ కాకుండా, నూనె దివ్వెల వెలుగులలో నాటకం నడుస్తుంది. మెలట్టూరు భాగవతమేళ గురువు గారు అయిన శ్రీ ఆర్.మహాలింగం గారిని కలిసి మాటామాటా కలిపినారు ఆడపాల సుబ్బారెడ్డి గారు. ఈ మాటామంతిలో తెలుగువాణి ట్రస్టీ, రచయిత శ్రీ స.వెం.రమేశ్ కూడా పాలుపంచుకొనినారు. ఆ మాటామంతీ అమ్మనుడి చదువరుల కోసం. –సంపాదకుడు



**సుబ్బారెడ్డి :** నమస్కారమండీ మహాలింగంగారూ. మీ గురించి చెప్పండి!

**మహాలింగం :** నా పేరు ఆర్. మహాలింగం. నేను పుట్టింది ఈ మెలట్టూరులోనే. నాకు ఇప్పుడు 62 ఏళ్లు. 1966 నుండి అంటే గత ఏబైఏళ్లుగా భాగవతాన్ని ఆడుతున్నాను. పద్మశ్రీ బాలు భాగవతారుగారు నాకు భాగవతగురువు. లక్షణ లక్ష్యాలను మేళాలో చెప్పించిన వారు బాలుగారే. తంజావూరులో బావుపిళ్లైగారి దగ్గర భరతనాట్యం నేర్చుకొన్నాను. నేనూ నా కుటుంబమూ భాగవతమేళాకే అంకితమై పనిచేస్తున్నాము. నాతోపాటు నాదగ్గర నేర్చుకొన్న నాగరాజన్, గోపి, అరవింద్, ఆనంద్, స్వామినాథన్, వినోద్‌లు కూడా మెలట్టూరు భాగవత సంప్రదాయాన్ని కొనసాగిస్తున్నారు.

**సు :** మెలట్టూరు గ్రామ చరిత్రను చెప్పగలరా?

**మ :** వెయ్యేళ్ల కిందటి 'కుందవై' అనే చోళ రాణి వేసిన రాతి శాసనంలో ఈవూరిపేరు 'మిలట్టూర్' అని ఉంది. కుందవైకాలానికే ఈవూరు ఉనికిలో ఉంది. తరువాతి కాలంలో దీనికి ఉన్నతపురం, అచ్చుతపురం అనే పేర్లుకూడా ఉన్నట్లు కొన్ని శాసనాలలో కనిపించినాయి. అయినా పాత మిలట్టూరే మెలట్టూరుగా ఇప్పటికీ నిలిచిఉంది.

**సు : :** మెలట్టూరులో భాగవతమేళం ఎప్పటినుండి నడుస్తున్నట్లు ఆనవాళ్లు ఉన్నాయి?

**మ :** మెలట్టూరు, పెద్దగుడి శాసనాలు తెలుపుతున్నాయి. క్రీ॥శ॥ 1550 ప్రాంతంలో చెవ్వప్ప నాయకుడు అనే తెలుగురాజు తంజావూరికి ఏలిక అయినారు. ఆయన కొడుకు అచ్యుత రాయల కాలంలో, చోళమండలాన తెలుగు ఒక్క వెలుగు వెలిగింది. అచ్యుత రాయలు 500 తెలుగు బ్రాహ్మణ కుటుంబాలను మెలట్టూరుకు రప్పించినారు. ఇళ్లూ పంటపొలాలూ దానం చేసినారు. వారే ఇప్పటి ఈ మెలట్టూరు భాగవతాన్ని మొదలిడినవారు. అచ్యుతరాయల కాలంలోనే ఈవూరికి అచ్యుతపురం అనే పేరు కూడా వచ్చింది. 16వ శతాబ్దం నుండే ఇక్కడ తెలుగు భాగవతమేళాలు నడుస్తున్నాయి. 450 ఏళ్లకు పైబడిన చరిత్ర మెలట్టూరు భాగవతందే. ఇంకొక ముఖ్యవిషయం. గుంటూరు జిల్లా 'కాజ' గ్రామ వాసి అయిన నారాయణ తీర్థులవారు కొంతకాలం మెలట్టూరులో ఉన్నారు. వారు రచించిన కృష్ణలీలా తరంగిణి అనే సంస్కృత యక్షగానం, పారిజాతాపహరణం అనే తెలుగు యక్షగానం, ఇక్కడ నాట్యశాస్త్ర విధానంలో ప్రదర్శింపబడేవని చరిత్ర ఆనవాళ్లు ఉన్నాయి. నారాయణ తీర్థుల వారి శిష్యులైన సిద్ధేంద్రయోగి, కూచిపూడి నాట్య మహోన్నత స్థితికి కారకులు కదా. ఆ **మ**

విధంగా చూస్తే, కృష్ణాతీరంలోని కూచిపూడి, కావేరి తీరంలోని మెలట్టూరు, రెండూ దాదాపు ఏకకాలంలో పెంపొందిన తెలుగు నాట్యకళలు అని చెప్పవచ్చు.




**సు :** మెలట్టూరులో ఆడే 'ప్రహ్లాద చరిత్రము'ను రాసినవారు ఎవరు?

**మ :** పూర్వం ఇక్కడ పది నాట్యనాటకాల ప్రదర్శన జరిగేది. ఇప్పుడు అయిదుకు తగ్గింది. మెలట్టూరులో ఆడిన, ఆడుతున్న నాట్యనాటకాలను అన్నింటినీ రచించిన మహనీయుడు శ్రీ వెంకటరామశాస్త్రిగారు. కూచిపూడి నాట్యానికి సిద్ధేంద్ర యోగి ఎట్లాగో మెలట్టూరు నాట్యానికి వెంకట రామ శాస్త్రిగారు అట్లా. వారు పదకొండు నాటకాలను రచించినారు. అవి వరుసగా: ప్రహ్లాద చరిత్రము, రుక్మిణికల్యాణము, మార్కండేయ చరిత్రము, సీతా కల్యాణము, కంసవధ లేదా శ్రీకృష్ణ జననము, హరిశ్చంద్ర, ఉషా పరిణయము, ధ్రువ చరిత్రము, పార్వతీ పరిణయము, హరిహరలీలావిలాసము, శివరాత్రి నాటకము. పైవాటిలో చివరిదైన శివరాత్రి నాటకము మాత్రం పూర్తిగా దొరకలేదు. మిగిలినవి అన్నీ ఉన్నాయి.

**సు :** మొదటినుండీ ఈ భాగవతాలను బ్రాహ్మణులు మాత్రమే ఆడేవారా?

**మ :** అవును. ఆదినుండీ ఈ కళ బ్రాహ్మణ కుటుంబాలలోనే ఉంది. ఇది మొదలయినపుడు దీనిని తెలుగు బ్రాహ్మణులు మాత్రమే ఆడేవారు. ఇప్పుడు తమిళస్మార్తులమైన మేము కూడా నేర్చుకొని ఆడుతున్నాము. ఇప్పుడు మామేళంలో తెలుగు, తమిళ స్మార్తులు ఇద్దరూ ఉన్నారు.

**సు :** ఏఏ శాఖలవారు ఉన్నారండీ?

**మ :** తమిళస్మార్తులలో వడమశాఖ వారూ, తెలుగు స్మార్తులలో వెలనాటివారూ ఉన్నారు. నలభై ఏభై ఏళ్ల క్రిందట కూడా ఈవూరిలో ఈరెండు శాఖల వారూ కలిసి 300 ఇళ్లు ఉండేవారు. అందరూ బయటకి వెళ్లిపోయి, ఇప్పుడు 15 కుటుంబాలు కూడా లేవు.

**సు :** తెలుగు బ్రాహ్మణులు ఈవూరిలో కాక ఈ చుట్టుప్రక్కల ఇంకా వేరే ఊర్లలో ఉన్నారా?

**మ :** ఉన్నారు. చోళమండలంలో ఒకప్పుడు తమిళ అయ్యర్లతో సమానంగా తెలుగు అయ్యవార్లూ ఉండేవారు. వడమ, వాతిమ, అష్టసహస్రం అని మాలో శాఖలున్నట్లే, వెలనాటి, వేంగినాటి, ములికినాటి అని వారిలోనూ శాఖలుండేవి. మెలట్టూరుకు దగ్గరలోనే ఉన్న వేపత్తూరు, కరపత్తూరులు వెలనాటివారి అగ్రహారాలు. ఇప్పుడు అగ్రహారాలన్నీ ఖాళీ అయిపోతున్నాయి. అందరూ నగరాలవైపుకు పయనం అయిపోయినారు.

**సు :** ఇట్లాంటి నిలవరంలో ఈకళను ఎంతకాలం నిలబెట్టుకోగలరు?

**మ :** నిలబెట్టుకోవాలన్నదే మా తపన. నడుమ నడుమ ఎన్నో ఆటుపోటులు వచ్చినా ఆ నృసింహస్వామి దయతో మా కళ నడుస్తూనే ఉంది. 1930 ల వరకూ కేవలం తెలుగు బ్రాహ్మణుల దగ్గరే ఉన్న మెలట్టూరు భాగవతం, తరువాత మా దగ్గరకు వచ్చింది. కలైమామణి పి.కె. సుబ్బయ్య, కైలాసయ్యరు (మా తాతగారు) వంటి మా పెద్దలు ఈకళను తలకెత్తుకొన్నారు. ఇప్పుడు మేము కొనసాగిస్తున్నాము. అరవిందస్వామి అని ఒక సినీ హీరో ఉన్నారు కదా (రోజా, బొంబాయి సినిమాల ఫేం) వారు వడమ స్మార్తులు. వారికీ వారి తండ్రిగారికీ మెలట్టూరు భాగవతం అంటే ఎంతో ప్రీతి. వారు 1965లో ఇక్కడ కొంత చోటును వెలకు తీసిచ్చినారు. మెలట్టూరు భాగవతానికి ఒక శిక్షణాకేంద్రంగా, ఒక కళాక్షేత్రంగా ఉండాలనే తలంపుతో ఆ పనిని చేసినారు. మహాదాత నల్లి కుప్పుస్వామి చెట్టిగారు (తెలుగువారే) ఆడిటోరియాన్ని కట్టించినారు. ఇప్పుడిప్పుడే ఆంధ్రప్రాంతం నుండి మేధావులూ మాధ్యమాలవారూ మెలట్టూరు వైపుకు వస్తున్నారు. కేవలం బ్రాహ్మణుల దగ్గర మాత్రమే ఉంటే ఈకళ ఎదగదు. ఇది అందరి కళగా ఎదగాలన్నదే మా కోరిక.

**సు :** మీరేమో తమిళులు, మీకెవరికీ తెలుగు మాట్లాడడం కూడా తెలియదు. మొత్తం నాటకాన్ని తెలుగులో ఆడుతున్నారు, ఎట్లా? (మాటలు ఇంగ్లీషులో జరుగుతున్నాయి)

**మ :** ముందే చెప్పినట్లు 1930 వరకూ ఈ నాటకాలను తెలుగు బ్రాహ్మణులే ఆడేవారు. అప్పుడు వారికి తెలుగును చదవడం రాయడం కూడా తెలుసు. మా దగ్గరకు వచ్చేసరికి నుడి ఒక చిక్కుసమ్యగానే అయింది. అయినా మేము ప్రయత్నించినాము. ఇంకా ప్రయత్నిస్తూనే ఉన్నాము. మీరు గమనించే ఉంటారు, మా తెలుగు పలుకుతీరులో ఎన్నో తప్పులు ఉండి వుంటాయి. అవి తప్పులని కూడా మాకు తెలియదు. తెలుగును తమిళలిపిలో రాసుకొని నేర్చుకోవడం వలన ఆ తప్పులు దొర్లుతున్నాయి. మా జట్టులో ఒకరిద్దరు తెలుగువారు ఉన్నా, వారికీ తెలుగులిపి తెలియదు. వారు కూడా అంతో ఇంతో తెలుగు పలుకుతీరుకు దూరం అయిపోయినారు. అయినా మేము మెరుగుపరచుకోవడానికి ప్రయత్నిస్తూనే ఉన్నాము. ఈ నడుమనే చెన్నైలో ఉంటున్న డా॥ నుదురుమాటి వెంకటదేవీప్రసాద్ గారి దగ్గర కూర్చుని కొంత దిద్దుకొన్నాము. ఇంకా దిద్దుకొంటాము.

**సు :** మీరు ఆడుతున్న నాటకాలు అచ్చులోకి అంటే పుస్తక రూపంలోకి వచ్చినాయా?

**మ :** తాళపత్రాలలో ఉండేవి ఒకప్పుడు. మా జట్టులోని పెద్దాయన శ్రీనివాసన్‌గారు, వెంకటరామశాస్త్రిగారు రచించిన ఆ తాళపత్రాలను, తంజావూరు గ్రంథాలయం నుండి సంపాదించినారు. శ్రీనివాసన్‌గారు గొప్ప సంస్కృత పండితులు,



సంస్కృత అమరకోశాన్ని తమిళంలోకి తెచ్చినవారు. సంగీత కళానిధి, వారి సాయంతో మొట్టమొదటగా 1995లో మార్కండేయ చరిత్రమును దేవనాగరి +తమిళ లిపులలో అచ్చులోకి తీసుకొని వచ్చినాము. అది అంతగా ప్రచారంలోకి రాలేదు. తెలుగు లిపులలో పుస్తకంలో తెచ్చినాము. మిగిలిన తొమ్మిది భాగవతాలను కూడా పుస్తకరూపంలోకి తేవాలన్నదే మా కోరిక.

**సు :** మీరు ఆడుతున్న నాటకంలో పాతకాలానికీ ఇప్పటికీ ఏదైనా మార్పు ఉందా?

**మ :** చిన్న మార్పు వచ్చింది. మొదట్లో మొత్తం నాటకంలో చిన్న మాటకూడా తమిళంలో ఉండేది కాదు. ఇప్పుడు రాబోయే సన్నివేశాన్ని గురించి ఒకటిరెండు నిమిషాలు తమిళంలో వివరిస్తున్నాము. ఎందుకంటే ఇక్కడ భాగవతాన్ని చూడడానికి వస్తున్న వారు అందరూ తమిళులే. అందుకే ఈ చిన్నమార్పు. అయిదారు గంటల ప్రదర్శనలో మొత్తం కలిపి ఒక పావు గంట తమిళం వినిపిస్తుంది.

**సు :** పాఠ్యంలో ఏమైనా మార్పులు వచ్చేశాయా?

**మ :** పాఠ్యంలోగానీ వచనం (డైలాగ్) లో కానీ చిన్నమార్పు కూడా లేదు. అయితే మా సంప్రదాయంలో సంగీతంలో చిన్నమార్పు ఉంది. దీనిని మీకు చెప్పాలి. మా నాటకంలో 25కు పైగా రాగాలను వాడుతున్నాము. వీటిలో కుంభకాభోజి, ఫరజు, ఆహిరి వంటి కొన్ని విరళమైన రాగాలు కూడా ఉన్నాయి. మా మెలట్టూరు భాగవతులు పాడే ఘంటారాగంలో 72 మేళకర్తలకి (వేంకటముఖిగారి కటపయాదికి) అతిరిక్తమైన స్వరస్థానాలున్నాయి. ఈనాటికీ ఇది కొనసాగుతూనే ఉంది. మా నాటకంలో 30కు పైన దరువులు, రెండు తాళ పద్యాలు, 30కిపైన భిన్న వృత్తాలలో పద్యాలు ఉన్నాయి.

**సు :** అద్దలం (మేకప్) లో ఏమైనా మార్పులు వచ్చినాయా?

**మ :** ఇదివరకు హరిదళం వంటి రంగులను వాడేవాళ్లం. ఇప్పుడు బయటి రంగులనే వాడుతున్నాం. ఇదివరకు మాలోమేమే అద్దలం వేసుకోనేవాళ్లం. ఇప్పుడు బయటివారు వేస్తున్నారు.

**సు :** ఆహార్యం(వేషధారణ) లో కూచిపూడికీ మీకూ వేరిమి ఉందా?

**మ :** చిన్న చిన్న మార్పులు తప్ప, కూచిపూడికీ, భరతనాట్యానికీ, మాకూ ఆహార్యం ఒక్కటే. యజ్ఞోపవీతం లాగా స్త్రీ పాత్రలకు ఒకవైపూ పురుష పాత్రలకు రెండువైపులా పూలదండ ఉండడం మెలట్టూరు ప్రత్యేకత. అట్లాగే భరతనాట్యానికీ, కూచిపూడికీ భిన్నమైన ముద్రలు మెలట్టూరు భాగవతంలో ఉన్నాయి.

**సు :** ఈ కళ ద్వారా మీకు ఆర్థికపరమైన లాభం ఉందా?

**మ :** లేదు లేదు, మేము సంపాదన కోసం ఆడడం లేదు. ఇందు లోని పాత్రధారులు అందరూ మంచి ఉద్యోగాలలో ఉన్నవారే. కేవలం భక్తి మార్గ ప్రచారం కోసమే మేము భాగవతాన్ని ఆడుతున్నాము. అందుకేనేమో సమాజంలో మాకళకు గొప్ప మర్యాద ఉంది.

**సు :** నరసింహస్వామి పాత్రధారి ధరించే ముసుగు గురించి చెప్పండి?

**మ :** కొయ్యాతో చేసిన ముసుగు అది. చాలా ప్రాచీనమైనది. నాలుగైదు ఏళ్లకు ఒకసారి రంగులు అద్దుతూ ఉంటాము. ఏడాదంతా నరసింహస్వామి గుడిలోనే ఉంటుంది. వైశాఖ పున్నమినాడు మాత్రమే బయటకు తీసి, నాటక ప్రదర్శనలో వాడి మరలా గుడిలోనే. పెట్టేస్తాము. తంజావూరు. చిత్రకళకు వాడే సహజరంగులనే అద్దుతాము. ఇటీవలి కాలంలో మెల

ట్టూరు బయట కూడా ప్రదర్శనలు ఇస్తున్నామే. అయితే స్వామివారి ముఖాన్ని మాత్రం బయటకు ఎక్కడకూ తీసుకొని వెళ్లము.

**సు :** ఏడాదికి ఒక్కసారే ఆడుతారు కదా. సాధన ఎట్లా చేస్తారు?

**మ :** మీరన్నట్లు ఇదివరకు ఏడాదికి ఒక్కసారే, అదీ మెలట్టూరులోనే అడేవాళ్లం. అప్పుడు వారం ముందుగానే ఒద్దికలు (రిహార్సల్) చేసుకొనేవాళ్లం. అయితే ఇటీవల బయటి ప్రదర్శనలు పెరిగినాయి. నెలకు ఒక ప్రదర్శన అయినా ఉంటున్నది. అందువల్లనే మా నటనా, ఉచ్చారణా మెరుగుపడుతున్నాయి.

**సు :** మెలట్టూరికి బయట ఎక్కడెక్కడ ప్రదర్శనలు ఇచ్చినారు? విదేశాలకు వెళ్లినారా?

**మ :** ఢిల్లీ, హైదరాబాదు, చెన్నైలలో ఇచ్చినాము. విదేశాలకు వెళ్లి ప్రదర్శించే అవకాశం ఇంకా రాలేదు.

**సు :** కూచిపూడిలాగా శాస్త్రీయ నాట్యం హోదా కోసం ప్రయత్నిస్తున్నారా?

**మ :** అవును, మెలట్టూరు శాస్త్రీయ నాట్యనాటకమే. మేము ప్రయత్నిస్తున్నాము కానీ, మా ప్రయత్నాలు చాలడం లేదు. ఆంధ్రదేశంలోని మేధావులూ, మాధ్యమాలు. ఈ విషయాన్ని పెద్ద ఎత్తున ప్రచారం చేయాలి. అప్పుడే వీలుపడుతుంది.

**సు :** కూచిపూడిలో కూడా మీలాగే మొదట స్త్రీ పాత్రలను పురుషులే వేసేవారు. ఇప్పుడు మార్పు వచ్చింది. అటువంటి మార్పు మెలట్టూరులో కూడా వస్తుందంటారా?

**మ :** స్త్రీ పాత్రలను కూడా పురుషులే వేయడం భాగవత సంప్రదాయం. ఆ సంప్రదాయం మారకూడదు అనేదే మా అభిప్రాయం. కాలపోకడలో ఏమి జరుగుతుందో చెప్పలేము కదా.

**సు :** మెలట్టూరులో కాకుండా, ఈ చోళమండంలో తెలుగు భాగవతాలు ఇంకెక్కడైనా నడుస్తున్నాయా?

**మ :** ఇదివరకు చాలా చోట్ల నడిచినట్లు ఆనవాళ్లు ఉన్నాయి. ఇప్పుడు మెలట్టూరు కాకుండా, శాలియమంగళం, తేపెరు మానల్లూరు అనే రెండు ఊర్లలో మట్టుకే నడుస్తున్నాయి. మా మూడు ఊర్లవీ విడివిడి సంప్రదాయాలు.

**సు :** భాగవతానికి సంబంధించినది కాకపోయినా, ఒక ప్రశ్న, మెలట్టూరులో బ్రాహ్మణులు కాక వేరే తెలుగు కులాలవారు ఉన్నారా?

**మ :** ఉన్నారు. 75 కుటుంబాలు కమ్మవారు, 10 కుటుంబాలు ఒడ్డెరలు ఉన్నారు. ఈవూరిలో లేరుకానీ పక్కన చాలాపల్లెలలో అరుందతీయులు కూడా ఉన్నారు.

**సు :** మెలట్టూరు భాగవతాన్ని ప్రచారం చేయడంలో మీకేవైనా ఆశయాలు ఉన్నాయా?

**మ :** భరతనాట్యానికి కళాక్షేత్రంలాగా, మెలట్టూరు కళకూ ఒక కేంద్రస్థానం ఏర్పడాలి. గురుశిష్య పరంపర కొనసాగాలి. బ్రాహ్మణేతరులు ఈ కళలోకి రావాలి. ఈ కళకు శాస్త్రీయ హోదా రావాలి. తెలుగునేలమీద విస్తృతప్రచారం జరగాలి. ఇవే మా మెలట్టూరు భాగవతమేళా నాట్యనాటక ట్రస్ట్‌వారి ఆశయాలు.

**సు :** ఈ పయనంలో ఇప్పటివరకూ మీకు తోడుపడిన వారున్నారా?

**మ :** ఢిల్లీ సంగీత అకాడమీ, ఆంధ్రప్రదేశ్ మరియు తెలంగాణ సాంస్కృతిక శాఖలు, తెలుగు విశ్వవిద్యాలయం వంటి సంస్థలు, నల్లి కుప్పుస్వామి చెట్టిగారి వంటి దాతలు తోడుపడినారు. అందరికీ ధన్యవాదాలు.

**సు :** చివరి ప్రశ్న. తెలంగాణాంధ్రల నుండి మీరు ఏమి ఎదురు చూస్తున్నారు?

**మ :** వెంకటరామశాస్త్రిగారి రచనలన్నీ వెలుగులోకి రావాలి. మెలట్టూరు భాగవతం తెలుగుకళ. దానిని తెలుగువాళ్లు ఆడుతున్నారా, తమిళులు ఆడుతున్నారా అనేది ప్రశ్నకాదు. అది తెలుగుకళ. ఆ కళకు తెలుగునేల మీద గౌరవం దక్కాలి. ఇవే మేము ఎదురు చూస్తున్నవి. ※



– పులిగడ్డ విశ్వనాథరావు

# తెలుగు, హిందీలలో బంధువుల పేర్లు- తారతమ్యాలు

తెలుగు, హిందీ భాషల్లో బంధువుల పేర్లలో కొంతమటుకు సామ్యం ఉన్నా, చాలా తేడాలు కనబడతాయి. దానికి కారణం ఆచార వ్యవహారాల్లో సామాజిక, సాంస్కృతిక సంప్రదాయాల్లో ఉన్న వైవిధ్యాలు అని చెప్పవచ్చు. బంధువుల పేర్లు సామాన్యజనాల్లో పుట్టి వాడుకలోకి వచ్చాయనడానికి ముఖ్య ఉదాహరణ తెలుగులో ఒక అన్నదమ్ముడు రెండో అన్నదమ్ముడి కొడుకును కానీ కూతురును కానీ పిలవడానికి ప్రత్యేక బంధుత్వ పేరు లేకపోవడం. మా "అన్న కొడుకు" లేక "తమ్ముడి కొడుకు" అని వివరించాలి. అదే అక్క చెల్లెలి కూతురుకు, కొడుక్కు "మేనకోడలు" మేనల్లుడు" అనే బంధుత్వ నామాలు ఉన్నాయి. మా అక్కకొడుకు, మా చెల్లి కూతురు అని అంటే ఆ ఆత్మీయత, సహజత్వం ఉండదు. నా కొడుకు కొడుకు అనడానికి నా మనవడు అనడానికీ తేడా ఉందిగా?

తెలుగులో తండ్రి అన్నని "పెత్తండ్రి" అనీ, "పెద్దనాన్న" అనీ, తండ్రి తమ్ముడిని "పినతండ్రి" లేదా "చిన్నాన్న" అనీ అంటారు. కానీ తల్లి సోదరుడు తల్లికంటే పెద్దయినా, చిన్న అయినా "మేనమామ" అని అంటారు. హిందీలో కూడా అంతే. తండ్రి సోదరుల విషయంలో తండ్రి కంటే పెద్దో చిన్నో బంధుత్వ నామాలలో స్పష్టం చేసినప్పుడు మేనమామ విషయంలో అతడు తల్లికంటే పెద్దో చిన్నో బంధుత్వ నామంలో ఎందుకు స్పష్టం చేయకూడదు? మనకి తల్లి సోదరుల కంటే తండ్రి సోదరులతో ఎక్కువ స్నేహ సంబంధాలు ఉంటాయనేనా కారణం.

తెలుగులో "మామ" అనే మాటలో అస్పష్టత ఉంది. మామ అంటే తల్లిసోదరుడు, భర్త లేక భార్య తండ్రి, మేనత్త భర్త కావచ్చు. పరిచయం చేస్తున్నప్పుడు మేనత్త భర్త లేక మేనమామ లేక మావగారు అని స్పష్టం చేయవలసి ఉంటుంది. హిందీలో మామ అంటే మేనమామ మాత్రమే. మావగార్ని ససుర్ అనీ అత్తగార్ని సాస్ అనీ, మేనత్త భర్తని ఫూఫాజీ, మేనత్తని ఫూఫీజీ లేక బువా అని అంటారు.

తెలుగులో తల్లి అక్కను పెద్దమ్మ అనీ, తల్లిచెల్లెల్ని పిన్ని అని పిలుస్తారు. హిందీలో పెత్తండ్రి భార్యను 'తాయీ' అనీ, పినతండ్రి భార్యను 'చాచీ' అంటారు కానీ తల్లి అక్కయినా చెల్లెయినా 'మౌసీ' అంటారు. 'మౌసీ' భర్తని 'మౌసా' అంటారు. తెలుగులో పెత్తండ్రి భార్య అయినా, తల్లి అక్క అయినా 'పెద్దమ్మే'. అలాగే పినతండ్రి భార్య అయినా, తల్లి చెల్లెలయినా 'పిన్నే'.

తెలుగులో సోదరి సంతానాన్ని 'మేనల్లుడు' 'మేనకోడలు' అంటారు. హిందీలో 'మేనల్లుడి'ని 'భాంజా' అనీ 'మేనకోడలి'ని 'భాంజీ' అంటారు. హిందీలో సోదరుడి కొడుకును 'భతీజా' అనీ, కూతుర్ని 'భతీజీ' అని అంటారు. కానీ తెలుగులో సోదరుడి కొడుక్కు కూతురుకూ బంధుత్వ నామం లేదు. 'అన్న కొడుకు', 'తమ్ముడు కూతురు' అని అంటూండాలి. ఇటువంటి సమీప బంధువుకు తెలుగులో ప్రత్యేక బంధుత్వ పేరు లేకపోవడం భాషాపరంగా లోటుగానే కపబడుతుంది. 'మా అన్నకొడుకు' అని అంటుంటే ఈ బంధుత్వంలోనున్న సహజత్వం, ఆత్మీయత లోపించినట్టు ఉంటుంది. 'మా మేనల్లుడు' అనడంలోనూ 'మా అక్క కొడుకు' అనడంలోనూ తేడా ఉంది కదా!

'తాత' అంటే తెలుగులో తండ్రికి తండ్రి అయినా కావచ్చు. తల్లికి తండ్రి అయినా కావచ్చు కానీ తండ్రితల్లిని 'నాన్నమ్మ' లేక 'బామ్మ' అనీ, "అమ్మమ్మ" అనీ పిలుస్తారు. తల్లితండ్రికి ఏదో ప్రత్యేక బంధుత్వ పేరు, 'అమ్మనాన్న' లాంటిది, ఉండాలిగా!

హిందీలో తండ్రితండ్రిని "దాదాజీ" అనీ, తండ్రి తల్లిని "దాదీ" అనీ అంటారు. తల్లితండ్రిని 'నానాజీ' అనీ 'తల్లితల్లిని 'నానీజీ' అనీ అంటారు.

తెలుగు స్త్రీ, భర్త అన్నను 'బావగారు' అనీ, తమ్ముడిని 'మరిది' అనీ అంటుంది. కానీ పురుషుడికి భార్య అన్న అయినా తమ్ముడు అయినా బావమరిదే. మన తెలుగు నాట మేనరికం ఆచారం ఉండడం వలన 'బావ' అనే పదానికి కూడా అనేక అర్థాలున్నాయి. మేనత్తలేక మేనమామ కొడుకు, అక్కచెల్లెలి భర్త, భార్య అన్నదమ్ముడు, అంతా బావలే.

ఉత్తరాదిన మేనరికాలు ఉండవు కాబట్టి అక్కడ అక్కచెల్లెలి భర్త ఒక్కడినే 'బావ' అంటారు. అతణ్ణి 'జీజా' లేక 'బహనోయీ' అంటారు. కూతురి భర్తని 'దామాద్' లేక 'జిమాయీ' అంటారు. భార్య అన్నదమ్ముడుని 'సాలా' అంటారు. 'సాలా' అనే మాటను హిందీలో తిట్టుగా కూడా వాడుతారు. అలాగే 'ససుర్' అంటే మావగారు, 'సాస్' అంటే అత్తగారు, 'ససుర్'ను 'ససురా' అనీ 'సాస్'ని 'ససురీ' అంటే తిట్లుగా మారుతాయి. దీని వెనుక స్త్రీ పుట్టింటి వాళ్ళ పట్ల ఆ స్త్రీ అత్తింటివారికున్న చులకన భావం వ్యక్తం అవుతుంది. ఉత్తరాదిన కొన్ని ప్రాంతాల్లో కొన్ని కులాల్లో ఆడశిశువు పుడితే హత్య చేయడంలాంటి ఆగడాలు జరుగుతుండేవని వింటుంటాం. ఇంటికి కోడలు తెచ్చుకోవచ్చు కానీ తమింటి ఆడబిడ్డ మరో ఇంటికోడలుగా వెళితే తాము ఆమె అత్తవారికి అణిగిమణిగి ఉండాలనే అర్థంలేని అహంకారమే ఈ దురాచారానికి కారణం.

ఉత్తరాదిన కోడలు, అల్లుడు అత్తవారి కుటుంబంతో మమేకం అయేటట్టు ఓ ఆదర్శ సంప్రదాయం పాటిస్తారు. భర్త కుటుంబీకులను భర్త ఎలా పిలుస్తాడో కోడలు కూడా అలాగే పిలుస్తుంది. భర్త మామగారిని బాబూజీ (నాన్నగారు) అనీ, అత్తగారిని 'అమ్మా' లేక 'మా' అని పిలిస్తే కోడలు కూడా మావగార్ని 'బాబూజీ' అనీ, అత్తగార్ని 'అమ్మాజీ' లేక 'మాజీ' అని పిలుస్తుంది. బావగార్ని భర్త లాగే 'భాయీసాహెబ్' అనీ 'మరిది'ని పేరు పెట్టో లేక "లాలాజీ" అని పిలుస్తుంది. ఐతే బావగారిని నేరుగా పిలవడం ఆచారం కాదు కాబట్టి

పరోక్షంగా మాటల్లో ఆయన ప్రసక్తి వచ్చినప్పుడు 'భాయిసాబ్' అంటుంది. అలాగే భర్త కూడా మావగార్ని ఎదురుగా 'బాబూజీ' లేక 'పితాజీ' అనీ అత్తగార్ని 'మాతాజీ' అని సంబోధిస్తాడు. అత్తారింటి ఆడపడుచులని కోడలు భర్త పిలిచినట్టే పిలుస్తుంది. భర్త అన్న భార్యని 'భాబీజీ' (వదినగారు) అంటే ఆమే అలాగే పిలుస్తుంది.

అత్తగారు కోడలుని 'బహూ' (కోడలా) అని పిలుస్తుంది. కోడలు మావగారు, బావగారు (భర్తఅన్న) తదితర మగపెద్దవాళ్ళ ఎదుట చీరకొంగును తలమీదుగా మొహం మీదకు ముసుగ్గా వేసుకుని వచ్చే సంప్రదాయం ఉంది. ఆమె వాళ్ళతో నేరుగా మాట్లాడకూడదు. కోడలున్న చోటునుంచి మావగారు, బావగారు కాని వెళ్ళవలసి వస్తే వాళ్ళు కొద్దిగా దగ్గి కోడలు ముసుగు వేసుకునే అవకాశాన్ని కల్పిస్తారు. ఇప్పుడైతే పెద్ద ఊళ్ళలో ఈ సంప్రదాయం మార్పు చెందుతోంది కానీ కొన్ని జాగాల్లో ఇప్పటికీ కొనసాగుతోంది.

తెలుగులో అక్క భర్త స్త్రీకి బావ అయితే భర్త అన్నగారూ బావే, కానీ హిందీలో భర్త అన్నగారి భార్య 'జేర్' అయితే అక్కభర్త, చెల్లెలి భర్త 'బహనోయీ'గా అవుతారు. భర్త తమ్ముడు 'దేవర్' అతడి భార్య 'దేవరానీ' భర్త అన్నగారి భార్య 'జెరానీ' అవుతుంది. తెలుగులో భర్త అన్నగారి భార్య, మరిది భార్య కూడా తోటికోడళ్ళు. హిందీలో బావమరిది భార్యకు కూడా. బావమరిది భార్య అక్కచెల్లెలు వరసవుతుంది. బావమరిది భార్య అని వివరిస్తారు.

తెలుగులో 'బావ'కు మాదిరే 'వదిన' అనే పదానికి అనేక అర్థాలున్నాయి. అన్న భార్య– భార్యకు అక్క, తనకంటే వరుసలో పెద్దయిన మేనత్త మేనమామ కూతుళ్ళు వదినలే. వయసులో తనకంటే చిన్నవాళ్ళైన మేనత్త మేనమామ కూతుళ్ళను భార్య చెల్లెలు, తమ్ముడి భార్యను మరదలు అంటారు. ఉత్తరాదిన అన్న భార్య, భార్య అక్క 'భాభీ' (వదినలు) అవుతారు. మేనత్త మేనమామ పిల్లలు పురుషులకూ, స్త్రీలకూ, సోదరీ సోదరులవుతారు. భార్యకు అక్కచెల్లెలు 'సావ' అయితే తోడల్లుడిని 'సాఢూ' అంటారు. తోడల్లుడిని అన్నదమ్ముడి వరసనే చూస్తారు. ఇంటి కోడలికి భర్త అక్కచెల్లెలు 'ననద్' (ఆడపడుచు) అవుతుంది. ఆమె భర్త కోడలుకి 'ననదోయీ' అవుతాడు.

హిందీలో కొడుకు కొడుకుని 'పోతా' అనీ కొడుకు 'కూతుర్ని' 'పోతీ' అని అంటారు. కూతురి కొడుకుని 'నాతీ' లేక 'నవాసా' అనీ కూతురి కూతుర్ని 'నాతిన్' లేక 'నవాసీ' అంటారు. తెలుగులో కొడుకు పిల్లలైనా, కూతురు పిల్లలైనా మనవరాళ్ళే.

తెలుగులో బావ, వదిన, మరదలు లాంటి బంధుత్వ నామాలకు అనేక అర్థాలు ఉన్నట్టే అత్త అంటే మేనత్త, మేనమామ భార్య, భార్య లేక భర్త తల్లి అనే అర్థాలు వస్తాయి. హిందీలో మేనత్తను 'ఫూఫీ' లేక 'బువా' అనీ, భార్య తల్లిని లేక భర్త తల్లిని 'సాస్'– మేనమామ భార్యని 'మామీ' అని అంటారు. మేనత్త మేనమామ పిల్లలు అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళ వరస అవుతారు. మేనత్త భర్తను 'ఫూఫా' అంటారు.

ఇంగ్లీషుతో పోలిస్తే భారతీయ భాషల్లో బంధుత్వ పదాలు దండిగా ఉన్నాయి. ఇంగ్లీషులో 'అంకుల్' అంటే చిన్నాన్న, పెద్దనాన్న, మేనమామ, ఇంకా ఏ బంధువైనా కావచ్చు. అలాగే 'ఆంటీ'నూ. పాశ్చాత్యులు బంధుత్వాన్ని భేదాలని ఆట్టే పట్టించుకోరనిపిస్తుంది. ఏ బంధుత్వమైతేనే బంధువే కదా, క్రమేణా తెలిసిపోతుందిలే అని సరిపెట్టుకుంటారేమో! మనం బంధుత్వానికి ఎక్కువ ప్రాధాన్యత ఇస్తాం. పొరుగింటి వాళ్ళని, తెలుసున్న వాళ్ళని బాబాయి, పిన్నిగారు, బామ్మగారు, తాతగారు అని ఆత్మీయంగా వరస కలుపుకుంటాం. పాశ్చాత్యుల్లో చంటి పిల్లవాడు కూడా తాత ఈడువాణ్ణి "మిస్టర్ విల్సన్" అని సంబోధిస్తాడు.

బంధుత్వ నామాలు మన సామాజిక ఆచార వ్యవహారాలకు అద్దం పడతాయి. తెలుగువారిలో మేనరికాలు చాలా సామాన్యం. దాంతా మేనత్త మేనమామ పిల్లలను భార్య పుట్టింటివారి వరసన పిలుస్తారు. మేనరికం ఒకప్పుడు ఎంత తప్పనిసరి అంటే అప్పచెల్లెలు కొడుకు తన కూతుర్ని చేసుకోలేదని అన్నదమ్ముడు అలిగి ఆమెతో మాట్లాడడం మానేసేవాడు. ఐతే ఇటువంటి అంతరప్రజననం (inter breeding) వలన కలిగిన సంతానాలలో అక్కడక్కడ జన్యుపరమైన ఆరోగ్య సమస్యలు సంభవిస్తున్నాయి కాబట్టి వైద్యశాస్త్రజ్ఞులు ఈ సంప్రదాయాన్ని విడనాడడం మంచిదని సలహా ఇస్తున్నారు.

ఇప్పుడు **మనం ఆలోచించవలసిన విషయం ఏమిటంటే బంధుత్వ నామాలను శాస్త్రీయపద్ధతిలో సరిదిద్ది, లేని కొన్ని బంధుత్వ నామాలని రూపొందించడం సాధ్యమేనా అని. ఇటువంటి ప్రయత్నం భాషా పరిశోధనా సంస్థలే చేయగలవు.** తల్లి తండ్రిని "అమ్మనాన్న" అనీ, అన్నదమ్ముడి కొడుకుకు, కూతురికి మంచి పేర్లు కనుగొనవచ్చు. స్త్రీ అక్కచెల్లెళ్ళ పిల్లలకు బంధుత్వ పేర్లు లేవు. ఆమె అక్క కొడుకు అక్క కూతురు అని చెబుతుంది. ఈ బంధుత్వానికి పేర్లు ఉండాలి. మేనత్త భర్తకు కూడా బంధుత్వ నామం లేదు. అలాగే మేనమామ కొడుకూ బావే, మేనమామ కొడుకూ బావే. వీటికీ వేర్వేరు బంధుత్వ నామాలు ఉండాలి. తమ్ముడి భార్యనీ, భార్య చెల్లెలినీ మరదలే అంటారు. అలాగే మేనమామ, మేనత్త కూతుళ్ళు వయస్సులో తనకంటే చిన్నవాళ్ళైతే మరదళ్ళు అంటారు. ఈ బంధువులకి వేర్వేరు పేర్లుండాలి.

కొత్తగా రూపొందించిన బంధువుల పేర్లను అచ్చు మీడియా, ప్రసారమీడియాల ద్వారా వ్యాప్తిలోకి తెచ్చే ప్రయత్నం చేస్తే క్రమంగా అవి వాడుకలోకి కూడా రావచ్చు. ❋

## సవరణ

అమ్మనుడి మే నెల సంచిక 45వ పుటలో కార్టూన్‌కు పై భాగాన చివరి నుంచి 3 వరుసలో **'మహా.....తీసుకోవాలా వద్దా?'** అన్న దానిని **'మహ ప్రాణాలను తీసుకోవాలా వద్దా?'** అని చదువుకోవాలని విన్నపం. ఇబ్బంది కలిగించినందుకు క్షమించండి. –సంపాదకుడు

ఏ రాష్ట్రంలో ఉన్నా,
ఏ దేశంలో ఉన్నా
తెలుగువాళ్ళంతా ఒక్కటే

–చలసాని నరేంద్ర

# జాతీయపార్టీలలో సైతం పెరుగుతున్న ప్రాంతీయపార్టీల ధోరణులు

**బిజెపి ఒక రాష్ట్రంలో ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయగలిగినా ఐదు అసెంబ్లీలలో కలిపితే రెండు రాష్ట్ర ప్రభుత్వాలను కోల్పోయిన కాంగ్రెస్ పార్టీ బిజెపి కన్నా ఎక్కువ అసెంబ్లీ సీట్లు గెలుచుకోవడం గమనార్హం. మరో వంక ఈ రెండు జాతీయపార్టీలు కలసి గెలుచుకున్న అసెంబ్లీ సీట్ల కన్నా రెండు రెట్లు ఎక్కువగా ప్రాంతీయ పార్టీలు గెలుచుకున్నాయి. అంటే ఈ ఎన్నికలలో జాతీయ పార్టీలు చాలా పరిమితమైన పాత్ర మాత్రమే పోషించాయి. కాంగ్రెస్‌కు ఐదు రాష్ట్రాలలో 115 సీట్లు లభించగా, బిజెపి 64 సీట్లు మాత్రమే గెలుచుకుంది. ఇతర పార్టీలకు 643 సీట్లు లభించగా అందులో ఈ రెండు పార్టీలతో జత కట్టని పార్టీలకు 465 సీట్లు లభించడం గమనార్హం.**



ఈ మధ్య జరిగిన ఐదు రాష్ట్రాల అసెంబ్లీ ఎన్నికలలో ఒక్క చిన్న రాష్ట్రంలో గెలుపొందగానే కేంద్రంలో అధికారంలో ఉన్న బిజెపి సంబరపడి పోతున్నది. రెండు రాష్ట్రాలలో కాంగ్రెస్ అధికారం కోల్పోగానే ఇక తాము కోరుకుంటున్న 'కాంగ్రెస్ ముక్తభారత్'ను చాలా త్వరగా సాకారం చేసుకోబోతున్నామని పండుగ చేసుకొంటు న్నారు. అయితే ఎన్నికల ఫలితాలను సునిశితంగా పరిశీలిస్తే దేశంలో జాతీయ పార్టీల యుగం పూర్తి కావస్తున్నదని, ప్రాంతీయ పార్టీల హవా నెలకొన్నదని స్పష్టం అవుతున్నది. ఈ వాస్తవాన్ని అంగీకరించ డానికి జాతీయ పార్టీలు సిద్ధపడటం లేదు.

కేరళలో అధికారాన్ని చేజిక్కించుకున్న సిపియం, ఇతర వామ పక్షాలు సహితం ఆచరణలో ఇప్పుడు ప్రాంతీయ పక్షాల స్థాయికి చేరుకున్నాయి. దేశవ్యాప్తంగా ఇంకా ఆకారం నిలుపుకోగలుగుతున్నా కాంగ్రెస్ పార్టీ కర్ణాటకలో తప్ప మరే పెద్దరాష్ట్రంలోనూ ఇప్పుడు అధికారంలో లేదు. మరో ఆరు రాష్ట్రాలలో అధికారంలో వున్నా, అన్ని రాష్ట్రాలు కలుపుకున్నా దేశ జనాభాలో 6 శాతం మించి ప్రజలు ఇప్పుడు కాంగ్రెస్ పాలనలో లేరు.

అయితే ఈ విషయంలో బిజెపి పరిస్థితి కొంతమేరకు మెరు గుగా వున్నా, ఇతర రాష్ట్రాలలో సహితం విస్తరిస్తున్నా తూర్పు, దక్షిణ రాష్ట్రాలలో ఆ పార్టీ పరిస్థితులు అంతంత మాత్రంగా ఉన్నాయి. తన మనుగడ కోసం బిజెపి సహితం ఒక ప్రాంతీయ పార్టీవలె వ్యవ



హరించటం, ఇతర పార్టీల నుండి నాయకులను దిగుమతి చేసుకోవడం తప్పడం లేదు. అస్సాంలో ఆ పార్టీ సాధించిన విజయమే అందుకు తార్కాణం.

గతంలో ఢిల్లీ, బీహార్‌లలో వలె ఢిల్లీ నాయకత్వం వచ్చి పెత్తనం చేయకుండా అభ్యర్థుల ఎంపిక నుండి ప్రచారం వరకు, ప్రచారంలో ప్రస్తావించే అంశాల వరకూ స్థానిక నాయకులకే వదిలేశారు. నరేంద్ర మోడీ ఇమేజ్ పైన కాకుండా స్థానిక ప్రజలను కదిలించే అంశాలపై దృష్టి సారించారు. ముఖ్యమంత్రి సర్బానంద సోనవాల్‌ను ఎజిపి నుండి ఐదేళ్ళక్రితం దిగుమతి చేసుకోగా, ప్రధాన వ్యూహకర్త హిమంత బిస్వాశర్మను ఆరునెలల క్రితం కాంగ్రెస్ నుండి తెచ్చుకున్నారు.

ప్రస్తుతం అస్సాంలో మంత్రి పదవులు చేపట్టిన 11 మంది బిజెపి వారిలో అసలు తొలినుండి ఆ పార్టీలో ఉన్న నాయకులు ఇద్దరు మాత్రమే. మిగిలిన వారంతా ఇతర పార్టీల నుండి వచ్చిన వారే. రెండు ప్రాంతీయ పార్టీలతో పొత్తు ఏర్పాటు చేసుకోవడమే ఆ పార్టీ విజయంలో కీలకపాత్ర వహించింది.

కేరళలో ఒక కులంతో ఏర్పాటు చేసిన పార్టీతో పొత్తు కారణంగా ఒక సీట్‌ను తొలిసారి గెలుచుకొని, గౌరవనీయ సంఖ్యలో ఓట్లు పొందారు. తమిళనాడులో అటువంటి ప్రయత్నం సాధ్యం కాకపోవటంతో బిజెపి ఎన్నికల్లో ఎటువంటి ప్రభావం చూపలేక పోయింది. ఒక విధంగా బిజెపి 10 శాతంకు పైగా ఓట్లు సాధించటం వల్లనే పశ్చిమ బెంగాల్‌లో మమత బెనర్జీ, కేరళలో సిపియం ప్రభుత్వాలు ఏర్పడ్డాయి.

బిజెపి ఒక రాష్ట్రంలో ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయగలిగినా ఐదు అసెంబ్లీలలో కలిపితే రెండు రాష్ట్ర ప్రభుత్వాలను కోల్పోయిన కాంగ్రెస్ పార్టీ బిజెపి కన్నా ఎక్కువ అసెంబ్లీ సీట్లు గెలుచుకోవడం గమనార్హం. మరో వంక ఈ రెండు జాతీయపార్టీలు కలసి గెలుచుకున్న అసెంబ్లీ సీట్ల కన్నా రెండు రెట్లు ఎక్కువగా ప్రాంతీయ పార్టీలు గెలుచుకున్నాయి. అంటే ఈ ఎన్నికలలో జాతీయ పార్టీలు చాలా పరిమితమైన పాత్ర మాత్రమే పోషించాయి. కాంగ్రెస్‌కు ఐదు రాష్ట్రాలలో 115 సీట్లు లభించగా, బిజెపి 64 సీట్లు మాత్రమే గెలుచుకుంది. ఇతర పార్టీలకు 643 సీట్లు లభించగా అందులో ఈ రెండు పార్టీలతో జత కట్టని పార్టీలకు 465 సీట్లు లభించడం గమనార్హం.

గత నాలుగేళ్లుగా జరుగుతున్న అసెంబ్లీ ఎన్నికలలో సహితం ప్రాంతీయ పార్టీలు సగంకు పైగా సీట్లు గెలుచుకున్నాయి. కాంగ్రెస్, బిజెపి కలిపి కూడా సగం సీట్లు గెలుచుకోలేకపోయాయి. గత లోక్‌సభ ఎన్నికలలో బిజెపి సొంతంగా ఆధిక్యత సాధించుకోవడం మినహా, రాష్ట్రాలలో ప్రాంతీయ పార్టీల హవా ఎక్కువగా కనిపిస్తున్నది. నేడు దేశంలో మధ్యప్రదేశ్, కర్ణాటక, రాజస్థాన్, గుజరాత్ వంటి కొద్ది రాష్ట్రాలలో మినహా అన్ని పెద్ద రాష్ట్రాలలో ప్రాంతీయ పార్టీలే చక్రం తిప్పుతున్నాయి.

బిజెపి, కాంగ్రెస్ కలిసినా దేశంలో ప్రాంతీయ పార్టీల ప్రభంజనాన్ని అడ్డుకోలేని పరిస్థితులు నెలకొన్నాయి. గడిచిన నాలుగేళ్ళ వ్యవధిలో జరిగిన 30 రాష్ట్రాల ఎన్నికలలో ఇదే స్పష్టమైనది. ఇటీవలి ఐదు రాష్ట్రాల ఎన్నికలు సహా, 2012 నుంచి 30 మార్లు దేశంలో ఎన్నికలు జరిగాయి. మొత్తం 4,117 సీట్లకు వివిధ రాజకీయ పార్టీలు పోటీ పడ్డాయి. వీటిల్లో బీజెపి 1,051 స్థానాలను గెలుచుకోగా, కాంగ్రెస్ 871 సీట్లను గెలుచుకుంది.

ఈ రెండు జాతీయ పార్టీలు కలిపి 1,922 సీట్లను గెలుచుకోగా, ఇతర పార్టీలు 2,195 సీట్లలో గెలిచాయి. వీటిలో అత్యధికం స్థానిక పార్టీలవే. వామపక్షాలు, బిఎస్పీ వంటి కొన్ని జాతీయ పార్టీలు ఉన్నప్పటికీ వాటి ప్రభావం ఒకటి రెండు రాష్ట్రాల్లో మాత్రమే కనిపిస్తుందన్న సంగతి తెలిసిందే. ఈ 30 ఎన్నికల్లో అటు బిజెపి, ఇటు కాంగ్రెస్‌తో జత కట్టని పార్టీలు 465 స్థానాలను గెలుచుకున్నాయి.

ఇక ఇదే సమయంలో ఏ పార్టీకి ఎన్ని వోట్లు వచ్చాయో లెక్క చూస్తే, ఈ నాలుగేళ్ళలో జరిగిన ఎన్నికల్లో బిజెపికి 12.6 కోట్లు, కాంగ్రెస్‌కు 11.8 కోట్లు, ఇతర పార్టీలకు 33.5 కోట్ల వోట్లు వచ్చాయి. అంటే రెండు అతిపెద్ద పార్టీలకు 42 శాతం వోట్లు మాత్రమే వచ్చాయి. మిగిలిన 58 శాతం వోట్లలో కొన్ని బిజెపి లేదా కాంగ్రెస్‌తో జతకట్టని సమాజ్‌వాది, బహుజన్ సమాజ్, తృణమూల్ కాంగ్రెస్, బిజు జనతాదళ్, ఏఐఏడిఎంకె తదితర పార్టీలకు వచ్చాయి.

**తెలుగు రాష్ట్రాలలో సహితం పరిస్థితులు అందుకు భిన్నంగా లేవు. ఇక్కడ సహితం ప్రాంతీయ పార్టీల హవా కొనసాగుతున్నది. జాతీయ పార్టీల ఉనికే ప్రమాదంలో పడింది. గత సంవత్సరం జనవరిలో రెండు తెలుగు రాష్ట్రాలలో పర్యటించిన బిజెపి అధ్యక్షుడు అమిత్‌షా 2019 నాటికి రెండు చోట్ల అధికారం లోకి రావడమే తమ పార్టీ లక్ష్యం అని ప్రకటించారు. అయితే అస్సాం ఎన్నికల తరువాత పార్టీ ప్రధాన కార్యదర్శి రామ్ మాధవ్ మాటల్లో అటువంటి విశ్వాసం కనబడలేదు. తెలంగాణలో ప్రధాన ప్రతిపక్షంగా మారే అవకాశం ఉన్నదని, ఆంధ్రప్రదేశ్‌లో బలం పెంచుకుంటామని మాత్రమే అన్నారు. ప్రస్తుతం కర్ణాటకలో మినహా దేశంలో మరే రాష్ట్రంలో బిజెపి కొత్తగా అధికారంలోకి వచ్చే పరిస్థితులు కనబడటం లేదు.**

జాతీయ పార్టీలు సహితం తమ రాజకీయ మనుగడ కోసం ప్రాంతీయ పార్టీలను ఆశ్రయించడమే కాకుండా, విధానాలలో వాటితో పోటీపడే ప్రయత్నం చేస్తూ ఉండడంతో దేశంలో రాజకీయ పార్టీల మధ్య విధానాల అంతరం తొలగిపోతున్నది. ప్రజలను ఆకట్టుకోవడం కోసం కులం, మతం వంటి సంకుచిత ధోరణులను ఆశ్రయించడంతో పాటు ప్రచార ఆర్భాటాలపై దృష్టి సారిస్తున్నారు.

పేద ప్రజల పార్టీ అని చెప్పుకొనే సిపియం సీనియర్ నాయకుడు పి.విజయన్ కేరళ ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేసిన రోజున ఢిల్లీలో ఆంగ్ల పత్రికలలో భారీ నిధులు వ్యయం చేసి జాకెట్‌గా నిలువెత్తు బొమ్మతో ప్రకటనలు జారీ చేశారు. నరేంద్రమోడీ ప్రభుత్వం రెండేళ్ళ అధికారం పూర్తి చేసుకొంటున్న సందర్భంగా ప్రచార ఆర్భాటాల కోసం సుమారు రు.1,000 కోట్ల మేరకు వ్యయం చేస్తున్నారని ఆరోపణలు వచ్చాయి.

**దేశంలో ప్రాంతీయ పార్టీలన్నీ కుటుంబ పార్టీలుగా మారడం, వారసత్వ రాజకీయాలు నెలకొనడం చూస్తున్నాం.**

**కాంగ్రెస్‌లో కుటుంబ ఆధిపత్యం ఎప్పటినుండో ఉన్నది.**

**బిజెపిలో సహితం ఒకరిద్దరే అన్ని నిర్ణయాలు తీసుకుంటున్నారు. సమిష్టి నాయకత్వం అంతర్గత ప్రజాస్వామ్యం నేడు ఏ పార్టీలో కనబడటం లేదు.**

**ఈ ధోరణులు జాతీయ సమగ్రతకు, అభివృద్ధికి తీవ్ర ఆటంకం కలిగించే ప్రమాదం ఉంది.** ❊

# అమ్మనుడి- ఆదాన పదాల ఉచ్చారణ

విదేశీభాషలనుండి తమ భాషలోనికి పదాలను ఆదానం చేసు కొనే సందర్భంలో ఆయా భాషలలోని ధ్వనులను యథాతథంగా ఉచ్చరించడం ఒక పద్ధతి. ఇవి తత్సమాలు. లేదా తమ దేశంలోని పండితులు కాని బహుళ జనులు ఉచ్చరించే ధ్వనులలోనే విదేశీభాషా పదాలను పలకడం రెండవ పద్ధతి.

ఉచ్చరించే సామర్థ్యం ఉండీ, సంప్రదాయం ఉండీ గూడ ఉచ్చా రణ మీద శ్రద్ధలేక గాని, తొందరపాటువల్ల గాని, వాగింద్రియాల లోపంవల్ల గాని జనించే ఉచ్చారణ దోషాలను బహుజన వ్యవ హారంగా అంగీకరించడం మంచిదికాదు.

"తెలుగునకు వర్ణములు ముప్పది యాఱు" అని సరిపెట్టు కోకుండా "సంస్కృతమునకు వర్ణములు ఏబది" అని సూరి చెప్పాడు కదా. తరువాత మనవాళ్ళు ఆంధ్రభాషకు 56 అక్షరాలుగా అంగీకరిం చారు. ఇంత పరిపుష్టమైన భాష కాబట్టే తెలుగువారు ఏభాషా పదాన్నయినా పలకగలుగుతున్నారు. తెలుగులో లేని మహాప్రాణాలు (ఒత్తక్షరాలు) పలకడంలేదా. "నిన్ను చూస్తే నాకు చాలా బాధగా వుంది" తప్పో, ఒప్పో పలుకుతున్నారు కదా. ఎంత పల్లెటూరి వాడైనా 'కాఫీ' అంటున్నాడు గాని 'కాపీ' అనడం లేదు కదా. తరిగొండ వెంకమాంబ (పింగళి లక్ష్మీకాంతంగారు తమ ఆంధ్ర సాహిత్య చరిత్రలో ఇలాగే రాశారు) నేడు వెంగమాంబ అయింది. లోపం ఎక్కడ వుంది.

కొన్ని భాషలలో కొన్ని వర్ణాలు మాత్రమే వుంటాయి. వారు వేరే ధ్వనులను పలకడానికి చాలా కష్టపడవలసి వస్తుంది. మా తమిళ తరగతిలో రామ్ కుమార్ శర్మ ఉండేవాడు. అతను మైసూర్ లోని భారతీయ భాషా సంస్థలో తమిళం నేర్చుకోడానికి మధ్యప్రదేశ్ నుండి వచ్చాడు. 'తొల్ కాప్పియమ్' ను 'తోల్ కాప్పియమ్' అనేవాడు. తొలికావ్యం తోలు (చర్మ) కావ్యం అయింది.

తమిళభాషలో క, చ, ట, ప, లకు గ (హ) జ (శ) డ, ద, బ లకు ఒకే అక్షరం రాస్తారు. కాని ఆ భాషలో గ, హ, జ, శ, డ, డ, ద, బ ధ్వనులున్నాయి. ఏ ధ్వనిని ఎక్కడ పలకాలో వారికి తెలుసు. పదాదిలోను, ద్విత్వాలలోను పరుష అక్షరాలు పలుకుతారు. పద మధ్యమంలోను, అంతంలోను సరళాలు పలుకుతాను. వారి నుడి ప్రకారం భయం 'పయం'. భారతం 'పారదం'. మా తమిళ ఉపా ధ్యాయుడు 'మహమ్మద్ జుబేర్'ని 'మిష్టర్ సుబేర్' అనేవారు. తమి ళంలో నాపేరు 'చన్దిరశేకర రావు' అనిరాస్తే తప్పుపట్టారు. 'చన్దిర' అని దిద్దారు. తమిళులు గిడుగు రామమూర్తి పంతులు ని 'కిటుకు రామమూరితి పంతులు' అని రాసినా 'కిడుగు రామమూరిది పందులు' అనే చదువుతారు. మనకేం అనిపిస్తుందో ఆలోచించండి.

తమిళభాషలో 'చ, జ, శ లకు ఒకే అక్షరం రాస్తారు. ఐతే పరభాషా పదాలను రాయడం కోసం "స" అక్షరాన్ని కొత్తగా సృష్టించు కొన్నారు. "సా మిల్" అని రాసిన బోర్డులు గూడ వున్నాయి. అలాగే 'హోటల్' అని రాయడం కోసం 'హ'ని కొత్తగా సృష్టించుకొన్నారు. 'కిరిచ' అని రాసి 'కిరిజ' (గిరిజ) అని చదువుతారు. తమిళనుడిని అనుసరించి 'జానకి' ని 'చానగి' అని చదవాలి. పదాదిలో 'జ' పలకడం కోసం వారు 'జ' అన్న అక్షరం సృష్టించుకొన్నారు. ఇలా మరికొన్ని అక్షరాలను సృష్టించు కొన్నారు. వీటిని గ్రంథాక్షరాలు అంటారు.

పరభాషలో వుండి తమ మాతృభాషలో లేని ధ్వని ఏదైనా వుంటే దానికి దగ్గరగా వుండే మాతృభాషలోని ధ్వనిలో ఉచ్చరించడం వుంది. ఇండో ఆర్యన్ భాషలలో మూర్ధన్య ధ్వనులు (ట,డ,ళ) లేవు. ద్రావిడ భాషలలో ఉన్నాయి. ఇంగ్లీషులోని "డి" ధ్వని మన 'డ' ధ్వనికాదు. దాని ఉచ్చారణ మన డ దల మధ్యస్థంగా వుంటుంది. ఐనా మనం డ గానే పలుకుతాం. ఉదాహరణకు 'డాన్, డస్టు'. జర్మనీ నుండి వచ్చిన ఒక యాత్రికురాలు బేలూరి ఆలయంలోని 'గరుడ' వాహనాన్ని చూసి 'గరుద, గరుద' అంది. చివరి ధ్వనిని మనం 'ద' అనుకొంటాం. మాతృభాషా ప్రభావం అలాంటిది. "ఐ లవ్ మై ఇండియా" అన్న పాట వినండి. ఇండియా కాదు ఇందియా, ("అమ్మనుడి" మే సంచిక 13వ పేజి. 7) ఎరుకువ మట్టు.... మచ్చు. 'పాత ఇందియనాటి" చూడండి) అందుచేతనే "మోడీ, డిల్లీ" అని పలకడం. సవరలు 'దేశ' అన్న మన తెలుగు మాటను 'డేస' అని పలుకుతారు. దీని ఉచ్చారణ మన డ దల మధ్యస్థంగా వుంటుంది. కాని మనం 'డ' అనుకొంటాం. తి, ము, క 'ద్రావిడ (తిరావిడ) మున్నేట్ర కళ గం' లోని ళ అన్న అక్షరం పూర్వం ద్రావిడ భాషలన్నిటిలోను ఉండేది. ఇది తెలుగులో కొన్నిచోట్ల ళ గాను, మరికొన్ని చోట్ల డ గాను పరిణామం చెందింది. ళ అక్షరాన్ని ఇంగ్లీషులో 'జెడ్' గా రాస్తున్నారు. ఇంగ్లీషు నాధారం చేసుకొని 'కజగం' అని రాయడం సరైనదేనా. 'కళగం' అని రాస్తే ఉచ్చారణ తెలుగు తమిళ భాషలకు దగ్గరగా వుంటుంది.

సంస్కృత భాషాజన్యాలయిన భాషలు మాట్లాడేవారు గూడ 'ఇస్కూలు' 'లకన్' అనడం వింటున్నాం గదా. 'శంకర్ ను 'షంకర్' అనీ 'రమేశ్'ను 'రమేష్' అంటే తప్పుపట్టడం లేదు కదా. 'రోడ్' ను 'రోడ్డు' చేసుకోవడంలో తప్పులేదు. శిష్టోచ్చారణను అంగీకరించడంలో తప్పులేదు. మాతృభాషాప్రభావం ఉచ్చారణపై తప్పకుండా వుంటుంది. ఐనా ఆదాన పదాలను ఉచ్చరించేటప్పుడు వీలైనంత వరకు ఆయా భాషా ధ్వనులకు దగ్గరగా ఉచ్చరించడమే మంచిది. ముఖ్యంగా పేరుల విషయంలో దీనికి ప్రత్యేక శ్రద్ధ, కృషి అవసరం. ఒక భాషలోని ధ్వనులను ఇంకొక భాషలో రాయడం అన్నిచోట్ల కుదరదు. వినడం అనుకరించడం ద్వారా ఉచ్చారణను నేర్చుకోవచ్చు.

-రచయిత సవరభాషలో నిపుణులు, పొందూరు-శ్రీకాకుళం జిల్లా. 99496 05141

**-డా॥అల్లంసెట్టి చంద్రశేఖరరావు**

## మప్పిదాలు

మా అమ్మ ఒడిలో నేను. నా ఒడిలో అమ్మనుడి. పత్రిక పెద్దలందరికి దండాలు.

అమ్మనుడి చదువుతుంటె ఎప్పుడూ మరిచిపోలేని మా తావు బతుకు వెతలు మా కండ్లముందు కనబడతా వుండాయి. తెలుగు నుడికట్టు వ్యాసం రాసిన పెద్దలు స.వెం.రమేశ్ అన్న గారికి నిండు గుండెల మప్పిదాలు. మేము మరిచిపోయిన మా అమ్మలు, అబ్బలు, అవ్వలు, తాతలు ఇప్పటికి మాట్లాడుతున్న ఎన్నో సామెతలు, పదాలు, మాటలు ఇప్పుడు మా బుర్రకి ఎక్కుతున్నాయి. ఈ పదాలకోసమైనా ఈ పత్రికను నెలనెల చదవాల అనిపిస్తుంది.

పోస్టుమార్టం –చీరిపారకం అనే ఒక తెలుగు మాట మా వయసు వాళ్ళకి ఇప్పుడే తెలిసింది. దీని గురించి చెప్పిన హోసూరు ఆడబిడ్డ అయిన సౌరులమ్మకి మెప్పిదాలు.

మాండళిక బాష ప్రామాణిక బాష వ్యాసం చదివి మేము కూడా కాదు కాదు నేను కూడా మా తావు కథలు రాయటానికి సురువు చేసిండాను. ఈ వ్యాసం రాసిన పెద్దలు మదురాంతకం నరేంద్ర సార్‌కి నా దండాలు.

అలెమారియ అంతరంగ–కుప్పె నాగరాజు, అడపాల సుబ్బా రెడ్డి వీళ్ళిద్దరి మాటలు వింటూ వుంటే మా ఊర్లకు వచ్చే గంగెద్దోల్లు, బుడుబుక్కలవాళ్ళు వాళ్ళను చూసి, వీళ్ళు కూడ అందరి మాటల బాదకు తట్టుకొని బతుకుతున్నా వీళ్ళముందు మేము చాలా చిన్నలం. కుప్పె నాగరాజు గారి ఇంటిపేర్లు మాకూ ఆదర్శం.

ఇకపైన మా తావు కత గురువైన సంబ్లాగాడు చదివి అయ్యో నేను రాయకుండపోతినే మా కాపోలింటి కత అని యతపడితిని. అయినా నేను రాస్తాను ఇకపైన మా తావు కతలను. రచయితకు మప్పిదాలు.

**–బుజ్జరెడ్డోల్ల దినేష్,** గిరిశెట్టి పల్లి, డెంకణికోట (తాలుక)

※ ※ ※

**దూ**రదర్శన్ 'యాదగిరి' కేంద్రం 28–4–2016వ తేదీ రాత్రి 9.30 గంటల నుండి 10.30 గం.ల వరకు 'పాటల పల్లకి' అన్న కార్యక్రమాన్ని ప్రసారం చేసింది. లలిత గీతాలను ప్రసారం చేసే కార్యక్రమమిది. నాటి కార్యక్రమానికి లలిత సంగీత దర్శకులైన బండారు చిట్టిబాబు గారు మరియు గాయని రామలక్ష్మి రంగాచారి గారు నేతృత్వం వహించారు. నలుగురు గాయనీమణులు చక్కటి లలిత గీతాలను పాడారు. కార్యక్రమంలో ఏకగళ గీతాలు, యుగళ గీతాలు, పల్లెపదం, ప్రబోధ గీతాలు అన్న మూడు చుట్లను ప్రసారం చేశారు. రేడియో కేంద్రాల నుంచి ప్రసారమైన చక్కటి భావగీతాలను ఎంపిక చేసుకొని గాయనీ మణులు పాడిన తీరు శ్రోతలను కట్టిపడేసింది. నేటి చలన చిత్రాలలో వస్తున్న అసభ్యపు పాటలు వినలేక పోతున్న శ్రోతలకు ఈ కార్యక్రమం చక్కని ఊరట. అయితే ఈ కార్యక్రమంలో కొన్ని అపశృతులు…వ్యాఖ్యాత్రికి తెలుగు మాట్లాడటంలో సరియైన శిక్షణ లేకపోవటం వల్లనేమో తడబడుతూ మాట్లాడ్డం జరిగింది. పైగా కొన్ని ఆంగ్లమాటలు..సాంగ్, ఫస్ట్ రౌండ్..సెకండ్ రౌండ్..థర్డ్ రౌండ్ వంటివి తగవు. నేతృత్వం వహించిన నిపుణులు కూడా గాయనీమణులను గుడ్..ఎక్సెలెంట్..వంటి ఆంగ్లపదాలతో ప్రశంసించడం తగదు. తెలుగుపదాలున్నప్పటికీ ఆంగ్లపదాలను ఉపయోగించటం తెలుగువాళ్ళకు వ్యామోహంగా మారిపోయింది. ఈ జాడ్యం పోయేదెప్పుడో?

**–ఆర్.శ్రీనివాస్,** సింగనసంద్ర, బెంగళూరు

※ ※ ※

**2016** మే నెల అమ్మనుడిలో 'పత్రికలను దారికి తెచ్చిన దంపతులు' వ్యాసం చదివి ఆనందించాను. సునీల్‌రెడ్డి దంపతులు చేస్తున్న కృషి అభినందనీయం. సంపాదకులు మన నుడి తీరులో ఇమడని మాటల్ని కూడా మనం అనుసరించాలా? అనే ప్రశ్న వేశారు. అలా జరగకపోవడం వల్లనే మనకి బెజవాడ, రాజమండ్రి, వైజాగ్ వంటి పదాలు వచ్చాయి.వాటిని ఇప్పుడు మనం తిప్పికొడుతున్నాము. 'సీతారామయ్య' అనే పదం పలకలేక 'సత్తార్‌మియ్యా' అని ఒక భాష వారు అనడం నాకు తెలుసు. 'లతా మంగేష్కర్'ని 'లోటా మంగేష్కర్', 'భజన్'ని 'భోజన్' అని పలికే వారున్నారు. మనుషుల పేర్లు మూలభాషలో ఎలా పలికేవి అలానే రాయడం సబబు. లేకపోతే అర్థాలే వేరయ్యే ప్రమాదం వుంది. సౌలభ్యం పేరుతో స్థాయిని కించపరచకుండా రాయటం ఉచితం. ఎవరేం చేసినా భాషాభివృద్ధికి అది దోహదం చేస్తే, అభినందనీయమే.

**–పాలెపు బుచ్చిరాజు,** (వదోదరా) గుజరాత్, 98250 33646

### సొగసైన తెలుగు

కవిత

**మ**న తెలుగు సొగసులు ఘనమైనవి
మన తెలుగు మాటలు మధురమైనవి
చిలుక పలుకులు కోయిల కూజితాలు
కలగలసి అవి చిరునవ్వులైనవి

అవనిలో వెలుగొందు సాహిత్య వెలుగులు
అభ్యుదయ భావికవిత్వ మెరుగులు
పసందైన మార్గ కవిత దేశికవిత
తెలుగు భారతికివే చిరుకీర్తి శోభలు

పద్యపాదాలు విచ్చుకుంటాయి పూలరేకులా
కవి మనసును అలరిస్తాయి పరిమళంలా
సహృదయ హృదయం స్పందిస్తుంది
ఆనంద డోలికల్లో ముంచెత్తుతుంది ప్రవాహంలా

వసంతాలు కురిసే పద్యమా నీకు నీరాజనం
పద్యమార్గం చూపిన కవులారా వందిత వందనం
భాగ్యవంతమైన తెలుగు సాహిత్యం
సాహిత్యమమైక జీవనం పురాకృత పుణ్యఫలం

మానవ మనసును మేల్కొల్పుతుంది పద్యం
జీవన గమనాన్ని చూపి నడిపిస్తుంది పద్యం
అర్థం పరమార్థం అన్నీ తెలుపుతుంది
చైతన్య కాంతులతో జగమంతా నిండుతుంది పద్యం.

**–డా॥బండారు జ్యోతిస్వరూపరాణి,** 98482 11664



కనువెలుగు : 25 ఏప్రిల్ 1923
కనుమరుగు : 27 ఏప్రిల్ 2016

**త్రివేణి సంపాదకుడు ఐ.వి.చలపతిరావు కనుమరుగు**

ఉపాధ్యాయుడుగా అందరికీ ఆదర్శం ఆయన. అధ్యాపకుడుగా జీవితాన్ని మొదలు పెట్టిన దగ్గర నుండి చివరివరకూ నైతిక బాధ్యతతో నిరంతరం విద్యార్థుల శ్రేయస్సుకై కృషి చేసిన ఆదర్శజీవి, ప్రసిద్ధ 'త్రివేణి' పత్రికకు సంపాదకుడుగా రాణించిన శ్రీ ఇయ్యంకి వెంకట (ఐ.వి) చలపతిరావు గారు 93వ యేట కన్నుమూశారు. దాదాపు పదిహేనేళ్ళపాటు నడుస్తున్న చరిత్రను, ఇటీవల 'అమ్మనుడి'ని ఆయన శ్రద్ధగా చదివేవారు. ఎంతో అభిమానించి, సూచనలు చేసేవారు. నడుస్తున్నచరిత్ర సమావేశాల్లో కూడా కొన్నిటిలో పాల్గొన్నారు. తెలుగువారికి గర్వ కారణంగా మనమధ్య జీవించిన ఒక విశేషవ్యక్తి మరణించారు. ఇది మనకు తీరనిలోటు. వారికి మా శ్రద్ధాంజలి. ఈ సందర్భంగా వారితో సన్నిహితంగా కలిసి పనిచేసిన వారి సహచరులు ఆంధ్రమహిళా సభ పూర్వకార్యదర్శి, ఇప్పుడు నిరంతర వయోజన విద్యాభివృద్ధి సంస్థ(SPACE)కు కార్యదర్శి శ్రీ పి.పూర్ణచంద్రరావుగారు రచించిన వ్యాసాన్ని ప్రచురిస్తున్నాము. –సం.

# కర్మయోగి, బహుముఖ ప్రజ్ఞాశాలి

**అ**నేక సందర్భాలలో, ప్రముఖంగా ఉపాధ్యాయుల సమావేశాలలో కీ.శే.అయ్యంకి వెంకట చలపతిరావుగారు ప్రసంగిస్తూ ఉపాధ్యాయుని లక్షణాల గురించి చెపుతూ ఉండేవారు. "దేశికో నవలక్షణః – శుచిర్, వాచస్వి, ధృతిమాన్, కృతిః, ఉత్సాహి, నమ్రః జిజ్ఞాసుః" అని.

ఆ లక్షణాలన్నీ చలపతిరావుగారిలో ప్రస్ఫుటంగా కనపడుతూ వుంటాయి. వారి ప్రసంగంలో కనపరిచే వాగ్ధాటి మరియు ఏ అంశంమీద మాట్లాడుతున్నారో ఆ అంశంపై వున్న సంపూర్ణమైన అవగాహన, పట్టు, శ్రోతలను ఆకట్టుకునేవిధంగా వుంటుంది. ఎక్కడా అహంకారంగాని, అహంభావం గాని, మచ్చుకైనా కనపడదు. వారి నడవడితో, మాటతో, వ్రాతతో అందరినీ ఆకట్టుకునేటువంటి వ్యక్తి, ఆజానుబాహుడు, అందగాడు, అందరివాడు చలపతిరావుగారు.

ఆంగ్లభాషలో నాగపూర్ విశ్వవిద్యాలయంనుండి ఎం.ఏ. పట్టాను పొంది, కళాశాల ఉపాధ్యాయుడుగా తన జీవితాన్ని ప్రారంభించిన చలపతిరావుగారు ఎంతోమంది విద్యార్థినీ విద్యార్థులకు ఆంగ్లభాషపై అవగాహనను పెంచి వారిలో మరింత ఎక్కువగా విషయాన్వేషణను పెంచి వారి జీవితాలకు లక్ష్యాన్ని ఏర్పరిచారు. వారు ప్రముఖమైన, పేరొందిన పి.ఆర్. కాలేజి (కాకినాడ) ప్రభుత్వ డిగ్రీ కాలేజి (రాజమండ్రి) సి.ఆర్. రెడ్డి కాలేజి (ఏలూరు)లలో ప్రథమ ఆచార్యులుగాను, కర్నూలు ప్రభుత్వ సిల్వర్ జూబిలీ కళాశాల కర్నూలు, కరీంనగర్ కాలేజీలలో ఆంగ్లభాష ఉపాధ్యాయుడుగాను, తదనంతరం కళాశాల ప్రిన్సిపల్‌గాను స్ఫూర్తిదాయకమైన సేవలనందించి, విద్యారంగంలో ఒక ఆదర్శమైన పంథాను ప్రామాణికంగా చూపగలిగారు. చలపతిరావుగారి దృష్టిలో ఉపాధ్యాయుడు కేవలం తరగతి గదిలో పాఠాలు చెప్పే పంతులుగా ఎప్పుడూ చూడలేదు. తరగతి గదినుంచే దేశ నిర్మాణం జరుగుతుందని నమ్మిన వ్యక్తి, ఉపాధ్యాయునిలో ఒక సమాజ శిల్పిని చూడగలిగారు. సమాజానికి ఎటువంటి పౌరులను అందించాలో, ఏవిధంగా అందించాలో ఉపాధ్యాయునికి ఆకళింపు వుండాలి అని భావించారు. ఇతరులకు బోధించడమే కాకుండా, చలపతిరావుగారు తన ప్రసంగాలతో అనేక మందిని ప్రభావితం చేసి వారిలో దేశభక్తిని నింపారు.

**ఆంధ్ర మహిళా సభ – చలపతిరావుగారు**

దుర్గాబాయి దేశ్‌ముఖ్‌గారు స్థాపించిన ఆంధ్ర మహిళాసభతో చలపతిరావుగారు మమేకమైనారు అని చెప్పడంలో ఎంతమాత్రమూ అతిశయోక్తి లేదు. దుర్గాబాయి దేశ్‌ముఖ్‌గారంటే చలపతిరావుగారికి అపారమైన గౌరవం, అభిమానం. వారి జీవిత విశేషాలను, సందేశాన్ని మరియు దుర్గాబాయ్‌గారు చూపించిన అమూల్యమైన విలువలను ఆంగ్లభాషలో గ్రంథస్థం చేసి ప్రజలకు అందించారు.

ఆంధ్ర మహిళాసభ నిర్వహిస్తున్న విద్యా సంస్థలు, ఆసుపత్రి, వయోజనుల వసతి గృహము, దివ్యాంగుల కొరకు ఏర్పరచిన వ్యవస్థ, వారి పాలక మండలిలో చలపతిరావుగారు సభ్యులుగానే కాకుండా వాటికి మార్గదర్శకులుగా ఎనలేని సేవలందించారు. అంతేకాకుండా, ఆంధ్ర మహిళా సభ ప్రగతిని వివిధ రంగాలలో ఏ విధంగా, దుర్గాబాయి దేశ్‌ముఖ్‌గారు కాలం చేసిన తరువాత, జరిగిందో దానిని కూడా ఎంతో వివరంగా విపులంగా గ్రంథస్థం చేసిన మహామనీషి, ఆంధ్ర మహిళా సభలో వారికి చేదోడు వాదోడుగా కలిసి పనిచేసే భాగ్యం నాకు దక్కటం నా పూర్వజన్మ సుకృతం. ఆ కాలంలో ఆంధ్ర మహిళా సభలో నేను ప్రధాన కార్యదర్శిగా వుండటం యాదృచ్ఛికం.

**చలపతిరావుగారి మనసుకు నచ్చినవి**

1978లో చలపతిరావుగారు పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ డిప్యూటీ డైరెక్టర్‌గా పదవీ విరమణ చేశారు. వారి సేవలను ఇంగ్లీష్ అండ్ ఫారిన్ లాంగ్వేజస్ యూనివర్శిటీ వారు ఉపయోగించుకోవడం కోసం వారిని రిజిస్ట్రారుగా నియమించారు. చలపతిరావుగారు ఆ పదవిలో గణనీయమైనటువంటి సేవలనందించి పేరు ప్రఖ్యాతులు పొందారు. వారికి ఆ విశ్వవిద్యాలయ రిజిస్ట్రారు పదవి ఎంతగానో తృప్తి నిచ్చింది. బహుశా అందువల్లనేనేమో చలపతిరావుగారికి ఆ పదవి అంటే ఎంతో మక్కువ.

**ఫోరమ్ ఫర్ హయ్యర్ ఎడ్యుకేషన్**

ఉన్నత విద్య ప్రామాణికంగా వుండాలని, నాణ్యమైన విద్యాబోధన జరగాలని చలపతిరావుగారు ఎప్పుడూ ఆశించేవారు. ఆ స్థాయిలో వున్న ఉపాధ్యాయులకు మెరుగైన శిక్షణ ఇచ్చి వారిలో విశ్వాసాన్ని

(తరువాయి 44వ పుటలో...)



'తెనుగు లెంక' 'అభినవ తిక్కన'
**తుమ్మల సీతారామమూర్తి.**

# 'తెనుగులెంక' సూక్తులు-11

*కోవెలలో, గంగానది*
*రేవులలో, రామకోటి లేఖలలో, లే*
*దే వాని యెదద కరుణకు*
*నావాలం బతని యంద హరి వసియించున్*

**హిం**దువులు గుడికి వెళతారు. క్రైస్తవులు చర్చికి వెళతారు. మహమ్మదీయులు మసీదుకు వెళతారు. ఇతర మతాలకు చెందిన వారు కూడా వారి వారి ప్రార్థనా ప్రదేశాలకు వెళతారు. ఎందుకు? ఇహలోకంలో తమకు సర్వసౌఖ్యాలూ సమకూర్చుమని అడగటానికి; తీరని తమ కోరికలను నెరవేర్చుమని అడగటానికి; తాము చేసిన పాపాలను విస్మరించి తమకు మోక్షం ప్రసాదించుమని ప్రార్థించడానికి. తమ కోరికలను దేవుడు తీర్చడనే భయంతో, ఆయనను ప్రసన్నం చేసుకోవడానికి కొబ్బరికాయలు కొడతారు. మడి మాన్యాలు సమర్పించుకుంటారు. డబ్బిస్తారు. నగ నట్రా చేయిస్తారు. లంచం ఇచ్చి దేవుడి చేత పనులు చేయించుకోవాలి అని ఆశగాని, దేవుడు లంచాలకు లొంగుతాడా? లొంగితే దేవుడు ఎలా అవుతాడు?

గంగానది వంటి తీర్థాలలో మునిగినా, రామకోటి వ్రాసి దేవునికి సమర్పించినా పుణ్యం రాదు. మోక్షం అందదు. దేవుడు గుడిలో ఉండడు. నది రేవులలో ఉండడు. రామకోటి గీతలలో ఉండడు. ఉంటే గుడిలో దొంగతనాలు జరుగుతాయా? తనను తాను రక్షించుకోలేనివాడు, భక్తుల కోరికలు ఎలా తీరుస్తాడు? స్వాముల వేషాలతో భక్తులను మోసం చేసేవారిని ఎందుకు శిక్షించడు? పుణ్యం కోసమని పుణ్యక్షేత్రాలు తిరిగేవారికి అపాయాలు కలుగుతుంటే ఎందుకు సహిస్తాడు. తీర్థయాత్రలు చేస్తూనో, పుష్కరస్నానం చేస్తూనో మరణిస్తుంటే ఎందుకు చూస్తూ ఊరుకుంటాడు? ప్రజల కడుపు కొట్టి సంపాదించిన వారిని, అన్యాయాలతో కోట్లు కూడబెట్టిన వారిని, హత్యలు చేసిన వారిని ఎందుకు శిక్షించడు? మోసాలు, ద్వేషాలు, దొంగతనాలు, దోపిడీలు జరుగకుండా ఎందుకు ఆపడు? ఆకలితో అల్లాడేవారిని, సమస్యలతో సతమతమయ్యేవారిని, ఆదుకునే దిక్కులేక అనాథలుగా అలమటించే వారిని ఎందుకు చూస్తూ ఊరుకుంటాడు?

అందుకని దేవుడి కోసం గుడికి వెళ్ళినా, దేవుడిని ప్రసన్నం చేసుకోవడానికి బహుమానాలు సమర్పించినా తీర్థయాత్రలు చేస్తూ నదీస్నానాలు చేసినా, రామకోటి వ్రాసినా దేవుడు కన్పించడు. కోరికలు తీర్చడు. ఆయాపనుల కోసం వెచ్చించే సొమ్మును కళ్ళముందు కనిపించే ఆర్తుల కోసం వినియోగిస్తే ఆ సొమ్ము సద్వినియోగమవుతుంది. ఆకలితో అలమటించే వారి ఆకలి తీర్చినా, వ్యాధిగ్రస్తులకు వైద్యం చేయించినా, ప్రజలకు ఉపయోగపడే పనిని దేనిని ఆచరించినా ఎందరో లబ్ధి పొందుతారు. వారి ముఖాల్లో కనిపించే చిరునవ్వులు దాతలకు దీవెనలవుతాయి. వారి హృదయాల్లో నినదించే మోదాలు దాతలకు మోక్షాన్ని ప్రసాదిస్తాయి. వారికి సహాయపడిన వ్యక్తే దేవుడిగా కనిపిస్తాడు.

అందుకే తుమ్మల– కోవెలలో, గంగానది రేవులలో రామకోటి రేఖలలో దేవుడు లేడన్నాడు. దయతో కూడిన హృదయం ఎవరికి వుంటుందో అతనిలోనే దేవుడున్నాడన్నాడు.

'మానవసేవే మాధవసేవ' అని అందుకే అంటారు. దేవుడిని పూజిస్తే భక్తుడవుతాడు. తన సొమ్మును మానవులకు వినియోగిస్తే దేవుడవుతాడు. ఏది మంచిదో ఆలోచించుకోవాలి.

**–డాక్టర్ నాగభైరవ ఆదినారాయణ,**
98497 99711

---

## బహుముఖ ప్రజ్ఞాశాలి ఐ.వి.చలపతిరావు

(43వ పుట తరువాయి)

నింపాలనేటువంటి ఆశయంతో 'ఫోరమ్ ఫర్ హయ్యర్ ఎడ్యుకేషన్' అనే సంస్థను స్థాపించారు. దానికి వారే వ్యవస్థాపక అధ్యక్షులుగా చివరి శ్వాస విడిచే వరకూ ఆ సంస్థను నడిపారు. ప్రతిష్టాత్మకమైన కార్యక్రమాలను చేపట్టి విద్యారంగంలో రావలసిన, ఆశించిన మార్పులపై కూలంకషంగా చర్చించి, ఆ సంస్థ ఎందరికో మార్గదర్శకంగా నిలిచింది.

**ప్రకాశం పంతులుగారి జీవిత చరిత్ర**

ఎందరో అభిమానించిన ప్రజల మనిషి ప్రకాశం పంతులుగారి జీవిత చరిత్రను ఆంగ్లంలోకి తర్జుమా చేశారు చలపతిరావుగారు. ఆ గ్రంథాన్ని 1992లో నాటి ప్రధానమంత్రి శ్రీ పి.వి. నరసింహారావుగారు ఢిల్లీలో ఎ.పి. భవన్ ప్రాంగణంలో ఆవిష్కరించారు. చలపతిరావుగారిని ఘనంగా సన్మానించి వారి సేవలను ప్రధానమంత్రి ఎంతగానో శ్లాఘించారు.

చలపతిరావుగారి జీవితంలో కనపడేది ఒక విశిష్టమైన నడవడి. అది ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ మాటలలో "విజయపథం కోసం ఆరాట పడకుండా విలువలకు నిలయమవటానికి ప్రయత్నించటమే లక్ష్యంగా పెట్టుకోవాలి"

ప్రఖ్యాతి గాంచిన "త్రివేణి" ఆంగ్ల త్రైమాసిక పత్రికను 1993లో ఎంతో సాహసంతో విశ్వాసంతో పునరుద్ధరించి ఒకనాటి సాహిత్య రంగంలో 'త్రివేణి'కి ఉన్న స్థానాన్ని మరలా తెరపైకి తీసుకువచ్చారు. ఆ పత్రికలో చలపతిరావుగారు చేయితిరిగిన జర్నలిస్టుగా రూపాంతరం చెందారు. వారు 'త్రివేణి' ద్వారా వ్యాసాలతోను, సంపాదకీయాలతోను పాఠకులలో తృప్తిని, స్ఫూర్తిని నింపగలిగారు. 'త్రివేణి' త్రైమాసిక పత్రిక చలపతిరావుగారి హృదయ స్పందన.

చలపతిరావుగారు లేని లోటు ఒక అగాధం గానే మిగిలిపోతుంది.

**–పి.పూర్ణచంద్రరావు,** 92462 45770

సమీక్షలు

# స్పందన దర్పణం

*"ఆకలిపేగు, ఖాళీపర్సు- అబద్ధపు ప్రేమ*
*మనిషి జీవితంలో - చాలా పాఠాలు నేర్పించే*
*గురువులు"* - అని సామాజిక వాస్తవాలకు దర్పణంగా కవిత్వాన్ని సృష్టించిన డా॥చిల్లర భవానీదేవి గారి కవిత్వం వయస్సు నాలుగు దశాబ్దాలకు పైనే. కవయిత్రిగా, నవలా రచయిత్రిగా, కథా రచయిత్రిగా, నాటక రచయిత్రిగా, వ్యాసకర్త్రిగా, బాలసాహిత్య రచయిత్రిగా పరిశోధకురాలిగా, తులనాత్మక సాహిత్య పరిశీలకురాలిగా తెలుగు నాట సుపరిచితురాలైన కవయిత్రి డా॥భవానీదేవిగారు. దాదాపు 12 సంపుటాల కవిత్వాన్ని ప్రపంచానికి అందించిన భవానీదేవి గారు ప్రస్తుతం అందిస్తున్న కవితా సంపుటి "ఇంత దూరం గడిచాక". ఇందులో 88 కవితలున్నాయి.

సాధారణంగా 'ఇంత కాలం గడిచాక' అంటాం. కానీ భవానీగారు 'ఇంత దూరం గడిచాక' అని కవితాత్మకంగా పుస్తకానికి పేరు పెట్టటంలోనే ఒక ప్రత్యేకతను ప్రదర్శించారు. కాలానికి దూరానికి అభేదం పాటించారు. కవిత్వం ఒక తపస్సు, ఒక ఆవేదన, ఒక ఆక్రందన, ఒక నిర్వేదం, ఒక సానుభూతి, ఒక సానుతాపం ఇలాంటి లక్షణాలతో మిళితమైన భవానీ గారి కవిత్వం సమాజంలోని అనేక విషయాలకు ప్రతిబింబంగా నిలుస్తోంది. ఇందులోని కవితలన్నీ ఆయా పత్రికల్లో ప్రచురితమైనవే. ఆయా కవితలు ముద్రించబడిన తీరును గమనిస్తే భవానీగారు నిత్య కవితా చైతన్య స్రవంతిగా సాగినట్లు తెలుస్తుంది.

స్పందించే హృదయం ఉండటం వల్లనే సమాజంలో జరుగుతున్న పలు విషయాలను కవిత్వరూపంలో అందించారు. వీరికి దేశాన్ని రక్షించే సైనికుల మీద సానుభూతి ఉంది. అమ్మ పట్ల అమితమైన గౌరవం ఉంది. నాన్నను గుర్తుకు తెచ్చుకొనే సంస్కారం ఉంది. తెలుగు భాషపట్ల మమకారం ఉంది. భాషను కాపాడుకోవాలనే తపన ఉంది.

'అమ్మ నిజం చెప్పదు' అనే శీర్షికతోనే 'ఇంత దూరం గడిచాక' అనే కవితా సంపుటి ప్రారంభమైంది. శీర్షికను చదవగానే పాఠకుని ఒక ఉత్కంఠ కలుగుతుంది. అమ్మ నిజం చెప్పకపోవటమేంటి? అనే సందేహం కలుగుతుంది. కానీ కవితను చదువుతున్నప్పుడు అమ్మ అంతరంగ ఆవేదన స్పష్టమవుతుంది. "నేను పై చదువుల కెగబాకినప్పుడల్లా మాయమయిన నీ ఒక్కొక్క నగ- అమ్ముడు పోయిన స్త్రీ ధనాలు- అద్దంలో నువ్వు చూసుకుంటున్నప్పుడల్లా- భంగపాటుతో తత్తరపడే నీ బోసిమెడ చూస్తూ- మళ్లీ అన్నీ వచ్చేస్తాయి లేమ్మా- అనే నామాటలు అబద్ధపు ప్రతిధ్వనులై నప్పుడూ... గోడకున్న అద్దాన్ని చూడటం మానేసావు గానీ- నువ్వు నిజం చెప్పలేదు" అన్న కవితను చదివినప్పుడు బిడ్డ ఉన్నతి కోసం తల్లి సంపద కరిగిపోయిన తీరు సాక్షాత్కరిస్తుంది. కళ్లు చెమరింప చేస్తుంది.

ఆడపిల్లల పట్ల సానుభూతితో ఉండాలని, ఆడయినా, మగయినా ఒకటేనని, ఆడయితే మరింత మంచిదని చెప్పారు. మనిషితనం కోల్పోతున్నందుకు ఆవేదన చెందారు. అక్షరాల్ని పరభాషా పెత్తనానికి తలొంచుకొని- శిల్పులు కరువైన శిలలు గా భావించి భాషను కోల్పోతున్న తీరును తెల్పారు. అమ్మ భాషను పోగొట్టు




కోకూడదని, అది నిరంతరం మన ఉనికిని నిలబెడుతుందని, జాతిని చిరంతనంగా బతికిస్తుందని చెప్పారు.

ఉగ్రవాద మహమ్మారిని నిరసిస్తూ ప్రతి ఒక్కరూ చైతన్య వంతులు కావాలని "ప్రతి మనిషి కళ్లు- సి.సి కెమేరాలుగా రూపుదిద్దుకోక తప్పదు- ఇక. ప్రతి క్షణం... ప్రతి ఒక్కరం- మెటల్ డిటెక్టర్లం కాకతప్పదు" అని ప్రబోధించారు. బాల్యస్మృతుల్ని కూడా కొన్ని కవితల్లో పదిలపరిచారు.

వృద్ధుల్ని పట్టించుకోని వారిని పరోక్షంగా ఎత్తిపొడిచారు, వృద్ధాప్యంలో అయినా వారి పలకరింపు, ఆత్మీయస్పర్శ కావాలి. కానీ నేటి సమాజం మనిషితనాన్ని కోల్పోతున్నది. కన్నవారిని కనీసం పలకరించటానికి కూడా తీరికలేని జీవితాల్ని గడుపుతున్నారు. 'ఇవి చాలురా' అనే కవితలో "నా అపరిశుభ్రతకు చీదరగా ఉందా- నిన్ను శుభ్రంగా ఉంచటానికి- పాట్లెన్ని పడ్డాను తండ్రీ; - ఈ చివరిరోజులు- దురదృష్టఫలాలుగా మిగిలిపోవటం నాకిష్టంలేదు- రెండు మాటలు- అప్పటి స్పర్శ- ఆరిపోని దీపంలాంటి ఆ చిరునవ్వు- ఇవి చాలురా- మనసారా హంస ఎగిరి పోవటానికి" అని చెప్పటాన్ని బట్టి వృద్ధులపట్ల బాధ్యతతో మెలగాలని తెలుస్తోంది. మాతృ దినోత్సవం సందర్భంగా రచించిన కవితలో "అమ్మ నాతో ఉంటే- ఎన్ని అవమానాలనయినా క్షమిస్తాను. ఎన్ని గాయాలయినా భరిస్తారు. ఎన్నెన్ని మరణాలయినా జయిస్తాను" అని ఆత్మవిశ్వాసాన్ని ప్రకటించారు.

'గాయాల కుంపటి'లో వ్యక్తిత్వ వికాస ప్రబోధం చేశారు. 'ముక్తకాలు' కవితలో "నిద్రపోతూ కనే కలలు- నిజం కావు- నిద్రని త్యాగం చేసిన కలలే- నిజమవుతాయి" అని శ్రమను చెయ్యవలసిన తీరును గుర్తు చేశారు. తెలుగు రాష్ట్రం రెండుగా విడిపోయినప్పుడు "ఒక తొడిమె- రెండు పూలు" అనే కవితను రచించి" కాలం విడదీసినా- కలిసుండే కంటి చూపు మనది- ఉచ్ఛ్వాస నిశ్వాసాల ఊపిరి ఇది" అని సమరస భావాన్ని ప్రకటించారు. నీటి తల్లి ఋణం తీర్చుకోవటానికి మరో నదిగా పుడతానని రచయిత్రి తన కాంక్షను వ్యక్తం చేశారు. పల్లెల్ని వీడి పట్టణాలకు వచ్చినా పల్లెతనాన్ని కోల్పోని తత్వాన్ని వివరిస్తూ" ఇక్కడ ఎవరి కళ్లల్లోకి చూసినా- ఏదో ఒక పల్లె- వలసాగ్నిలా జ్వలిస్తుంది" అన్నారు. ఒక కవితలో రైతును "బువ్వ దేవుడు" పదంతో ప్రస్తావించిన కవయిత్రి పదశక్తి ఆశ్చర్యానికి గురిచేస్తుంది.

కవిత్వం సమాజాన్ని అంటిపెట్టుకొని, సమాజానికి ప్రబోధం చేస్తుందనే భావానికి దర్పణం ఈ కవితా సంపుటి. కవిత్వాభిమానులు కొని చదవదగ్గ పుస్తకం ఇది : **ఇంతదూరం గడిచాక**- కవితా సంపుటి -రచన :డా॥ సి. భవానీదేవి, తొలిముద్రణ 2015. ప్రతులకు ఫోను : 040 27636172, వెల : రూ 150/-

**-డా॥గుమ్మా సాంబశివరావు,** 98492 65025

పుస్తక సమీక్షలు

# కాశీం కవిత్వం

ప్రజల బాధని ప్రజల భాషలోనే రాసిన సమగ్ర కవితా సంకలనం!

"తెలంగాణ కన్నీళ్ళను కలంలో నింపటం ద్రోహమైతే/ నేను రాజద్రోహం చేయడానికి సిద్ధం" -రాజద్రోహం- జూన్ 2012.

ఈరోజు/ నా స్వేచ్ఛ/మూడు రంగుల జెండాతో/ ప్రశ్నార్థకమైంది?! - స్వేచ్ఛ-జనవరి 1999.

పై రెండు కవితాఖండాలను చూస్తే చాలు కాశీం తత్త్వం, కవిత్వం, కవిత్వ తత్త్వంపై అవగాహన ఏర్పడి, విప్లవోద్యమాన్ని తెలంగాణా ఉద్యమాన్ని కవి ఒకే స్థాయిలో భావించినట్లుగా అర్థం అయిపోతుంది, బాల్యంలో కమ్యూనిస్టు పార్టీ వాళ్లపాటలు, దళాలు పాడేపాటలు వినటం, అవి తన జీవితానికి దగ్గరగా ఉన్నాయని భావించటం, 1990 నుంచీ చిన్న చిన్న మార్పులు చేసి ఆపాటలను మళ్లీ సొంతంగా రాయటం, శ్రీశ్రీ 'మహాప్రస్థానం' పరిచయం, యిక మలిదశ తెలంగాణా ఉద్యమం, అన్నిటినీమించి 'విరసం' సభలకు హాజరవటం, చెరబండరాజు, శివసాగర్, ప్రభాకర్, సముద్రుడు మొ॥ వారి కవిత్వం చదివి 'కవిత్వం అంటే యిలా రాయాలి' అని తెలుసుకుని అలా రాసిన కవిత్వం ఇది అని కవి కాశీం తన కవితా ప్రస్థానం గురించి చెప్పారు. ఇంటర్మీడియట్ చదువుతున్న రోజుల్లో (1994) కళాశాల వార్షిక సంచిక సమతలో 'తెలుపు' పేరున మొదటి కవిత అచ్చయింది. కళాశాల పరిసరాలను వర్ణిస్తూ అందులో భాగంగా, వరిమడి పచ్చదైన/ వరిఎన్నులు ఎరుపైన/ మా విద్యార్థులు మాత్రం తెలుపు/ చూసేటి నయనాలు నలుపైన/ సూర్యుడు ఎరుపైన/ చుక్కల్లాంటి మా విద్యార్థులు తెలుపు/ అదొక వర్ణణాతీత ఆవర్ణం' అని చెపుతూ "జ్ఞానమార్గం ఇక్కడుంది/ వస్తూ వస్తూ/ కాలే కడుపుల కారకులపై కసితో రండి/" అంటూ ప్రారంభించిన కవితా ప్రస్థానం 2014 సం॥ వరకు అంటే రెండు దశాబ్దాల పాటుగా ప్రచురింపబడిన కవితల సంకలనం ఈ పుస్తకం.

ఇందులో 3 దీర్ఘకవితలు 90 చిన్న కవితలు ఉన్నాయి. దీర్ఘకవితలలో 'పొలమారిన పాలమూరు' (2003) 'గుత్తికొండ' (2005) మూడవది 'చెలిమి' పేరున ప్రచురింపబడిన 'మానాల' (2006) మిగిలిన 90 కవితలు 1994 నుండీ మొదలు 2014 వరకు వివిధ పత్రికలలో ప్రచురితం అయ్యాయి.

వీటిలో 'తెలంగాణ' శీర్షికతోనే 8 కవితలు, తెలంగాణ ప్రస్తావనతో 10 కిపైగా కవితలున్నాయి. తెలంగాణా రాష్ట్రం ఏర్పడిన తరువాత ప్రచురించిన కవిత (జూన్-2014) 'తెలంగాణ' శీర్షికలో 'అరవైఏళ్ల అజ్ఞాత వాసంవీడి/ చనుబాలధారలా ప్రవహిస్తున్నపాట/ నా తెలంగాణ' అని ముగించాడు కవి కాశీం. 'వేదకాలం' 'లక్షింపేట' మరియు 'రోడ్డు మీదదండోరా' యివి దళిత కవిత్వం కోవలోకి వస్తాయి. 'అతడు' (ఆకులభూమయ్యపై) 'వెలుతురు పువ్వు' (జనప్రియ జనార్థనుడిపై) 'రాలిపడిన నేస్తం' (రియాజ్‌పై) 'అతడే మా హీరో' 'భగత్‌సింగ్' 'జోహార్' (శివసాగర్, సత్యమూర్తిలపై) అక్షరనివాళి, అశ్రునివేదన చేశాడు. ఈ విధంగా, అడవి నుంచి అంతర్జాతీయందాకా కాశీం చూడని కవితా వస్తువులేదు. ఏ కవిత చదివినా తాజాగా ఉంటుంది, ఏమాట ముట్టుకున్నా రేగుపండులా రుచిగా ఉంటుంది. తెలంగాణ మట్టితడి, ఆ నీటిరుచి తెలిసిన కాశీం విప్లవ కవితలో దేశవాళీ కవిగా ప్రసిద్ధి చెందటం కనిపిస్తుంది.

తెలంగాణా స్వప్నం...సాకారం చేసుకున్న నిర్వివాదాంశం, వృత్తిరీత్యా నిజాం కాలేజీలో తెలుగు విభాగం అధిపతిగాను, అసిస్టెంట్ ప్రొఫెసర్‌గాను సాహిత్యాన్ని అధ్యాపనం చేస్తూ, ప్రవృత్తిపరంగా రచనలు చేస్తూ, మార్క్సిస్టు సిద్ధాంతాలను బోధిస్తున్నారు. శ్రీవరవరరావు చెప్పినట్లు "కాల్పనికత, ప్రకృతిలో మనుషుల్ని, ఘటనల్ని, పరిసరాల్ని- అంతర్భాగంగా చూసే గతితార్కి భౌతికవాద దృష్టి కాశీం కవిత్వానికి బలం".

తెలంగాణేతరులకు, విప్లవ సాహిత్యం పరిచయం చేసుకోవాలని అభిలషించేవారికి "కాశీం కవిత్వం" పుస్తకం సహాయకారి అవుతుంది. 266 పుటలు, రు.140/-లు. దొరుకుచోటు : నవోదయ బుక్‌హౌస్, సహచర బుక్‌మార్క్, హైదరాబాద్

**-ఎమ్.వి.శాస్త్రి,** గుంటూరు, 94413 42999

పుస్తక సమీక్షలు

## కళింగాంధ్ర జానపద గేయాలు




పల్లె ప్రజల హృదయ స్పందన జానపదగేయం. జానపదుల కష్ట సుఖాల అభివ్యక్తీకరణ జానపద సాహిత్యం. అనాచ్ఛాదిత ఆలోచనా స్రవంతికి ప్రతిరూపం జానపద సాహిత్యం. పండిత ప్రకాండుల నిరసనకు లోనయినా కాలానికి ఎదురీది, రసికుల రసనలపై రాగరంజితంగా రంజిల్లుతున్న జానపద సాహిత్యాన్ని సేకరించడం, దాన్ని ప్రచురించడం కన్నా క్లిష్టమయిన కార్యం. ఆ కార్యాన్ని బద్రి కూర్మారావు గారు సమర్థవంతంగా నిర్వహించారు. ఆయా ప్రాంతాల జానపదగేయాల సంకలనాలు గతంలో కూడా ప్రచురింపబడినా, ఆ సంకలనాలకు భిన్నంగా, వైవిధ్యంగా ప్రచురించటం కూర్మారావు గారి విశిష్టత.

జానపద గేయాల్లో మాండలికాలు తప్పక చోటు చేసుకుంటాయి. ఆ పదాలు ఇతర ప్రాంతాల వారికి అర్థం అయ్యే అవకాశం తక్కువ. కూర్మారావు గారు ఆ పదాలకు అర్థాలను సూచించి, కళింగాంధ్ర జానపద గేయాలను ఆంధ్రుల జానపద గేయాలుగా మార్చివేశారు. ఆ ప్రాంతానికి చెందిన గేయాల వెనుక వున్న చరిత్రను, ఏయే సందర్భాలలో పాడతారనే విషయాలను, ఇలా ఇతర ప్రాంతాల వారికి ఆ పాటల సమగ్రతను తెలియజేయడం వారికి జానపద గేయాల మీద ఆదరాన్ని వెల్లడి చేస్తుంది. తాను సేకరించిన పాటలను, స్త్రీల పాటలు, పొలం పాటలు, గౌరమ్మ పండుగల పాటలు, సరస శృంగార పాటలు, వీరచరితలు, ఉద్దానం పాటలు, జన జీవన స్రవంతిలో జానపదాలు- ఇలా సుమారు ముప్ఫయ్ రకాలుగా విభాగం చేసి, ఒక పరిశోధన అనిపించేలా చేసిన కూర్మారావు గారి కృషి అనన్యసామాన్యం. అందుకు ఆయనను అభినందించాల్సిందే. ఉత్తరాంధ్ర జానపద గీతాల బాణీలలో వచ్చిన సినిమా పాటలను కూడా ఆయన విడువక పోవడం- గ్రంథ సమగ్రతను సూచిస్తుంది.

ఈ గ్రంథం జానపద గేయాల మీద అన్ని ప్రాంతాల ఆంధ్రులకు అభిమానం కలిగించేలా రూపొందిన కూర్మారావు గారి కృషి భవిష్యత్తులో జానపద గేయాలను ప్రచురించేవారికి కరదీపిక అవుతుంది.

**కళింగాంధ్ర జానపదగేయాలు** : సంకలనం, రచన : బద్రి కూర్మారావు, పుటలు : 488, వెల : రు.300/-లు. ప్రతులకు : శ్రీమతి బద్రి లక్ష్మీఫణిశ్రీ, బద్రి కూర్మారావు, 26-3-26, కొత్తవీధి, దాసన్నపేట, విజయనగరం- 535 002

**-డాక్టర్ నాగభైరవ ఆదినారాయణ,**
98497 99711

## కాంతారావు కథలు రసగుళికలు

కథ అంటే సంభాషించడం, చెప్పడం. కథ్ అనే దాతువు నుండే కథ పుట్టింది. కథకు కొంత ప్రాచీనత ఉన్నా, దానికి నిర్దిష్టమైన రూపం ఏర్పడింది ఇటీవలే. పాశ్చాత్య సాహిత్యంతో తెలుగు సాహిత్యానికి సంబంధం ఏర్పడ్డ తర్వాత ఇది పెంపొందింది. ఉదాత్తత, పొందిక, సంభ్రమాశ్చర్యాల్ని కలిగించడం, కరుణ అద్భుతరసాల్ని పోషించడం ఆనందాన్ని కల్గించడం కథ లక్షణాలు.

జీవితం ఎలా నడుస్తుందో చూపించడం, ఎలా నడవకూడదో వివరించడం, ఎలా నడిస్తే బావుంటుందో సూచించడం ఆయన కథల ప్రధాన లక్షణం.

కొన్ని కథల్ని చదివినప్పుడు అత్యాధునిక కవిత్వం గుర్తుకొస్తుంటుంది. మొట్టమొదటిదైన చౌరబాటు కథలో రచయిత ఇలా చెప్తారు. 'చిరిగిపోయిన బట్టలనైతే మళ్ళా కుట్టించుకోగలను గానీ ఇగిరిపోతున్న మనసులను ఏంచెయ్యగలను?' అని.

ఇది చదివినప్పుడు మనకు స్త్రీవాద కవిత్వం గుర్తుకు వస్తుంది. పాలింకిపోవడానికున్నట్లే మనసింకిపోవడానికి మాత్రలుంటే ఎంత బావుణ్ణు.. అంటుంది స్త్రీవాదం.

అలానే ఉస్మానియా గరల్స్ కాలేజీని గురించి చెప్పిన కథలో 'గేటు లోపల హరితం/గేటు దాటితే జ్వలితం' అంటారాయన.

ఇంకా పాముకాటు, సలీమ్‌కాకా, ఎంచిచూడగ రెండె కులములు, చిన్నారి దంపతులు, మా ఊరు అమృతం కొనుక్కోండ్రీ, అనివార్యం, ఆ గాయం మాననిది. ఇంటింటి కథ, పూర్ణమ్మ చెరువు, అభిజాత్యం, బొమ్మ-బొరుసు, ఓ అమ్మకథ, తిరిగొచ్చిన బాల్యం, సాక్షి, బిగిసిన ఆ పిడికిళ్ళు, తెరవెనుక సంపెంగపూలు-అని రకరకాల




కథలు ఆ సంపుటిలో దొరుకుతాయి.

ఒక్కొక్క కథకు ఇక్కొక్క సంఘటన ఇతివృత్తమయింది. చదువుకున్నవారు చదువు సంధ్యలు లేనివారు, ధనవంతులు, పేదవారు, పిల్లలు, పెద్దలు, పట్టణవాసులు, గిరిజనులు- ఇలా అందరినీ గమనించి వారి వారి జీవితాల్ని బాగా చదివి కథలుగా మలిచారు రచయిత శిరంశెట్టి కాంతారావు.

పల్లెటూళ్ళవాళ్ళు మాట్లాడుకునే భాషను రచయిత బాగా అలవరచుకొని ఒడిసి పట్టుకున్నాడనిపిస్తుంది.

చంద్రవంకల్లా ఎగిరే చేపపిల్లలు, చార్‌ధామ్ యాత్రలో చిక్కుబడిన యాత్రికులు-వడగళ్ళ వాన కురిసిన సమయాన కనబడే అరటితోటలాంటి సంత మొదలైన ఉపమానాలు రూపకాలు చక్కగా ప్రయోగించాడాయన. కథకుడు వాస్తవాన్ని చిత్రించడంలో కేవలం మన కళ్ళకు కనబడే దృశ్యాల్ని మాత్రమే కాకుండా జరిగే సంఘటనలకు కూడా ప్రాధాన్యమిచ్చాడు.

'చౌరబాటు' కథల సంపుటి, రచన : శిరంశెట్టి కాంతారావు, పుటలు 198, వెల : రు.150/-లు. ప్రతులకు : రచయిత, ఇం. నెం.1-1-177, మమతలకోవెల, శ్రీనివాసపురం కాలనీ, పాత పాల్వంచ-507 115, ఖమ్మం జిల్లా. సెల్ : 98498 90322.

**-డా॥చింతపల్లి సత్యనారాయణ**, 98668 05870

## కొలచల సీతారామయ్య జీవిత చరిత్ర

సీతారామయ్య గారి మూలం మెదక్ జిల్లాలోని కొలచల గ్రామం. అక్కడ నుండి వలస వచ్చి ఉయ్యూరు దగ్గర యాకమూరులో వుండేవారు. ఆయన 1899 జులై 15న జన్మించారు. ఆయిల్ సైన్సులో అంతర్జాతీయ ఖ్యాతి పొందారు. సీతారామయ్య గారు ఉయ్యూరులో ప్రాథమిక విద్య నభ్యసించి మచిలీ పట్నంలో సెకండరీ విద్య పూర్తి చేశారు. ఆయనకు గణితం ఫిజిక్స్‌పై అభిమానం ఎక్కువ. ఒక సిఫార్సు ఉత్తరంతో నడిచి మద్రాసు చేరుకున్నారు సీతారామయ్య. 1921లో బ్యాచిలర్ ఆఫ్ సైన్స్ డిగ్రీ పొందారు.

ఎన్నో ఇబ్బందులు ఎదుర్కొని ఓడలో ప్రయాణించి న్యూయార్క్ చేరుకున్నారు. సీతారామయ్య 1922లో చికాగో యూనివర్సిటీలో చేరారు. చికాగో చదువుకు పని చేయవలసి వచ్చింది. ఎటువంటి పనైనా చేసి కాస్త డబ్బు సంపాదించారు. కొలంబియా యూనివర్సిటీ గ్రాడ్యుయేట్ స్కూలులో 1925లో కొన్ని కోర్సులు చేశారు. ఆర్థిక ఇబ్బందుల వల్ల చదువు మానవలసి వచ్చింది. 1928లో మళ్ళీ యూనివర్సిటీలో చేరారు. అందరికంటే ఒక ఏడాది ముందే పిహెచ్‌డి అందుకున్నారు. (పుట :56) ఆ తర్వాత ఒక ప్రైవేటు సంస్థ ఉద్యోగం ఇచ్చి లాబరేటరీ బాధ్యతలను అప్పగించింది.

న్యూయార్కులో పరిచయమైన ఒక కమ్యూనిస్టు పెద్దాయన వలన కమ్యూనిజానికి దగ్గరయ్యారు సీతారామయ్య. ఆయన పరిశోధనలు ఫలించాయి. కంపెనీకి మంచి ఆఫర్లు వచ్చాయి. అయితే రామయ్య గార్కి పూర్తి స్వేచ్ఛ లేదు. దీంతో రష్యా ప్రయాణానికి సిద్ధమయ్యారు. 1930 డిసెంబరు 17న ఆయన మాస్కో చేరారు. రష్యాలో ఆయన ఉన్నత పదవుల్లో అలంకరించారు. యుద్ధ ట్యాంకులకు ప్రత్యేక కిరోసిన్ ఇంధనాన్ని తయారు చేశారు (పుట : 69)

సీతారామయ్య గారు 1963 మేలో ఉయ్యూరు వచ్చారు. అప్పటికి సుమారు 50 ఏండ్ల క్రితమే ఉయ్యూరు వదిలేశారు. 1963 ఏప్రిల్ 22 నుండి జూన్ 5 వరకు 42 రోజులు మాత్రమే మన దేశంలో గడిపి మరల రష్యా వెళ్ళారు. 1977 సెప్టెంబరు 29న తన 78వ ఏట ఆయన రష్యాలో మరణించారు.

సీతారామయ్య గారు ఆంధ్రుల చరిత్రను రష్యన్ భాషలోకి అనువదించారు (పుట:100) ఇంతటి మేధావి పరిశోధకుడు మన తెలుగువాడై నందుకు మనం గర్వించాలి. ఈ పుస్తకం సరస భారతి (ఉయ్యూరు) ప్రచురణ.

కెమోటాలజి పిత కొలచల సీతారామయ్య–పుల్లేరు నుండి వోల్గా దాకా. రచయిత : గబ్బిట దుర్గాప్రసాద్. పుటలు : 144, వెల : రు.100/–లు, ప్రతులకు : రచయిత, 2–405, శివాలయం వీధి, రాజాగారి కోట దగ్గర, ఉయ్యూరు–521 165, కృష్ణాజిల్లా. సెల్ : 99890 66375.

**–డా॥ఇమ్మానేని సత్యసుందరం,** 94400 40061

## కవితా ప్రసవం

మన చుట్టూ జరిగే సంఘటనలకు కవి స్పందించటం సహజం. కవిత్వం గురించి రచయిత ఇలా అంటారు (పుట : 27) 'కలం నుండి జాలువారదు../ కవిత్వం జీవనదిలా /కదిలిన ఎద నుండి/ఎగసిపడుతుంది సంద్రంలో అలలుగా' తూటాలా దూసుకు పోయే నానోలు వ్రాశారు కవి.

కొన్ని నిత్యసత్యాలను మన ముందు ఉంచారు కవి. ఉదాహరణకు (పుట : 43) కత్తికన్న పదునైనది నాలు/ చుక్క రక్తం పడకుండానే/చంపే శక్తివంతమైనది నాలుక/ మాట్లాడవలసిన చోట మౌనం దాల్చకు/ మౌనంగా ఉండవలసిన చోట మాట్లాడకు.

తెలుగు భాష గురించి కవి ఇలా అంటారు. (పుట : 55) తేనెలూరు మధురమైన భాష తెలుగు ఒక్కటియే / రసభరితంగా పలికించును తెలుగుభాష/ తెలుగు –తెనుగు–ఆంధ్ర పదము లందు/ ఎదిగి ఒదుగుచుందును మన మాతృభాష.

ఈ పుస్తకంలో 77 కవితలు వున్నాయి. కొన్ని బాలగేయాలు, హైకూలు, నానోలు, నానీలు వున్నాయి. ఇవన్నీ కొత్తగూడెం ఆకాశ వాణి కేంద్రం నుంచి ప్రసారమైనవే. విశ్రాంత ఉపాధ్యాయుడైన బొబ్బిలి జోసెఫ్ గారు అనేక పురస్కారాలు అందుకున్నారు.

మనసు కురిసిన చినుకులు. రచయిత : బొబ్బిలి జోసెఫ్, పుటలు : 85, వెల : రు.100/–లు. ప్రతులకు : రచయిత, 16–116 బి, నేతాజీరోడ్, సత్తుపల్లి–507 303, ఖమ్మం జిల్లా.

**–డా॥ఇమ్మానేని సత్యసుందరం,** 94400 40061

### పుస్తక పరిచయం

## దేశభక్త కొండ వెంకటప్పయ్య స్వీయచరిత్ర–మరికొన్ని రచనలు

స్వరాజ్య సమర సేనాని, ఆంధ్ర రాష్ట్ర ఉద్యమ పితామహుడు దేశభక్త బిరుదు వహించిన కొండ వెంకటప్పయ్య స్వీయ చరిత్ర గ్రంథం ఇది. సంస్కృతి సంస్థ వ్యవస్థాపకులు సర్రాజు బాలచందర్ గ్రంథ పునర్ముద్రణకు కారకులు. సంపాదకుడు –మోదుగుల రవికృష్ణ. ప్రతి ఒక్కరూ చదువదగినది ఈ గ్రంథం.

దేశభక్త కొండ వెంకటప్పయ్య స్వీయచరిత్ర–మరికొన్ని రచనలు. పుటలు : 303, వెల: రు.250/–లు. ప్రతులకు: నవోదయ బుక్ హౌస్, హైదరాబాద్, విశాలాంధ్ర బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలలో.

సమాజానికి దారిదీపాలు
డా॥బి.ధన్వంతరి ఆచార్య రచనలు
**1. సుపథం, 2. స్వయంకృతం, 3. జీవన సంధ్య,**
**4. ఒంటరి పక్షులు జంటలయ్యాయి.**
రచయిత : **డాక్టర్ బి.ధన్వంతరి ఆచార్య,**
వెల : అమూల్యం
ప్రతులకు : డా॥బి.ధన్వంతరి ఆచార్య, మచిలీపట్నం-1

కొత్త రోగానికి చికిత్స మొదలు పెడుతున్న 59 కవితల సంపుటి
**రేపటి జ్ఞాపకం**
రచయిత : **అడిగోపుల వెంకటరత్నమ్**
రేపటి జ్ఞాపకం (కవితా సంపుటి)
పుటలు : 128,
వెల : రు.100/-లు. ప్రతులకు : అడిగోపుల వెంకటరత్నమ్, కావేరి రెసిడెన్సీ, అరబిందోమార్గ్, ఎన్.జి.వొ.కాలనీ, తిరుపతి-517 507, చిత్తూరుజిల్లా. చరవాణి :98482 52946

వేదప్రియులకు వేమన్నను దగ్గరగా తీసుకొచ్చిన వ్యాఖ్యాన గ్రంథం **శ్రీ వేమన యోగీంద్ర స్వాములవారి వేదవాణి**
రచయిత : **చిర్రావూరి సుబ్బయాచారి**
శ్రీ వేమన యోగీంద్ర స్వాములవారి వేదవాణి, పుటలు : 223, వెల : రు.150/-లు. ప్రతులకు : చిర్రావూరి సుబ్బయాచారి, ఇం.నెం.699, ఇందిరాకాలనీ, 5వలైను, సంగడి గుంట, గుంటూరు-522 003, చరవాణి :8179325065

వాస్తవిక దృష్టిగల కవితా సంపుటి-
**దోసిలిలో నది**
రచయిత : **దాట్ల దేవదానం రాజు**, పుటలు : 84, వెల : రు.60/-లు,

**సాత్వికభావాల సౌందర్యశిల్పి - దాట్ల దేవదానం రాజు**
రచయిత : **సౌభాగ్య,** పుటలు : 70, వెల : రు.60/-లు
ప్రతులకు: దాట్ల దేవదానం రాజు, ఇం.నెం.8-048, ఉదయిని, జక్రియనగర్, యానాం-533 464, చరవాణి : 94401 05984

ఒంటిమిట్ల శ్రీరాముని కథను తేటతెల్లంగా తెలిపిన గ్రంథం-
**ఒంటిమిట్ట రాముడు కోదండరాముడు**
రచయిత : **అలపర్తి పిచ్చయ్య చౌదరి**
ఒంటిమిట్ట రాముడు కోదండరాముడు (కథాగ్రంథం), పుటలు : 100, వెల : అమూల్యం, ప్రతులకు : ఏ.పిచ్చయ్య చౌదరి, జాయింట్ సెక్రెటరీ (రిటైర్డు) ఇం.నెం.42-169, జయనగర్ కాలనీ, కడప-516 002, వై.యస్.ఆర్.జిల్లా, చరవాణి : 9177013845

వజ్రసమానమైన పద్యాలకు టీకా తాత్పర్యసహిత వ్యాఖ్యానం **విష్ణుపదశావతారస్తవము.** పీఠికాకర్త : **ఉన్నం జ్యోతివాసు**
విష్ణుపదశావతారస్తవము (వ్యాఖ్యానం), పుటలు : 48,
వెల : రు.36/-లు. ప్రతులకు : ఉన్నం జ్యోతివాసు, వేములవాడు (పోస్టు) పెరిదేపి (వయా) ప్రకాశం జిల్లా. చరవాణి :9542459954

మూడు ఆశ్వాసాల పద్యకావ్యం- **వల్లవీపల్లవోల్లాసము.**
రచయిత : **మాడభూషి నరసింహాచార్యులు**
వల్లవీ పల్లవోల్లాసము (పద్యకావ్యం), పుటలు : 136, వెల : రు.50/లు,
ప్రతులకు : రావి మోహనరావు, దండిహౌస్, ప్లాట్ నెం.404, జంజనం కాంప్లెక్స్, ఒన్‌టౌన్ పోలీస్‌స్టేషన్ ఎదురుగా, చీరాల-523 155, ప్రకాశం జిల్లా. చరవాణి : 94401 15411

ఒక్కమాట

-డా॥వేదగిరి రాంబాబు
93913 43916

# గురజాడ స్మృతుల్ని కాపాడుదాం



విజయనగరానికి ఇంతటి ప్రాధాన్యత లభించడానికి కారణం అది గురజాడ అప్పారావు గారు నడయాడిన నేల కాబట్టి. ఎక్కడెక్కడ నుంచో వచ్చేవాళ్లు విజయనగరం గడ్డమీద అడుగుపెట్టగానే ఆ మట్టిని కళ్ళకద్దుకునేది అందుకే. ఒంటిచేత్తో తెలుగు భాషాసాహిత్యాల్ని ఆధునీకరించి పెట్టి, అక్షరాన్ని ఆయుధంగా చేసుకొని సమాజాన్ని సంస్కరించవచ్చని నిరూపించిన ఆయనకు ఈ నేలమీద సముచిత గౌరవం లభిస్తోందా? ఆయన స్మృతి చిహ్నాలను భద్రపరచి ముందుతరాల వాళ్ళకి అపురూపంగా అందించాల్సిన బాధ్యత జరగాల్సిన విధంగా జరుగుతోందా? ఆయన నివసించిన పరిసర ప్రాంతీయులు మరింత బాధ్యతగా ఆలోచించాలి.

తనకి అక్కరలేకపోయినా ఓ పెద్ద భవనాన్ని తమవాళ్ళ కోసం తన ఇంటి పడమర వైపు కట్టించాడు. తానందులోకి ప్రవేశించలేదు. దానిని ఈనాడు ఆయన వారసులు అమ్ముకుంటే లక్షలు లభిస్తాయి. వారసుల పేర వున్న ఆ ఇంటిని కొనుగోలు చేసి దానిని గురజాడ స్మృతి మందిరం(మ్యూజియం)గా చేయడానికి ఆలోచన జరిగింది.

ప్రభుత్వం స్పందించాల్సిన విధంగానే స్పందించడం మొదలుపెట్టింది. సంతోషం. ఆ స్పందనకి కార్యరూపం లభిస్తేనే అందరూ ఆనందించేది. పాశ్చాత్య దేశాల్లోని షేక్స్పియర్, కీట్స్, షెల్లీ లాంటి వాళ్ళ ఇళ్ళలా భద్రపరచలేకపోయినా మన పొరుగు రాష్ట్రాల సాహితీవేత్తలు సుబ్రహ్మణ్యభారతి, కువెంపు గారల నివాసాలలా అయినా గురజాడ భవనాన్ని భద్రపరచాలి. పురావస్తుశాఖ ఇంకా పట్టించుకోకుండా చూస్తుండక, తమ విధిని నిర్వర్తించాలి. నగరంలోకి కొత్తవాళ్లు అడుగుపెట్టినా ఇది గురజాడ నివసించిన నేలని, ఆయన నివాసం ఇక్కడే వుందని తెలియజేసేలా పురపాలకశాఖ పట్టణాన్ని అలంకరించాలి. రాష్ట్ర పర్యాటకశాఖ పర్యాటకుల్ని ఆకర్షించి అవగాహనని పెంచేలా బాధ్యత వహించాలి. నలుగురికీ తెలియజెప్పాలి.

ఆ ప్రదేశంలో అంతకుముందు చెప్పినట్లు మ్యూజియం పైన మీటింగ్ హాలును ఏర్పాటు చేయాలి. ఆయన 150వ జయంతి పూర్తయింది గాని ఈ పని మాత్రం అలాగే మిగిలిపోయింది. పూర్తి కాక పోయినంతకాలం గురజాడ అన్న 'మనవాళ్లు ....' అనే విషయం అందరికీ గుర్తొస్తూనే వుంటుంది.

❇

## తెలుగువారిగా మీ ఉనికిని చాటుకొనేందుకు ఈ క్రింది పాటింపులు తప్పనిసరి

### ఆహ్వాన పత్రికలు

మీ ఇంట్లో జరిగే పెళ్ళిళ్ళకు, పుట్టినరోజు, షష్టిపూర్తి మొ॥ ఏ వేడుకకైనా పిలుపు (ఆహ్వానం)లను తెలుగులో ముద్రించండి. తెలుగువారు కానివారిని కూడా మీరు పిలుస్తున్నట్లయితే వారి కోసం ఆ ఆహ్వాన పత్రిక మీదే వేరొకవైపు గాని, విడిగా గాని ఆంగ్లంలో లేదా అవసరమైన మరో భాషలో కూడా ముద్రించండి కానీ తెలుగులో ప్రముఖంగా ఉండాలి.

మన ఉనికికి గుర్తులు మన భాష, మన సంస్కృతి మాత్రమే. వాటిని వదలిపెట్టిన తర్వాత మనకు గుర్తింపు, మర్యాద ఉండవు. ఇతర భాషలను, సంస్కృతులను గౌరవిస్తూనే మన ప్రత్యేకతను మనం కాపాడుకొందాం.

మీరెక్కడ నివసిస్తున్నా- తెలుగు ప్రాంతం కానిచోట నివసిస్తున్నా- ఈ సంప్రదాయాన్ని పాటించండి. కంప్యూటర్లలో 'యూనికోడ్'లో ప్రపంచమంతటా తెలుగు అక్షరాలు అందుబాటులో ఉన్నప్పుడు మనకెందుకు చింత!

### విజిటింగ్ కార్డులు..అవి మన గుర్తింపు చీటీలు

మనం గుర్తింపు చీటీలను -విజిటింగ్ కార్డులను- వేయించుకోవడం ఈ రోజుల్లో పరిపాటి అయింది. ఉద్యోగరీత్యా, వ్యాపార రీత్యా గాని అవి అవసరమవుతాయి. అటువంటి అవసరాలు లేకపోయినా, మన చిరునామా, ఫోన్, ఇ-మెయిల్ వివరాలను తెలుపడానికి గాని- అన్నిటికీ ఈ గుర్తింపు చీటీలు/విజిటింగ్ కార్డులు ఇప్పుడు మన జీవితంలో ఎంతో అక్కరపడుతున్నాయి. వాటిని ఇంగ్లీష్‌లోనే వేయించాలనే 'రూల్' ఏమీ లేదు. తెలుగులో వాటిని ఇవ్వడం మనకు ఆత్మగౌరవం. అవసరమైతే తెలుగు అక్షరాల క్రిందే ఇంగ్లీషులో కూడా ఇద్దాం..లేదా కార్డుకు మరోవైపున ఇద్దాం. ఏమంటారు?

Owned, printed & published by Samala Lakshmana Babu (9440448244) and printed at Sri Mahalakshmi Offset Printers, 16-7-20, Veera Raghavulu Street, Sharabu Bazaar, Tenali, Guntur Dist. and published from 8-386, Jivaka Bhawan, Angalakuduru Post, Tenali Mandal, Guntur Dist. - 522211. Editor: Dr. SAMALA RAMESH BABU (9848016136)
RNI-APTEL/2015/62362




# కోయంబత్తూరులో 'తెలుగువాణి' తరగతులు




కోయంబత్తూరులో 'తెలుగువాణి' తెలుగు తరగతులను నిర్వహిస్తున్న సంగతి అమ్మనుడి పాఠకులకు తెలిసిందే. తొలివిడత 60 మంది తరగతుల్లో పాల్గొని తెలుగు వ్రాయడం, చదవడం నేర్చుకొన్నారు. కోయంబత్తూరులోని పి.ఎస్.జి.సర్వజన హయ్యర్ సెకండరీ పాఠశాలలో కమ్మ మహాజన సంఘం ఆధ్వర్యంలో జరిగిన ఈ తరగతుల ముగింపు సభ దృశ్యాలివి. అతిథులుగా హైదరాబాదు కేంద్రీయ విశ్వవిద్యాలయ ఆచార్యులు గారపాటి ఉమామహేశ్వరరావు, తెలుగు జాతి (ట్రస్టు) ట్రస్టీ పారుపల్లి కోదండరామయ్య, ప్రముఖ రచయిత్రి పైడి చంద్రలత గార్లు పాల్గొన్నారు. స్థానిక రాజకీయ నాయకులు, స్థానిక ప్రముఖులు పాల్గొన్నారు. 300 మందికి పైగా ఈ ప్రాంత ప్రజలు హాజరైనారు. మాట్లాడిన వారంతా తెలుగులోనే మాట్లాడినారు. ఇటువంటి తరగతులు30-40 చోట్ల జరపాలని వక్తలంతా వక్కాణించారు. రాబోయే ఉగాదిలోగా కనీసం 1000 మందికి కమ్మ మహా సమాజం తరఫున తెలుగువాణి తరగతులలో శిక్షణ ఇప్పించాలన్న నిర్ణయాన్ని వారు ప్రకటించారు. ఈ సందర్భంగా కమ్మ మహా సమాజానికి చిన్న తెలుగు గ్రంథాలయాన్ని 'తెలుగువాణి' ఇచ్చింది. హైదరాబాదు లోని 'మంచి పుస్తకం' సంస్థ (సురేష్, భాగ్యలక్ష్మి గార్లు) రెండువేల రూపాయల విలువ గల పుస్తకాలను ఈ గ్రంథాలయానికి పంపించారు. హైదరాబాదు కేంద్రీయ విశ్వవిద్యాలయం ఆచార్యులు డా॥అద్దంకి శ్రీనివాస్ తాను వ్రాసిన 'తెలుగు పండుగలు' పుస్తకం 30 ప్రతులను పంపించారు. సులభశైలిలోని తెలుగు పుస్తకాలను ఎవరైనా ఈ గ్రంథాలయానికి పంపించవచ్చు.

'తెలుగువాణి' ప్రచారకుడు కె.మునిరాజు గారు ఈ తరగతుల్లో బోధకులుగా, రాచకొండల సెందిల్‌గారు మొత్తం కార్యక్రమాలను నిర్వహించారు. జూన్ 5వ తేదీ నుండి ఇదే చోట రెండవ జట్టు తరగతులు మొదలు కానున్నాయి.



